# విషయానుక్రమణిక

## జూలై 1974

# గృహస్థధర్మము

## కళాప్రపూర్ణ, తెనుఁగులెంక తుమ్మల సీతారామమూర్తి

ఒకతఁడు పరివ్రాజకుఁ డా<br>
యతి పుణ్యక్షేత్ర దర్శనాసక్త మతిన్<br>
క్షితి నెల్లం దిరుగుచు నొ<br>
క్కతఱిన్ జనుదెంచె నొక్క కటకమ్మునకున్.

మూఁడు నాళ్లయ్యె నతఁ డన్నమునకు నోఁచి<br>
సైఁపలేఁడాయె సన్న్యాసి జాఠరాగ్ని<br>
అరిగె నంత 'భిక్షాందేహి' యనుచుఁ బెక్కు<br>
తావులకు బోడ యడుగులు తడఁబడంగ.

వంట యగుచున్న దనె నొక్క యింటి మగువ<br>
మరల రమ్మనె నొక్క మందిరవులేమ<br>
నేఁడు వీలుగా దనె నొక్క నెలవు నెలఁత<br>
మెతుకు నిప్పచ్చయయ్యె నయ్యతికి నపుడు.

ఉస్సురనుచు బోడి యొకవీథిలోఁ గూలి<br>
యింత మహికి నన్ను మిడు ప్రభుండు<br>
నన్నుఁ ద్రోయఁ గారణంబేమి యే నెట్టి<br>
యెగ్గు సల్పినాఁడ నిట్లు కుములు.

ఓ పరమేశ్వర ! నను రా<br>
రాపులఁ బెట్టకుము కనికరమ్మునఁ గను మే<br>
నాపన్నుఁడ నా ప్రాణము<br>
గాపాడు మటంచుఁ బెక్కుగతులన్ వగచెన్.

భగవంతుఁ డప్పు డొక వృ<br>
ద్ధుగ నయ్యామి మౌళిమ్రోలఁ దోఁచి యలఁతిగా<br>
నగుచున్ 'మనుజుల నడుగక<br>
వగచెదవేలయ్య వెఱ్ఱి వట్టెనె నీకున్'

అనవుడు 'నే నెందఱనో<br>
కని వేఁడితి భిక్ష; నరులు కారా వారల్<br>
నను వెఱ్ఱి పట్టె నందువు<br>
నినుఁ బట్టిన దందు నే' ననెన్ యతి పెలుచన్.

ముసలి నవ్వి నవ్వి రుసరుస యేల నీ<br>
కన్నవారు నరులు గారు బోడి !<br>
ఇఁగా సులోచనంబు లిడెదను వీనితోఁ<br>
జూడుమని బిరాన సురిఁగిపోయె.

తబిసి యచ్చెరువడుచుఁ దాత యిచ్చిన కంటి<br>
జోడు నవధరించి చూచెఁ బురము<br>
నదిర! వీటివార లంద ఱాతనికి భీ<br>
కరమృగమ్ములట్లు కానఁబడిరి.

ఒక్కఁడు సింహముగా నిం<br>
కొక్కఁడు శార్దూలముగ మఱొక్కఁ డెలుఁగుగా<br>
నొక్కఁడు ములుపందిగ వే<br>
ఱొక్కఁడు తిమ్మఁడుగఁ దోఁచె నోరలనెల్లన్.

అద్దములఁ దీసి చూచెనా యన్నిగాసల<br>
మానవులె కాని మఱియొండు ప్రాణి లేదు;<br>
ఏమి విడ్డూర మిదియని స్వామి మురిసి<br>
తిరిగి తిరిగి పట్టణమెల్లఁ దేఱిచూచె.

రాచబాటప్రక్క నేచి తనర్చిన<br>
రావినీడఁ బాదరక్షకుట్టి<br>
కుక్షి నింపు కొనెడి గొడగరి మాత్రమే<br>
రీతిఁ గనిన నరుని భాతిఁ బొలిచె,

విస్మయంపడి సన్న్యాసి వీట నిట్లు:
డొక్కఁడే నరుఁడా! యిది నిక్కమైనఁ
జనునె యే నిస్పిరో కడజాతి వాని
బిచ్చమడుగుట గొద నెంత నొచ్చుచున్న.

ఏను వీఁడు లోక మిదియెల్ల నాత్మప
దార్థమగుట యూథ వౌనుగాని
దిక్కుమాలినట్టి దేహాభిమానంబు
కదలదయ్యె నన్ను వదలదయ్యె.

వనజభవునుండి చిఱుచీమ వఱకు నఖిల
కాయముల సాక్షిగా నిల్చి క్రాలునట్టి
దొక్కచైతన్యమే యని వక్కణించు
చదువు నేర్చియు నేర్వని జడుఁడ నైతి.

గంగయందుఁ దోఁచు కమలాప్తునకును మా
తంగ వాపి నలరు తరణికిని ర
వంతయేని భేద మగపడునా యింత
తెలిసి దారిదప్పు దేబె నైతి.

చేకొని 'త్వయి మయి చాన్య
త్రైకో విష్ణు' వను సూక్తి నెన్నో సభలన్
వాకొంటిఁ గాని పూర్ణవి
వేకము గననైతి మబ్బువీడమి నకటా!

చేతులకు రాని కూఁతల
వ్రాఁతల నెవ్వనికి ముక్తివచ్చును విశ్వ
ప్రీతి వెలివిరిసి తేఱిన
చేతమ్మునఁ దక్క సమతచేతను దక్కన్.

అని వగచు పరివ్రాజకు
ననుతాపము చర్మకారుఁ డాత్మబలమునన్
గని యతిరాజా! మ్రొక్కులు
కొనుఁడనియెన్ వినయభార కుంచిత తనుఁడై.

మీ యంగద మీ యుఱుమర
మీ యలజడి గంటి సంయమీ! యిఁక దిగులన్
ద్రోయుఁడు మీ మది కింపగు
ఛాయన్ దొలఁగింతు మీ విచారము ననియెన్.

మధుర భక్ష్యంబు లమ్ము బ్రాహ్మణుని విపణి
తనకు నెదురుగ నుంట నత్తావునకు య
తీంద్రునిం జేర్చి యీసామి యెంత కోరు
నంత యిమ్ము మిఠాయి విప్రాగ్ర! యనియె.

నేఁడేను సిద్ధపఱిచిన
జోడునకున్ ముట్టునట్టి సొమ్మెల్లను నీ
కోడక యిచ్చెద ననె నెద
యీడెఱుఁ గని కరుణ పొంగి యివతాళింపన్.

మంచిదనియె బేరి; మస్కరి బూరె లొ
బ్బట్లు లడ్లు కోవ లంగ రొల్లె
లౌఁగు లఱిసె లాదియైన పణ్యారముల్
కుతుకబంటి గాఁగఁ గుడిచి త్రేఁచె.

రాజును మంత్రియు నపుడే
వాజులపై వచ్చి రటకు; వారికి వినయ
శ్రీ దొల్క మ్రొక్కి గొడగరి
యేదో విన్నప మొనర్ప నెంచి భయానన్—

పలుకలేక తొట్రుపడుచుండ నోయి! జం
కేల నీ తలంపు నెఱుక పఱుపు
మనె మహీధవుండు; మన సప్పుడు పాదునం
బడఁగ నుడివె నిట్లు పాదుకృత్తు.

దేవరా! చర్మకారవృత్తిని రవంత
నేర్పు గలవాఁడనే; నివి నేఁడు తీర్చి
నట్టి చెప్పులు, చక్కని గట్టిచెప్పు
లర్హమగు మూల్య మిడి వీని నందుకొనవె!

అనుడు మానవేంద్రుఁ డతనికి శత రూప్య
ములకుఁ జాలు పసిఁడిముద్ర నొసఁగె
నేల యింతపైఁడి యీ తోలుముక్కల
కో దొరా! యటంచుఁ బేద బెదరె.

ఏమో నామది కరఁగిన
దీమాత్రకు నన్నుఁ బ్రోత్సహించిన దిది హె
చ్చో మఱి లొచ్చో తడవకు
భీ మాను మటంచు రాజు ప్రేమలు కురిసెన్.

# గృహస్థ ధర్మము

తా మెంత యిచ్చినను నే
నా మొత్తము నెల్ల నీ బెహారి కిడవలెన్
భూమీశ!; యనె గొడారి య
దేమనెఁ బతి; యతఁడు గ్రంథమెల్లను వినిచెన్.

ఆ జోడు నిట్లు తె మ్మని
రాజు నిజాతులకుఁ జేర్ప రథ్యాజన మా
భూజాని కుగ్రజంతు స
మాజము య్యై కానిపించె మది టిచ్చపడన్.

తాను సింగముగఁ, బ్రధానుండు బెబ్బులి
గా, వణిక్కు కొంగగా, యతీశుఁ
డావుగా, గొడారి యతఁ డొక్కడె నరుండు
గా ధరాధిపతికిఁ గానిపించె.

దొరకు నా సహిల్లె దొరలేని యబ్ర; మా
యమ్య చర్మకారు నట్టె చూచి
యెట్లు వచ్చె నీకు నింత గొప్పతనమ్ము ?
మమ్ముఁ జుట్టుకొన్న మైల యెద్ది?

మాదిగవు కావు నీ వ
న్నా! దివి నెడఁబాసి భువికి నరుదెంచిన వే
ల్పౌదు వన వలదు వలదు మ
హోదయ! నన్నింత మెచ్చు టుచితం బగునే.

శ్రుతులు నేర్వలేదు వ్రతములు పాటింప
లేదు తపము సేయలేదు నదుల
మునుఁగలేదు జన్నముల నేను గావింప
లేదు సురలఁ దేర్పలేదు గాని—

ఈశ్వరార్పణ దృష్టితో నెల్లపనులు
పూనెదను నేను ఫల సంగ బుద్ధి లేక
వచ్చుబడియందు సగముపా లిచ్చుచుందు
నతిథి కభ్యాగతునకు నిండారుపేర్మి.

కడమ సగములో సగమ్ము నా పితరుల
కర్థమైన తిండికై వ్యయింతు
మిగిలినట్టి నాలుగగు పాలు వెచ్చింతు
నా కుటుంబమున కనారతముగ.

ఏను బడసినట్టి మానవత్వమున కీ
నియతి హేతు వగునె నృపవతంస!
యింతనాఁటినుండి యిదియ నా జీవన
మార్గమనె వినీతిమై గొడారి.

రాజపుడు కన్నువిచ్చి యహొరా! త్వదీయ
పథము సామాన్యమా యోగి వరుఁడ వీవు
ధర్మమున కవలంబమై తనరె దీవు
దయకు నెలవైన మానవోత్తముఁడ వీవు.

చదువులేకున్న నేమి కోవిదుల మదికి
బెదరు పుట్టించు నెఱుక నేలెదవు నీవు
నాగురుండవు నీ వని నాఁటినుండి
తన్ను దిద్దుకొనెం బ్రజాతతిని దిద్దె.

యాగమునకంటె గేహ
త్యాగమ్మునకంటె నధికతర పుణ్యద మౌ
యోగము గృహస్థ ధర్మము
రాగము రావలయు మోక్షరతులకు నిందున్.

తల్లి నాశ్రయించి పిల్లలందఱు సుఖ
మందురీతి లాతి యాశ్రమంబు
లన్నియును గృహస్థు నండదండల నార్తి
భారదూరమైన బ్రదుకు గాంచు.

అతిథిశిష్టమైన యన్నము, నిజ వధూ
తృప్తి, దానశీల, మింద్రియముల
నగ్గపఱచుకొంట యణఁకువ, పితృభక్తి
వలచు గేస్తుఁ జూచి వణఁకు నఘము.

---

# విజయనగర చరిత్ర

## [ రెండవ భాగము ]


### డా. నేలటూరు వేంకటరమణయ్య


కళింగ దండయాత్రవలన కృష్ణదేవరాయలకు రాజ్య లాభము కలిగినది. తన పూర్వికుల కడనుండి గజపతులు చేకొనియుండిన తీరాంధ్రభూమిని అతడు మరల జయించి స్వాధీనము చేసికొనగల్గెను. అతని కీర్తిప్రతిష్ఠ లతిశయించి భరతఖండము నందెల్లెడలను వ్యాపించెను. అతడు విద్యావిశారదుడనియు నవక్ర పరాక్రమశాలి యనియు నసాధారణ ప్రజ్ఞాసంపన్నుడయిన సేనాధిపతియనియు నెల్లరకు విదితమాయెను. కాని దీర్ఘదృష్టిని బరిశీలించి చూచిన కృష్ణరాయల కళింగ విజయములు దాక్షిణాత్య హిందూ ప్రపంచమున కనర్థతరము లనియే చెప్పవలసియున్నది. చిరకాలము నుండియు యవనాక్రాంతము గానీయక దాక్షిణాత్య హిందూధర్మ సంస్కృతులను సంరక్షించిన దొక విజయనగరసామ్రాజ్యము మాత్రమే కాదు, ఆ కీర్తి కొంత వఱకు గజపతి సామ్రాజ్యమునకును జెందవలసి యున్నది. చక్రరక్షకులవలె గజపతులును విజయనగర చక్రవర్తులును ఉభయ పార్శ్వములనుండి సంరక్షించుచుండ, హిందూ స్వాతంత్ర్య రథము దక్షిణాపథమున రెండు శతాబ్దముల కాలము నిరవధికముగ సాగుచు వచ్చినది. వారిరువురులతో మత్సరింపక సుహృద్భావముతో నేకీభవించి యుండిన దక్షిణ భారతావనినుండి మహమ్మదీయాధికార వృక్షమును సమూలముగ బెకలించివేసి యుండవచ్చును. కాని వారి పరస్పర వైరము మహమ్మదీయులకు లాభకారి యైనది. కృష్ణరాయలతో గజపతి జేసికొనిన సంధి నియమముల ప్రకారము కృష్ణానది కవ్వలి రాజ్యమంతయు గజపతికి స్వాధీనపడినను నది శిథిల గృహ దానమువలె నతని కనుభవ యోగ్యము గాదాయెను. అప్పటి తన రాజ్యస్థితిగతులను ప్రతాపరుద్ర గజపతి యిట్లు వివరించి యున్నాడు.

> 'నష్టం కులం భిన్న తటాక కూపాన్
> విభ్రష్టరాజ్యం శరణాగతంచ.'

కావున శత్రు హస్తగతమైన రాజ్యమునందు చాలభాగము తనకు వశపడి మరల తన యేలుబడి క్రిందికి వచ్చినను, దానిని సంరక్షించుకొనుటకు శక్తి లేకపోయెను. ఆ యేడేండ్ల యుద్ధములో సైన్యము నందు విశేషభాగము నశించిపోయెను. కోశము రిత్తయైయెను; తత్కారణమున నతడు సత్త్వహీనుడై పాడువడి జీర్ణపడిన రాజ్యమును సంరక్షించుకొన లేడాయెను. ఈ కష్టములను దొలగించి రాజ్యమును బునరుద్ధరింపగల నాథుడు ఎవ్వడును గానరాక పోయెను. ప్రతాపరుద్ర గజపతి జీవిత కాలముననే తెలంగాణ దుర్గము కుతుబ్శాహి సుల్తానుల బారి వడెను. దేశమున రాజద్రోహము ప్రబలి మంత్రి సామంతులును ప్రభుత్వమును ధిక్కరించి స్వతంత్రులగుటకు ప్రయత్నములు సేయుగడగిరి. ఇట్టి యరాజక స్థితి ప్రబలుచుండగనే క్రీ. శ. 1539 లో ప్రతాపరుద్ర గజపతి దివంగతుడాయెను. తరువాత మూడు నాలుగేండ్ల లోపలనే గజపతి సామ్రాజ్య మంతరించి పోయెను. కావున కృష్ణదేవరాయల కళింగ దండయాత్రలు గజపతి సామ్రాజ్య నిర్మూలమునకు కారణభూతమగుటయే కాక కాలక్రమమున దక్షిణభారత పారతంత్ర్యమున కనుకూల పరిస్థితుల నేర్పరించెను.

### కాటూరు

కళింగ దండయాత్ర విజయవంతముగ ముగిసిన పిమ్మట కృష్ణదేవరాయలు కాటూరుపై దండు జేసె

నని న్యూనిజు వ్రాసియున్నాడు. ఈ కాటూరు ఎచ్చట నుండెనో తెలియదు. న్యూనిజు వ్రాతయే దీని కేకై కాధారము. అన్యత్ర దీని ప్రస్తావము గానరాదు. దీని యునికిపట్టును గూర్చి చరిత్రకారులు వివిధముగ నూహించి యున్నారు. అందొక్కటియు దృష్టికరముగ నున్నట్టదు. కాటూరి యునికిపట్టును నిర్దేశించు నపుడు న్యూనిజు సందర్భమున దెల్పిన భౌగోళిక చారిత్రికాంశములను దృష్టియందుంచుకొనవలయును. ఇవి ముఖ్యముగ మూడు (1) కాటూరనునది చోళ మండల తీరమునందలి యొక రాజ్యము పేరు. (2) ఆ రాజ్యములోని యొక ముఖ్యపట్టణమును పరివేష్టించి యొక నది ప్రవహించుచుండెను. (3) ఆ రాజ్యము నేలుచుండిన ప్రభువు కృష్ణ రాయల దండయాత్ర కేబదియేండ్ల మునుపటి నుండియు రాయలకు కప్పము గట్టక తిరుగుబాటు చేసి యుండెను. ఈ యంశములు మూడును నే ప్రదేశమున కనువర్తించునో యదియే కాటూరని మన మనుకొన వచ్చును. కన్యాకుమారి మొదలు గంగానదీ ముఖ ద్వారము వఱకును వ్యాప్తమైన తూరుపు సముద్ర తీరమును పాశ్చాత్య యాత్రికులును గ్రంథకర్తలను చోళమండల తీరమనిరి. విజయనగర సామ్రాజ్య ముత్తర మున నెన్నడును కృష్ణానదీ ముఖద్వారము నతిక్రమించి యుండలేదు. కుమారకంపణ సంభవరాయలను మధుర సుల్తాను నోడించి కన్యాకుమారీ పర్యంతము వ్యాప్తమై యుండిన ద్రావిడదేశమును సమస్తమును రాయల యేలుబడి క్రిందికి దెచ్చెననియు నిమ్మడి దేవరాయలు కొండవీటి రెడ్డిరాజ్య పతనానంతర మా రాజ్యములోని కంటకమై యుండిన తీరాంధ్రరాష్ట్రమును రాయసామ్రా జ్యమున గలుపుకొనెననియు మన మింతకు ముందెఱు గుదుము. కృష్ణానది కెగువనున్న తీరాంధ్రము రాజ మహేంద్రవర రెడ్డిరాజుల క్రింద నుండెను. వారు విజయనగర రాయలతో మైత్రి నెఱపుచుండినను వారెన్నడు నాతని కరిగాపులై యుండలేదు. కావున రాయల సంస్థానముపై నాశ్రయపడి కృష్ణరాయల దండయాత్ర కేబది సంవత్సరముల మునుపటివఱకు అనగా క్రీ. శ. (1519—50) 1469 పర్యంతము కరభారియై యుండిన కాటూరు రాజ్యము కృష్ణా కన్యాకుమారీ మధ్యస్థ పూర్వ సముద్రతీరమునం దెచ్చ టనో వెలసియుండవలయును. దాని యునికి నింత కంటె సూక్ష్మముగ నిర్ణయించుటకు ముందించుక పూర్వ సముద్రతీర గతచరిత్ర పర్యవేక్షణ యవసరము. క్రీ. శ. 15 శతాబ్దోత్తరార్ధమునందె గజపతులు విజయనగర సామ్రాజ్యముపై నెత్తివచ్చి తిరుచినాపల్లి వఱకు దాడి నడపియుండిరి కదా. ఆ దండయాత్ర ఫలితముగ నెల్లూరు పర్యంతము వ్యాప్తమైన తీరాంధ్ర భూమి యంతయు గజపతి సామ్రాజ్యమున గలసిపోయి క్రీ. శ. 1513–16 ల మధ్య కృష్ణరాయలు మరల జయించి కైకొనునంతదనుక వారి పాలన క్రిందనే యుండెను. గజపతి రాయలకు సమానస్కంధుడైన ప్రతి పక్షిగాని యరిగాపని చెప్పరాదుకదా. కావున కాటూరు యొక్క యునికిపట్టు పూర్వ సముద్రతీరమునం దెచ్చ టనో యిమిడుకొనియుండి యుండవలయును. సాళువ నరసింగరాయలును నరసా నాయకుడును నొకరి వెనుక నొకరు మధురకు విస్తరించియుండు తీర ద్రావిడ దేశ మును జయించి వశపఱచుకొనియుండిరి. కావున కాటూరు రాజ్యము దాని కింకను దక్షిణమునందుండి యుండవలయును. మధురకు దక్షిణమున కాయత్తారు కొల్లము (Quilon) రాజ్యము లుండినవి. దీనిలో కెల్ల యొకానొకప్పుడు తూర్పు సముద్రతీరమున నుండు కాయాలుకర పట్టణమువఱకు వ్యాపించియుండినను నది వాస్తవముగ పశ్చిమ సముద్రతీర రాజ్యము. అది న్యూనిజు చెప్పినట్లు చోళమండల మందలి రాజ్యము కాజాలదు. ఇక మిగిలియుండునది కాయత్తారు. ఇదియే కాటూరు కాదగును. కాయత్తారు మధురకు దక్షిణ దిగ్భాగమున తిరునెల్వేలి ప్రాంతముల నేలు చుండిన పాండ్య వంశజులలో నొకశాఖవారికి రాజధాని. దీనిని సమకాలిక పోర్చుగీసు రచయితలు కొందఱు 'కయితర్రో' 'కేత్తర్రో' అని పేర్కొని యున్నారు. న్యూనిజు దీనిని కతుయిర్ (Catuir) అని వ్రాసెను. ఆధునిక చరిత్రకారులు 'కాటూర'ని నామకరణము జేసిరి. కాయత్తారు ప్రభువులు స్వతంత్రులై రాజ్యము సేయుచుండినట్లు వారి శాసనములు సూచించు చున్నవి. నరసానాయకుడు తిరునెల్వేలి ప్రాంతముపై దండెత్తి వచ్చినపుడు కొల్లముచే పరాభూతుడయెనని పోర్చుగీసు రచయితలు వ్రాసియున్నారు. ఆ పరాజయ మునకు కాయత్తారు ప్రభువులు కారణభూతులు కావచ్చును. కావున కృష్ణరాయల దండయాత్ర కేబది

యేండ్ల మునుపటినుండియు రాయలకు కప్పము గట్టక యనతులై మదించి యుండిన వారీ కాయత్తూరు ప్రభులే కానగును. కృష్ణరాయలు ముట్టడించిన నదీపరివేష్టితమైన పట్టణము కాయాలు. ఇది తామ్రపర్ణీపాయల మధ్యనున్నది. ఇది నాడును నేడును వకాక్తిక పరిశ్రమ కేంద్రస్థానము. మధ్య యుగమున తూర్పు తీర దాక్షిణాత్య ముఖ్యతీర పట్టణములలో నొక్కటి.

కృష్ణరాయల కాటూరు దండయాత్రలో నడచిన యుద్ధ విశేషములు మనకు చక్కగ దెలియవు. ముఖ్యాంశ మొక్క దానిని మాత్రము న్యూనిజు పేర్కొని యున్నాడు. కృష్ణరాయలు దండువెడలి చని కాటూరు ప్రభువు నివసించుచుండిన ముఖ్య పట్టణమును ముట్టడింప దలపెట్టెను. కాని యా పట్టణము నావరించి యుండునది వర్షపు వెల్లువ నీటిచే పొంగి దరులు దాకి ప్రవహించుచుండినందు వలన ముట్టడి సాధ్యముగాక పోయెను. కాని కృష్ణ రాయలంతటన నా కార్యమును విసర్జింపక నదియొక్క ప్రధానశాఖనుండి ప్రక్కకాలువలను ద్రవ్వించి వాని మూలమున ప్రవాహ జలములను పెడదారుల ద్రిప్పి వెల్లువను శోషిలజేసి కోటను ముట్టడించి వశపఱచు కొనెను. అందు విస్తారము ధనమును హస్త్యశ్వాది వాహనములును కూడజిక్కెను. కాటూరు ప్రభువును జీవగ్రాహముగ బట్టువడి బందీకృతుడై విజయనగర మునకు గొంపోయిరి. కాటూరు రాష్ట్రమంతట రాయసామ్రాజ్యమున గలసిపోయినది.

## మూడిండ్ల తురకలతో యుద్ధము

రాయవాచక కృష్ణరాయ విజయములందలి వృత్తాంతమునుబట్టి చూడగా గళింగ దిగ్విజయ యాత్ర యింకను సాగుచుండగనే కృష్ణదేవరాయ లపుడే నిజ స్వాతంత్ర్యమును ప్రకటించుకొనుచుండిన బహ్మనీ సామంతులపై యొక పర్యాయము దండు నడచినట్లు తెలియుచున్నది. సింహాచల పర్యంతమును గజపతి రాజ్యమును సాధించి యటు పిమ్మట గటకముపై దండు నడుప నుద్యుక్తుడైన కృష్ణరాయలను వారించు సందర్భమునం దప్పాజీ తిమ్మరుసయ్య మూడిండ్ల తురకలమీది దండయాత్ర నిట్లు ప్రస్తావించి యున్నారు.

'మూడు తెగల తురకల రాజ్యమంతా కంపోలం సేసి వారి దుర్గాలున్నూ, స్థలాలున్నూ, కట్టుకొని అహముదా నగరం ఆముదాలు విత్తించి గజపతివారి గిరి దుర్గం స్థల దుర్గం యివి అన్నియు ఆక్రమించి నట్టాయను ముందర కదిలిపొయ్యేది కార్యం కాదు.'

తిమ్మరుసయ్యగారు పేర్కొనిన మూడు తెగల తురక లెవ్వరో కుమార ధూర్జటి కృష్ణరాయ విజ యము నందు వివరించియున్నాడు.'

'ఇతరుల శక్యములే తలప నేదుల శాహునిజాముశాహులన్
గుతపనమల్కునున్ గెలిచి గొబ్బున సర్వగిరీంద్ర దుర్గముల్
జతురత గైకొనన్ ? ధర నసాధ్యమునా కిక గల్గదైన నం
చిత యశ యొక్క విన్నపము జేసెద నేమర జిత్తగింపుమా.'

ఇందువలన కృష్ణరాయలు కళింగ దిగ్విజయ యాత్ర సల్పుచు మధ్య నొకసారి యేదులశాహ నిజాముశాహు కుతపనమలకలపై దండుదేసెనని తెలియుచున్నది. వీరు ముప్పురును మనకు పూర్వ పరిచితులే! ఏదులశాహు విజాపురాధిపతి, నిజాము శాహు అహమదు నగర పాలకుడు; కుతపనములక గోల కొండ ప్రభువు. రాయలకు తురకలతోనైన తొలి సమ రములో ఆదోనిరణ క్షేత్రమున నతని దారసిలి పరిభవ మును బొందియున్నారు. కృష్ణరాయలు కళింగ దండ యాత్రను సంపూర్ణముగ గొనసాగింపక నడుమ నాపి పై బేర్కొనిన తురకరాజులపై నేల యెత్తి పోవలసి వచ్చెనో విచారింపవలసియున్నది. చరిత్రాధార ములను బరిశీలించి చూడగా నిది యా తురక రాజులు ప్రత్యేకముగనో కలసియో రాయసామ్రాజ్యముపై జేసిన దండయాత్రలకు ప్రత్యాఘాతము సేయుట కొఱకని తోచుచున్నది. క్రీ. శ. 1512 వ సంవత్సర మున కమాలుఖానుని వధ కారణమున విజాపుర సంస్థానమున రేగిన పారశీకు రాసాని యోధమాల హావళి వలన గల్గిన దేశసంక్షోభమును సందర్భపఱచుకొని కృష్ణరాయలు కృష్ణా తుంగభద్రల మధ్యనుండు రాయి చూరంతర్వేదిని జయించి స్వాధీనము జేసికొనెనని పూర్వప్రకరణమునందు జెప్పియున్నాడను. కాని క్రీ. శ. 1520 వ సంవత్సరమున రాయచూరును దత్పరిసర ప్రదేశములును నాదిలుఖానుని యేలుబడిక్రింద నుండె

ననియు కృష్ణరాయలొక ప్రచండ సైన్యముతో నెత్తిపోయి యాదిల్ఖాను నోడించి తఱుమగొట్టి మరల నా దుర్గమును రాష్ట్రమును నాక్రమించుకొనెననియు న్యూనిజు వ్రాసియున్నాడు. కావున క్రీ. శ. 1512, 1520 ల మధ్య ననగా రాయలు కళింగ దండయాత్రయందు నిమగ్నుడై యున్నతరి యాదిల్ఖాను దండెత్తివచ్చి సదరు దుర్గమును దాని క్రింది రాజ్యమును జయించి కైవసము గావించుకొనెనని తెలియుచున్నది. గోల్కొండ రాజ్యస్థాపకుడైన సుల్తాన్ కుల్లీ కుత్బుశాహు (ఇతనినే సమకాలిక హిందువులు కుతపనమలక యని పేర్కొందురు). క్రీ. శ. 1519 ప్రాంతమున విజయనగర సామ్రాజ్య గడి ప్రదేశముపై నెత్తిపోయి కొన్ని దుర్గముల నాక్రమించుకొనెనని యర్వాచీన మహమ్మదీయ చరిత్రకారులు తెల్పుచున్నారు. అహమదునగర ప్రభువు నిశామన మలక వీరికి తోడు నడచి యుండును. ఇట్టి సంఘటన నూతనమైనదికాదు. తత్పూర్వము పెక్కుమార్లు నడచినదే.

ఈ మూడిండ్ల తురకల దండయాత్రకు కారణమేమియో విచారింతము. తురకలు హిందువులకు సహజ శత్రువులు. వీరి దండయాత్రలకు కారణమక్కరలేదు. తోడేలు గొఱ్ఱెపిల్ల న్యాయము ననుసరించి హిందూ రాజ్యములపై వారు దండెత్తువారు. దీనికితోడు వాస్తవ కారణములు కొన్ని వారిని యుద్ధమునకు ప్రేరించినవి. రాయలు గజపతి సామ్రాజ్యముపై నెత్తిచని యతని దుర్గమును, రాజ్యమును స్వాధీన పఱచుకొనుచుండెను కదా. ఈ విజయముల మూలమున నతని రాజ్య వైశాల్యము అతిశయించి దక్షిణాపథ రాజకీయ రంగమున నతని ప్రాబల్య మధికమై తత్ఫలితముగ నొక గజపతులదే కాక తురకల యధికారమునకు గూడ ముప్పు గలుగవచ్చును; కావున తానేకమై గజపతికి దోడ్పడి యత్నమును భగ్నము గావించుట కరవవసరము. ఇంతియకాక వారికిని గజపతి వారికిని తోడ్పడవలయునను నొడంబడిక యొక్కటి యేర్పరచుకొనియుండిరి. ఈ కారణమువలన గృష్ణరాయలు గజపతి రాజ్యముపై దండెత్తనున్నాడని యెఱుకపడి నంతటనె వీరి స్థానాపతులు విజాపురమున దాది మహలులోన సమావేశమై కర్ణాటకం (విజయనగరం) వారు దండయాత్రకు బయలువెడలినట్లయిన దమ తమ ప్రభువులు నిజ రాజ్యమును సంరక్షించుకొను వెరవు నరయ గడగిరి. స్థానాపతులనగా నొక సంస్థానంవారు మఱియొక సంస్థానమున నిలుపు ప్రతినిధులు ఇప్పటివలె నప్పుడును నానాదేశ సంస్థానికు లొండొరుల సంస్థానములలో తమ ప్రతినిధులను నిలిపియుంచువారు. ఈ ప్రతినిధులు తాత్కాలికముగ సంస్థాన పక్షమున నన్య సంస్థానమందు నియోగ్యులు. ఇప్పటి రాయబారులవలె వీరును నన్య రాజ్యములందు తమ రాజ్యమునకు సంబంధించిన సర్వ విషయములను జేర్పడనీయక చూచుకొనుటయే కాక యన్య రాజ్యములోని మర్మములను గనుగొనుటకు నిరంతరము మాఱువేషముల సంచరించుచుండు వేగులకు ప్రాపైయుండువారు. కృష్ణరాయలు కళింగముపై దండు వెడలనున్నాడను వార్త యెఱుక పడగనె వీరాద చెప్పిన దాది మహలు సమావేశమున జర్చించి 'కర్ణాటకం వారు సరుదు బలమించి వస్తే గజపతి వారికిన్ని మనకున్ను మున్నేరింకం గాకుండా వుండును. ఆరీతుగాకుండ సరుదు దుర్గాలను రసు సామగ్రీకి వేయించి బలవంతముగా యేనుగు గుఱ్ఱాలు కాల్బలం వుంచవలెను' అని తీర్మానించి యా తీరుమానమున దమతమ ప్రభువుల కెఱుకపఱచిరి. సరుదు దుర్గములను బలపఱచుకొనుటయే కాక తురకరాజులు తమ సర్దారులను గజపతికి సహాయముగ యుద్ధముసేయ నంపిరి. గజపతివారి పక్షమున కొండవీటికడ రాయరాణువతో పోరాడి యోటువడి రాయలచే జీవగ్రాహులై చిక్కిన రాచూరు దుల్లాఖాను ఉద్దండఖాను మున్నగువారు ఈ తరగతికి చెందినవారే. ఈ విషయములన్నిటిని సమాలోచనము జేసి చూడగా గజపతివారును మూడిండ్ల దక్కనీ తురక రాజులును స్నేహానుబద్ధులై యుండిరనియు, గృష్ణరాయలను గటకము పైనెత్తి పోనీయక వెనుకకు మరల్చుట కొఱకు రాయరాజ్యముపై దాడి చేసిరనియు దెలియుచున్నది.

ఈ దండయాత్ర వృత్తాంతము సమగ్రముగ దెలియరాదు. కాని యా సందర్భమున నడచిన విశేషాంశములు కొన్నిటినప్పటి పాశ్చాత్య గ్రంథకర్తలును నర్వాచీన మహమ్మదీయ చరిత్రకారులును వర్ణించి యున్నారు వానినిట బరిశీలించుట యుక్తము. ఆద్యమున గృష్ణరాయలకు గుతపనమలకతో నైన యుద్ధ

మును విచారింతము. కృష్ణరాయలు సింహాద్రిని సాధించి విజయనగరమునకు తిరిగివచ్చి సాళువ తిమ్మరుసయ్యను కొండవీటి దుర్గాధ్యక్షునిగ నియమించి యచటికి బోవ నాజ్ఞ యిచ్చి, సైన్యముతో గూడ దక్షిణదేశమునందు చిరకాలమునుండియు ననతులై యుండిన కాటూరు ప్రభువును బుటము వెట్టుట కటకేగి యుండెను కదా. అదియే మంచి తరియని యెంచి కుతపనమలక తన సర్దారులలో నొక్కడైన మదారుమలక నలుబది వేల సైన్యముతో కొండవీటిని జయింప నంపెను. అతడు తన ప్రభువు నాజ్ఞ నను సరించి కొండవీటికివచ్చి విజయనగరమునుండి వచ్చు చుండిన తిమ్మరుసయ్య మార్గము సరికట్టెననియు నప్పుడు సంఘటిలిన యుద్ధములో మదారుమలక యోటుపడి, తిమ్మరుసయ్యచే భార్యా పుత్రాదుల తోడను, గజాశ్వభూషణ ధనసంపదతోడను పట్టువడి విజయనగర చెఱసాలయందు బందీకృతుడై యందె మడిసెననియు న్యూనిజ వ్రాసియున్నాడు. ఇందువలన కుతపనమలకకు ప్రథమ చుంబనముననె దంతభగ్న మాయెనని తెల్లమగుచున్నది.

క్రీ. శ. 17 శతాబ్ద ప్రారంభమున విరచిత మైన తారీఖ్, ఇ. మహమ్మదు కుల్లీ కుత్బ్‌శాహి యను గోలుకొండ సుల్తానుల చరిత్రయందు వారి వంశ స్థాపకుడైన సుల్తాన్ కుల్లీ కుత్బ్‌శాహు (ఇతడే మన కుతపనమలక)కు కృష్ణరాయలతోనైన యుద్ధ ములు కొన్ని విపులముగ వర్ణింపబడియున్నవి. ఈ చరిత్ర ప్రకారము సదరు యుద్ధమంతయు వారి యుభయ రాజ్యముల నడిమి గడిప్రదేశమునందుండు దేవరకొండ పానుగలు గణ్పుర కోవెలకొండలను నాలుగు దుర్గముల చుట్టును నడచినది. యుద్ధము దేవరకొండ యుద్ధముతో ప్రారంభమాయెను. సుల్తాన్ కుల్లీ యనగా గుతపనమలక దేవరకొండ దుర్గమును ముట్టడించి యచటి హిందూ దేవాలయములను గట్టడములను బడగొట్టి వాని స్థానమున దురకల మసీదులను గట్టించెను. ఆ వార్తను విన్నంతటనె కృష్ణదేవరాయ లొక గొప్ప సైన్యముతో నెత్తివచ్చి కుత్బ్ శాహి రాజ్యముయొక్క గడి ప్రదేశమును ద్రొక్కి ధ్వంస మొనర్చెను. అంతట సుల్తాన్ కుల్లీ (కుతపనమలక) యొక చిన్న దళముతో వచ్చి పానుగలు దుర్గముచెంత కృష్ణరాయలను నిర్జించి పాఱదోలి యా దుర్గమునకు ముట్టడి వేసెను. రాయల బంధువైన యా దుర్గాధిపతి తురకల తాకునకు తాళజాలక కోటను సుల్తాన్ కుల్లీకి వశముజేసి పరివారముతో గూడ నచట వాసిపోయెను. తరువాత సుల్తాన్‌కుల్లీ గణ్పురమును నటువెనుక కోవెలకొండను ముట్టడించి యా రెండు దుర్గములను గైవసము జేసికొనెను. ఇది సంగ్రహముగ తారీఖ్ - ఇ—మహమ్మద్‌కుల్లీ కుత్బుశాహీ యందుండు యుద్ధ వృత్తాంతము. కాని యిది యంతయు సత్యాత్మకము గాదని శంకించుట కవకాశము గలదు. పై బేర్కొనిన దుర్గములు నాల్గింటిలో రెండైన పానుగలు కోవెలకొండ దుర్గములను సుల్తాన్‌కుల్లీ జయించినది మహమ్మదీయుల కడనుండి యని తారీఖ్— ఇ- ముహమ్మద్‌కుల్లీ కుత్బ్‌శాహియొక్క రచయితకు పూర్వుడును గొంచె మించుమించు సుల్తాన్‌కుల్లీకి సమకాలికుడునైన యద్దంకి గంగధరకవి వక్కాణించి యున్నాడు కుతపనమలక విజయములను ప్రశంసించుచు దన తపతీసంవరణ పీఠికలో,

> 'పడమట సవాయి బసవని గాజేసి
> యచట గొయ్యకొండ నాక్రమించె
> దమది మల్లూఖాను దక్షిణంబున గొట్టి
> హరియించె బానుగల్లాదిగిరుల'

నని చెప్పియున్నాడు. ఇందువలన సుల్తాన్ కులీ కొయ్యలకొండ (కోవెలకొండ)ను సవాయిని జయించియు పానుగల్లును దమదిమల్లూఖానుని జయించియు గైకొనినట్లున్నది. సవాయి యనునది విజాపురాధినాధుడైన యాదిల్‌శాహు బిరుదు. దమది మల్లూఖాను డెవ్వరో తెలియదు; కాని యాతడు తురకయని యతని పేరే చాటుచున్నది. కావున కుతపనమలక యీ రెండు దుర్గములను గొన్నది స్వజాతీయులైన తురకరాజుల కడనుండి రాయలను జయించికాదు.

## ఆదిలుశాహు

కళింగ దండయాత్రయందు కృష్ణరాయలు నిమగ్నుడైయున్న సమయమునం దాదిల్ఖానుడు రాయచూరంతర్వేది నాక్రమించుకొనెనుగదా. అతని శిక్షించి మరల దానిని స్వాధీనము పఱచుకొనవలసి యుండెను. కృష్ణరాయలు సింహాద్రి కాటూరు విజయముల పిమ్మట నాదిల్ఖానుని పై దండువెడలెను.

ఈ దండయాత్ర చరిత్రనుగూర్చి మనకు తెలియవచ్చు విషయ మల్పము. ఆముక్తమాల్యద యేడవ యాశ్వాసాంతమున కృష్ణరాయలు సైన్యము నడపు కొనుచు కెంబావి యనుస్థలమున ఘోర సమరమున యవనులను వధించి వారి రక్తముచే నాయూరిని నింపి యచటి కోటలను బడగొట్టినట్లు ప్రకటించి యున్నారు. ఈ కెంబావి ప్రాచీన బహమనీ రాజధాని యగు గుల్బర్గకు నైరృతి దిగ్భాగమున నేబదిమైళ్ల దూరమునను, ఆదిల్ శాహి, రాజధానియగు విజాపురమునకు తూర్పున గొంచెమించుగ నంతియ దూరము నందు గ్రామము. బీదరు అహమదానగర రాజ్యముల సరిహద్దు సమీపమునందె యుండినది. ఇందొక బలిష్ఠమగు కోట యుండెను; కాని యది విజాపుర దండయాత్ర సమయమునందది యెవ్వరి పాలనక్రింద నుండెనో చెప్పుటకు వీలుపడదు. కాని యది విజాపుర అహమదానగర రాజ్యములలో నొక్కదానికి జెల్లుచుండి యుండవలయును. కాని మహమ్మదీయ రాజ్యముల లోని కింతదూరము కృష్ణరాయలు జొచ్చుకొని పోవుట చూడగా నతడు తత్పూర్వము విజాపురము తురకల నోడించి వారిని వెన్నంటి తఱుముచు నచటికి బోయి యుండునని మనము దృఢముగ బల్కవచ్చును. ఆముక్తలోని వర్ణననుబట్టి చూడగా నచటి యుద్ధము గడుభీకరమై యవనదళ మారణమైనట్లు తోచుచున్నది. యుద్ధము చేకురినపిమ్మట కృష్ణరాయలచటి కోట నిడియగొట్టి నేలమట్టమునకు చదనుగావించి ముందుకు సాగెను.

## నిజాపునవుంలక

ఆముక్త షష్ఠాశ్వాసాంతమున నైజామనయావనావని ధవాహీనాభ్రభచుంబిస్ఫుర ద్విదితాభీల మణిగృహాళి దళనో ద్వేలోగ్రహస్తివ్రజో ద్యదనీకాగ్రగుడని చెప్పుకొన్నాడు. ఈ విషయ ప్రస్తావము రాయవాచక కృష్ణరాయ విజయములందును గలదు. రాయవాచకము యుద్ధాంశములు సంగ్రహముగ వర్ణింపబడియున్నవి :

'అహమదా నగరమునకు నడవగా కొనమూకలవారు వెలిపాళ్యంబులు చొఱబడి చెరా జొరా పట్ట చాలా కంపోలం సేయంగా కోటలోని గుఱతెల వారు వెళ్లివచ్చి యెదుట నిలిచి జగడ మియ్యంగా మూడుం ముక్కాలు ఘడియలలోగా రెండువేలుం న్నెనమంన్నూరు గుఱతెలున్ను అన్నియు రౌతులున్ను చాపకట్టుగా మృతి బొంద్దిరి. గనక యీ సమాచారం కోటలో వున్న మొదటి దొరల ఇనవారు విని ఇఖను మనం కోటలో నిలిచి వున్నట్టయితే చేపట్టుగా పట్టుక పోదురు. అందునుంచి చాలా అవమర్యాద అని యెంచ్చి యేమి బోయినా పోని అని కోటను విడిచి పోయిరి. గనక రాయలవారు ఆ కోట యిడియ గొట్టించి ఆ పట్నం యెంత్త మేరో అంత మేరా నున్ను వెలిపాళ్యాలున్ను దున్నించి ఆమిదాలు జిల్లేళ్ల విత్తించెను.'

ఈ యంశమునే కుమార ధూర్జటి కావ్య శైలినిట్లు వక్కాణించి యున్నాడు.

'దర్పంబున నమదానగరంబు గరంబు దురంబు సేయందలంచి యప్పురంబు నలుదెసలం జుట్టు ముట్టినం బెట్టదరియు బెదరియుఁ జెదరియుండజ్ఞాన పదవర్గంబు నలుదెసలం బాఱమీఱిన రాగంబున నచ్చటి యవన బలంబు లెసంగ చలంబునన్ గోట వెడలి వడిందల పడినం బోరు ఘోరంబై కౌరవ పాండవ రణంబునుం బోలి గాంగేయ కుంభ జాతా దుశ్శాసన వీరలక్షణ శల్యహరణ కారణంబై... మెఱయ నయ్యుద్ధ విడికి నోహటించి చలించి పలాయమానులగు పారసీకుల ననేకుల గాందిశీకులని యెంచి బ్రతుకుదురుగాక యని యుపేక్షించి తదీయ స్థలంబున జయధ్వజం బెత్తించి...' అని.

పై నుదాహృతమైన రాయవాచక కృష్ణరాయ విజయగ్రంథ భాగములందలి యుద్ధ విశేషములు మొత్తముమీద నొక్క తీరున నున్నను కొంత వ్యత్యాసము గన్పట్టుచున్నది. రాయవాచకమున కృష్ణరాయలహమదునగరు కోటనిడియ గొట్టించెననియు బట్టణ వైశాల్యము యెంతకలదో యంతము మట్టుదున్నించి యాముదపు విత్తులు విత్తించినట్టున్నది. కృష్ణరాయ విజయమునందా ప్రస్తావము గానరాదు. దునించి యాముదపు గింజల జల్లినట్లు నిరూపించు సాధనాంతరము లేకపోయి ను ఇడియ గొట్టినది వాస్తవమే యని కృష్ణరాయలే సాక్ష్యము చెప్పుచున్నాడు. ఆముక్తయందలి 'మణీ గృహాళిదళన'ము నిచట స్మరణకు దెచ్చుకొనదగును. కృష్ణరాయలిడియ గొట్టిన మణీ

గృహాళి యెవ్వి? వీని ప్రశంస ఫెరిష్టా చరిత్రమున గలదు. నిజామ్ శాహీ వంశ స్థాపకుడైన నహమద్ నిజాముల్ముల్క్ భైరీకి తన ప్రభువైన బహ్మనీ సుల్తానుతోనైన యుద్ధములో విజయము గల్గెను. రణక్షేత్రమున నిజాముల్ముల్క్ తన విజయ స్మారకచిహ్నముగ 'బాఘ్-ఇ-నిజాము'ను పేర నొక యుపవనము నిర్మించి యందెఱ్ఱ నున్నపు రాతితో నొక సౌధమును గట్టించెను. క్రీ. శ. 1500 సం॥ నందతడు దౌలతాబాదునందు తిరిగి వచ్చిన వెంటనే బాఘ్-ఇ-ఇజామ్ చుట్టును దనకు రాజధానీ నగరమునకు పునాదులు వేసి దానికి దన పేర యహమద్ నగరమను నామకరణము జేసెను. అతని తరువాతి హరాపట్టణము చుట్టును నొక చక్కని కోటను గట్టిరి. (Briggs Ferishta III. p. 197) ఈకోటను నందలి బాఘ్-ఇ-నిజామ్‌లోని యెఱ్ఱనున్నరాతి ప్రాసాదమునే కృష్ణరాయలు క్రీ. శ. 1516 లో నాముదా నగరమున కెత్తివచ్చినప్పు డిడియ గొట్టినది.

మూడిండ్ల తురకలపై కృష్ణరాయలు చేసిన దండయాత్రల ఫలిత మేమి? ఉన్న యాధారములను బరిశీలించి చూడగా రాయలకు సర్వత్ర విజయమే కలిగినట్లున్నది. కాని యీ విజయమున కాతనికి విశేష లాభ మేమియు కలిగినట్లు గనపడదు. రాయవాచకమునందు తురకల రాజ్యమునంతయు గంపోలముచేసి వారి దుర్గములను స్థలములను కట్టుకొనెనని యున్నది. కంపోలము చేసినది వాస్తవమే. తక్కినది యతిశయోక్తి. దండయాత్రకు తరువాత కూడ తురకల దుర్గములను స్థలములును యథాపూర్వము వారి పాలన క్రిందనే యుండెను. కృష్ణరాయలు రాయచూరు దుర్గమును నంతర్వేదిని కూడ మరల జయించి కైకొన ప్రయత్నము జేసినట్లగపడదు. దీనికి కారణమేమి? కృష్ణరాయ లీ దండయాత్రకు బయలువెడలినది వారి రాజ్యముల నాక్రమించుకొను నుద్దేశముతో కాదు. రామాయణమున బిడుకల వేట్లాటన్న ట్లావిర్భవించినది కళింగ జైత్రయాత్ర మధ్య మూడిండ్ల తురకలతో పోట్లాట. గజపతి రాజధానిపై నడువనీయక తన రాజ్యముపై దండెత్తి యలజడి పుట్టించి తన్ను వెనుకకు మరల్పవలయునని ప్రయత్నము జేయు తురక రాజులను భంగపెట్టి వారిని నిష్ప్రత్యూలను జేయుటయే యీ దండయాత్రయొక్క ప్రధానోద్దేశము. అది చక్కగ నెరవేరినది. తురకలను పరిభవించి తఱిమగొట్టినను వారాక్రమించుకొనియుండిన దుర్గములను స్థలములను గైకొనుట సులభ సాధ్యమైనదికాదు. దీర్ఘకాలము పట్టును. గజపతి దండయాత్రను సంపూర్ణముగ కొనసాగించుటకు వలనుపడదు. అవకాశము గలిగిననతడు క్రొత్తదళముల గూర్చుకొని ప్రబలుడై తారసిలవచ్చును. కావున గజపతి కట్టి యవకాశము నీయక ఆతని సంపూర్ణముగ నోడించి సంధికొడంబఱచి యావల తురకల పనిబట్టింప వచ్చునని నిశ్చయించి సింహాద్రికి మరల పోయి యుండును.

## రాయచూరు దండయాత్ర

సోఽయం కృష్ణ నృపేశ్వరో
గజపతిం జిత్వా తదీయశ్రియా
సాకం తస్య సుతా ముదూహ్య
యవనక్ష్మాపం సపాదం తతః
గొబ్బూరు స్థలవాసినం సరభసం
జిత్వాను విద్రావ్యతం
హస్త్యశ్వాన్ సతదీయ దుర్గమతులం
రాయచూరు మాదత్తవాన్॥

అని భండారు లక్ష్మీనారాయణుడు తన సంగీత సూర్యోదయ పీఠికలో రాయచూరు విజయమును ప్రశంసించియున్నాడు. గజపతి యోటమియు నదనంతరమతని కుమారితతో కృష్ణరాయల వివాహమును వర్ణించి యటుపిమ్మట గొబ్బూరు కడ సపాదుని పరాజయమును రాయచూరు గ్రహణమును జెప్పియుండుటచేత కడపటి రెండు విషయములును కళింగ దండయాత్ర విజయవంతముగ ముగిసిన పిమ్మట జరిగెనని తెల్లమగుచున్నది. ఈ రాయలతో గజపతియొక్క సంధియు నతని కుమారిత వివాహమును క్రీ. శ. 1519 లో జరిగెనని పూర్వ ప్రకరణమున జెప్పియున్నాడను. తరువాత దండయాత్ర యెప్పుడు నడచెనో కనుగొనవలసియున్నది. పోర్చుగీసు చరిత్రకారుడు న్యూనిజు క్రీ. శ. 1522 వ సంవత్సరమున మే నెలలో అమావాస్య దినమున కృష్ణరాయలాదిలానుని జయించెనని వ్రాసియున్నాడు. కాని రాబర్టు సూయెల్ గారు న్యూనిజు చెప్పిన కాలము సరియైనదికాదని నిరూపించి

యుద్ధము క్రీ. శ. 1520 మే 10 వ తారీఖు శనివారమునాడు జరిగెనని నతని విస్మృత సామ్రాజ్యము నందు నిర్ధారించి యున్నాడు. సూయెల్ నిర్ణయించిన సరియైన కాలమే సరియైనదని రాయలనాటి శాసనము రుజువు సేయుచున్నది. కృష్ణరాయల సామంతులలో నొక్కడైన కంఠమరాజు సింగరాజు క్రీ. శ. 1521 జూలై నెలలో బెజవాడ కనకదుర్గ దేవాలయమున వ్రాయించి నిల్పిన శాసనమున వృషవర్ష శ్రావణ మాసమున తాను రాయచూరులో రంగనాథస్వామికి గుడి గట్టించితినని చెప్పియున్నాడు. వృషశ్రావణ మప్పటికి కృష్ణరాయలు రాయచూరుని జయించి స్వాధీనము జేసి కొనకుండిన సింగరాజచట రంగనాథాలయమును గట్టుట యసంభవము. ఈ విషయము నింతకంటె విస్పష్టముగ శ్రీ వర కృష్ణరాయమహారాయరు......వుత్తరాది రాచకార్యద దిగ్విజయ దిందరాచూరను సాధిసి' యని సదరు వృష సంవత్సరాషాఢమున గౌరదణాయక నారాయణయ్య అలంపురమున శిలాశాసనమున వివరింపబడియున్నది. వృష సంవత్స రాషాఢ శ్రావణములు క్రీ. శ. 1521 జూన్ జూలై నెలలకు సరిపోవుచున్నవి. కావున రాయలరాచూరు విజయమంతకు ముందే సంఘటిలి యుండవలయును. మహమ్మదీయ చరిత్రకారుడైన ఫెరిష్త కృష్ణరాయల రాచూరు దండయాత్ర హిజరి 927 క్రీ. శ. 1519 లో జరిగెనని వ్రాసి యున్నాడు. పై జెప్పిన కారణములవలన సూయెల్ నిర్ణయించినట్లు రాయల రాయచూరి దండయాత్ర క్రీ. శ. 1520 లో నడచెనని నిశ్చయించవచ్చును.

ఈ దండయాత్రయందు జరిగిన యుద్ధ విశేషములను వివరించుటకు ముందు విచారణీయాంశ మొక్కటి కలదు. ఫెరిష్త తన చరిత్రయందు రాయచూరు దుర్గము హిజరీ 927 (క్రీ. శ. 1519–20) వఱకు కృష్ణరాయల యధీనమునందె యుండెననియు, దానిని జయించి కైకొనుట కప్పుడిస్మాయిలాదిల్ఖానుడు దండెత్తిరాగా రాయలాతని నెదిర్చి యుద్ధమునం దోడగొట్టి తఱిమెననియు వ్రాసియున్నారు; కాని దానికి విరుద్ధముగ కృష్ణరాయలకు సమకాలికులును ప్రాయశః రాయలతో గూడ దండు వెంటబోయి యుద్ధ కార్యములను గనులార గాంచిన వారునునగు లక్ష్మీనారాయణ న్యూనిజుల రాయచూరాదిల్ఖానుని యేలుబడి క్రిందనుండెననియు రాయలా దుర్గమును గైకొనుటకొఱకు దండు వెడలిపోగా నాదిల్ఖాను డాత నెదిరింప వచ్చి రణమున నోడి పాఱిపోయెననియు నంతట రాయలా దుర్గమును ముట్టడించి సట్టుకొనెననియు దెల్పుచున్నారు. ఫెరిష్తయర్వాచీనుడు. యుద్ధకాలమునకు డెబ్బది యెనబది యేండ్ల పిమ్మట నతడు తన చరిత్రను రచియించెను. ఏ యాధారముల ననుసరించి యతడట్లు వ్రాసెనో తెలియదు. సమకాలికుల సాక్ష్యముకంటె తనవ్రాత విశ్వాసపాత్రము గాదు; కావున న్యూనిజు లక్ష్మీనారాయణులు జెప్పినట్లు దండయాత్ర యప్పుడు రాయచూరాదిల్ఖానుని యేలుబడి క్రింద నుండెననియు, దానిని రాయలప్పుడు జయించి గైకొనుటయె వాస్తవమనియు నాధునిక చరిత్రకారుల యభిప్రాయము.

(సశేషము)

---



# తెలుగు 'వాడి' త్రిపదలు

శ్రీ బండి నాగరాజు

ఆనుకూల మగు చరిత అద్భుతముగా వ్రాసి
మునుముందు వారి కని భూమిలో పాతు
ఘనత మనదిర తెలుగువాడ !

నీ చేతిలో పదవి నా చేతి కిచ్చితే
నీ చోన్నతుల బాప నేర్తు ననువాడు
వా చాలుడే తెలుగువాడ !

క్షేత్రమ్ము నిలుపుకొను ఆత్రమ్ముతోడను క
ళత్రమ్ము కైనను విడాకు లిచ్చెదు ప
విత్రులమురా తెలుగువాడ !

హరిజనుల కని ఊరి కవల గుడిసెలవంటి
ఇరవులు సిమెంటుతో ఏర్పరచితే ఉ
ద్ధరణ యగునా ? తెలుగువాడ !

ఎగుడు దిగుడులు లేని సుగమ వౌ బ్రతుకంటె
ఉగ చాలని చరిత్ర ఒదవ దెందులకు
సుగము లేదుర తెలుగువాడ !

ఒక్కరిద్దరు చాలు చక్కని కుటుంబముకు
పెక్కు రెందు కటన్న, ఒక్క కాన్పునవె
తుక్కు వదలెను తెలుగువాడ !

ఒక్క రిద్దరితోనె ఉడుపుకొని సంతతిని
బిక్క చచ్చిరి భూమి పెరల కీవంసి
దిక్కేదిరా ! తెలుగువాడ !

## తెలుగు 'వాడి' త్రిపదలు

లాటరీ టిక్కెట్ల లక్ష రావలె నంచు
సాటివారిది దోచు సంప్రదాయమ్ము
వాట మైనదె తెలుగువాడ!

మేడ మిద్దెల లేదు పైడి ముద్దల లేదు
పై డబులో లేదు వాడి మానవత
ఏడ వెదకుదు? తెలుగువాడ!

నల్ల ధనమును మ్రింగి ఉల్లమ్ము చెడిపోయె
ఉల్లమ్ము చెడి బ్రతుకు గుల్లాయె, దిక్కు-
వల్ల కా డిక, తెలుగువాడ!

కైత చెప్పెడు వాడు కాకాలు లేకున్న
మేత లేకనె చచ్చిపోతాడు, బ్రహ్మ
వ్రాత చాలదు తెలుగువాడ!

———



# నీ బళ్లో చదవను

శ్రీ యం. ఏ. నరసింహమూర్తి

'అమ్మా! ఈ బొక్కికుర్చీ—టేబిలూ విరిచి నీళ్ల పొయ్యిలో పడేద్దామే' అన్నాడు అప్పుడే వీధిలోంచి వచ్చిన కాశీపతి బూట్లు విప్పుకుంటూ.

'నీకు మరేం పని లేదేమిట్రా? ఎప్పుడూ ఆ కుర్చీ—టేబిలూ విరిచేస్తానంటావేం?' అంది తల్లి.

'కొత్తవి కొనితెస్తే ఇవి విరిచేద్దాం' అంది పెళ్లాం వంటగదిలోంచి.

ఇవి విరిచేస్తేనేగాని కొత్తవి కొనటం జరగదే' అన్నాడు కాశీపతి బటలు విప్పుతూ.

'ఎంత చెప్పినా వినరా మీరు? అవి అచ్చొచ్చిన కుర్చీ—టేబిలూను. వాటిమీదే చదివి మీ అన్న బి. ఏ. అయ్యాడు. నువ్వు పట్టా పుచ్చుకున్నావు. ఆఖరికి నీ పెళ్లాం కూడా ఆ కుర్చీ మీద కూర్చునే బి. ఏ. పాసయింది' అంది తల్లి.

'ఐతే ఇరవైయేళ్లకింద కొన్న ఈ పేకేజీ డొక్కులు రెండూ ఇంకా ఎంతకాలం వుండాలంటావమ్మా? ఆ పింపిరిమేకులు గుచ్చుకుంటే సెప్టిక్కయి ఒళ్లంతా కుళ్లిపోతుంది' అన్నాడు కాశీపతి విసుగ్గా. ఆ బొక్కి కుర్చీమీద కూర్చోడాని కిష్టంలేక నేలనే చతికిలబడ్డాడు.

'నీ కొడుకు బి. ఏ. అయేదాకా వుంచి ఆ తర్వాత ఏమైనా చేసుకో' అంది తల్లి.

'బి. ఏ. తప్ప నీ దృష్టిలో మరో చదువన్నది లేనట్టుంది. అయినా వాణ్ణింకా నిన్ననే బళ్లో వేసేం కదా! వాడి బి. ఏ. ఎప్పటికయ్యేను? ఈ కుర్చీ—టేబిలు ఎప్పటికి మారేను?' అంటున్నాడు కాశీపతి.

వాళ్లిలా అనుకుంటూ వుండగానే శేఖర్ చితికిపోయిన పలక పట్టుకుని జేవురించిన ముఖంతో ద్వారం దగ్గరకొచ్చి నిలబడ్డాడు. అక్కడదాకా వచ్చినవాడు ఇంట్లోకి రావడానికి జంకుతున్నాడు. వంటింట్లోంచి గదిలోకి వస్తూన్న సరళ శేఖర్‌ను చూసి ఖస్సుమంది.

'ఓరి వెధవా! ఇంకా ఇప్పుడే కదా బడికి దిగబెట్టేను. అప్పుడే వచ్చేసావేంరా?' అంటూ వాణ్ణి గదిలోకి ఈడ్చుకొచ్చి 'చూసేరా వీడు. ఇప్పటినుండే మాట వినకుండా తయారవుతున్నాడు' అంటూ భర్తతో ఫిర్యాదు చేసింది.

'నువ్విలా ఫిర్యాదులు చేసిచేసి వాడు నీ మాట వినని పరిస్థితి కల్పించుకోకు' అన్నాడు కాశీపతి నవ్వుతూ. కొడుకు కొత్తవల్ల బడికి వెళ్లడానికి జంకుతున్నాడని సర్దుకున్నాడతను. 'ఇలా రా! నాన్నా!' అని కొడుకుని దగ్గరకు పిలిచి ఒళ్లో కూర్చోపెట్టుకున్నాడు.

'మీరిలా ముద్దుచేసి వాణ్ణి పాడుచేస్తున్నారు. ఆ వెధవబడి ఎలాగుందో మీ ముఖ్యాన్ని అలాగే వుంది. ఈ బళ్లో సరిగా చెప్పరండీ—బాలవిహార్‌లో వేద్దామండీ అని మొత్తుకుంటే కుంటి సాకులన్నీ చెప్పి నా మాట పడనిచ్చేరు కాదు' అంది సరళ రుసరుసలాడుతూ. తనకొడుకు యూనిఫారమ్ వేసుకుని, బూట్లు తొడుక్కుని—టై కట్టుకుని టిప్‌టాప్‌గా రిక్షామీద కాన్వెంట్‌కు వెళ్లాలని ఆవిడ కోరుకుంది. కాని అలా జరగలేదు. అందుకే సరళ చాలా నిరాశ చెందింది.

'సరళా! నీ కొడుకు నొక్కణ్ణి బాలవిహార్‌కు పంపించగలవుగాని మన వీధిలోవున్న పిల్లలందరినీ పంపగలవా? వాళ్లకులేని ప్రత్యేకత నీ కొడుక్కుండా

అనుకోవడంలో అర్థం లేదు.' అన్నాడు కాశీపతి కొడుకు చేతిలో పలక కిందపెట్తూ.

'ఆదర్శం పలుకుతున్నా ననుకుని అసందర్భాలు పలికి నన్ను బోల్తా కొట్టించాలని చూడకండి. తిండి లేని వాళ్లకోసం మీరు తిండి మానుకుంటున్నారా? ఇంట్లోకూడా మోసపు మాటలాడేకంటే డబ్బు ఖర్చు పెట్టడానికి మీకు మనసొప్పదని చెప్పకూడదా! ఇంతకీ వాణ్ణి వెంటనే బడికి పంపుతారా? పంపరా?' అంది సరళ.

'మధ్యాహ్నం వెళ్తాడులేవే. ఇవాళా రేపూ వాడేం పట్టాపుచ్చుకోవాలా యేం?' అంది అత్తగారు.

'అలా నిర్లక్ష్యంచేస్తే వాడు గాలిపట్టిపోతాడు. తర్వాత విచారించి లాభం లేదు' అంది సరళ వంటింట్లోకి పోతూ.

సరళ ప్రతివిషయాన్ని అనవసరంగా ఒక సమస్యక్రింద మారుస్తూందనుకున్నాడు కాశీపతి. 'నాన్నా! ఏంరా బడినుండి వచ్చేసేవు?' అన్నాడు కొడుకు తల నిమురుతూ.

'నేను చెప్పను' అన్నాడు శేఖర్ ఒకవైపు వంచివున్న తల ఇంకా కిందకు దింపుతూ.

ఈ సమాధానం కాశీపతిని కొంచెం వేడెక్కించింది. 'ఎందుకు వచ్చేసేవని అడుగుతూవుంటే చెప్పనంటావేం?' అన్నాడు గట్టిగా.

అంతవరకు బిగువుగా పెంకి ముఖం పెట్టిన శేఖర్ కొంచెం ఏడుపు ముఖంపెట్టి 'ఆ బడి నాకేం బాగులేదు' అన్నాడు.

'బడి బాగులేక పోవడ మేమిటమ్మా! తప్పు అలా అంటే పాపం. చదువురాదు. దేవుడు కొట్తేస్తాడు. మీ నాన్న కూడా ఆ బళ్ళోనే చదువుకున్నాడు గదా! ఆ బడి మంచిదే'— అంది నానమ్మ.

అంతవరకు బడి నిజంగా బాగులేదేమోనని అనుకుంటూన్న కాశీపతికి తను అక్కడ చదువుకున్న సంగతి జ్ఞాపకానికొచ్చింది. ఇరవైయేళ్ల క్రిందట— అంటే స్వతంత్రం వచ్చిన కొత్తలో—తను ఆ బళ్ళో చదివేడు—ఆ బడి ఎంత బాగుండేది! మేష్టర్లంటే తనకు చచ్చేటంత భయముండేది—అయినా బడికి మాత్రం వెళ్లేవాడు—అప్పుడప్పుడు బళ్ళో బిళ్లలు పంచిపెట్టేవారు— రోజూ అందరూ కలిసి పద్యాలు—ఎక్కాలు చదువుతూ వుండేవారు—దసరా తిరిగి పాటలు పాడి పప్పుబెల్లాలు తెచ్చుకునేవాళ్ళు—ఇలా జ్ఞాపకం వచ్చిన మేరకి ఆ బడి గురించి ఆలోచించి ఆ బడంటే తన కిష్టంగానే వుండేదనుకున్నాడు కాశీపతి. ఆ మాటే అన్నాడు కొడుకుతో.

'అవును నా! ఆ బడి బాగానే వుంటుంది. నే నక్కడే చదువుకున్నాను' అన్నాడు కొడుకుతో.

శేఖర్ తండ్రి ఒళ్ళోంచి గభీమని లేచి 'నాకు బాగులేదు. నీ బళ్ళో నేను చదవను' అంటూ దూరంగా పోయేడు. సరళ వంటింట్లోంచి దెబ్బలాడుతూంది. కాశీపతి కేంచెయ్యాలో తోచడంలేదు. ఈ పూట ఎలాగూ గడిచిపోయింది. మధ్యాహ్నం ఏదోలా సముదాయించి పంపేద్దామనుకున్నాడు.

'మధ్యాహ్నం వెళ్లకపోతే అట్లకాడ కాల్చి వాతలు వేస్తానుండు.' అంటూంది సరళ.

'సరళా! నువ్వు వాణ్ణి బెదరగొట్టకు. వాణ్ణి బడికి తీసుకెళ్లి అప్పజెప్పే బాధ్యత నాది కదా!' అన్నాడు కాశీపతి.

భోజనంచేసి కొంచెంసేపు పడుకుని పావు తక్కువ రెండయేసరికల్లా లేచాడు కాశీపతి. శేఖర్‌ని బడికి తీసుకెళ్లడానికి నిశ్చయించుకుని బట్టలు వేసుకుంటున్నాడు. సరళ శేఖర్‌కు ముఖం కడిగి బట్టలు వేసి పలక చేతికిచ్చింది. ఆ కుర్రాడి ముఖం అదోలా గుంది. తండ్రివేపు—తల్లివేపు మార్చిమార్చి చూసేడు. ఏమనుకున్నాడో మరి! 'నాన్నా! నేనే వెళ్తాను. నువ్వు రావద్దు' అన్నాడు.

'నువ్వు ఒక్కడివీ వెళ్లగలవా?' అన్నాడు కాశీపతి నవ్వుతూ.

'మా నాయనే! ఇదర! ఈ పది పైసలూ తీసుకుని ఏదైనా కొనుక్కో' అంటూ పది పైస లియ్యబోయింది నానమ్మ.

'మీారు చీటికిమాటికీ వాడికి డబ్బు అలవాటు చెయ్యకండత్తయ్యా! అదే అలవాటవుతుంది. అడ్డమైనదీ కొనుక్కుతింటే ఆరోగ్యం పాడవుతుంది. నువ్వు వెళ్లరా!' అంది సరళ—

శేఖర్ మారు మాట్లాడకుండా బడికి వెళ్లిపోయాడు. కాశీపతి ఆ సాయంత్రమే బయల్దేరి కేంపు వెళ్లిపోయాడు.

కాశీపతి కేంపునుండి తిరిగి వచ్చేసరికి వారం రోజులయింది. అతనింటికి వచ్చేవేళకి శేఖర్ ఇంటి దగ్గర లేడు కాశీపతి ఆలోచనంతా శేఖర్ బడికి వెళ్తున్నాడా? లేదా? అనే విషయం మీాదే వుంది. సరళనడిగి శేఖర్ బడికి వెళ్తున్నట్టు తెలుసుకున్నాడు.

'బడికి వెళ్తున్నాడుగాని వాడికేమీా చెప్పడం లేదండీ. ఈ రోజుల్లో మేష్టర్లసలు చెప్పడమే మానేసేరు. అంత అన్యాయమైతే ఎలాగండీ? అందుకే నేను బాలవిహార్‌లో వేద్దామన్నాను అంటూ తన వాదాన్ని మళ్లీ ప్రతిపాదించింది.

'ఫిర్యాదులు చెయ్యొద్దని నీ కెన్నిసార్లు చెప్పేను. అసలు విషయం తెలుసుకోవాలి. మేష్టర్లుమాత్రం ఊరకనే చెప్పకుండా కూర్చుంటారా! నేనొకసారి వెళ్లి కనుక్కుంటాలే!' అంటూ కాఫీ తాగి బయల్దేరేడు.

బడి వాళ్లింటికి దగ్గరే. వాళ్లిల్లు ఒక విధంగా ఊరు కొసన వుంది. వాళ్ల వీధి మలుపులో రెండు రోడ్ల జంక్షనులోని మొదటి ఇంట్లో బడి వుంది. పై వూరునుంచి ఆ ఊళ్లోకి రావలసిన బస్సులు, లారీలు, బళ్లు—ఇతర వాహనాలన్నీ బడి అనే ఇంటి ముందునుంచే వెళ్తాయి. కాశీపతి మెల్లగా నడుస్తూ బడి చేరుకున్నాడు. ఈ లోగా తన చిన్నప్పటి బడి గురించి ఆలోచించుకుంటున్నాడు. ఒక్కసారి బడి చూడగానే అతనికేదో బాధ కలిగింది. అదొక మాసిపోయిన పాత పెంకుటిల్లు. రోడ్డుకెదురుగా హెడ్మాస్టరు కూర్చున్నారు. ఆయన కాశీపతికి తెలిసినవారే. కాశీపతిని చూడగానే ఆయనలేచి అతనిని ఆహ్వానించారు. కాశీపతి నమస్కారంపెట్టి లోపలికివెళ్తూ చుట్టూ కళ్లియజూసేడు. గుమ్మందాటగానే ఒకపెద్ద వరండాలాంటిదుంది. అందులో మధ్యకు రెండు బెంచీలు అడ్డంపెట్టి రెండుక్లాసులకింద విడగొట్టేరు. ఆ వరండా దాటి అవతలకువెళ్తే మరొక వరండా, ఒక చిన్నగది వున్నాయి. చౌడు రాల్తున్న గోడలు, గోతులు గోతులుగావున్న నేల. వానకు ఎండకు ఆగని పైకప్పు. బడినిండా కిటకిటలాడుతూ గోలచేస్తూవున్న పిల్లలు. ఇదంతా చూసి కాశీపతికి తల తిరిగింది.

'మా బడిచూసి భయపడుతున్నారా?' అని అడిగారు హెడ్మాస్టారు. కాశీపతి నవ్వలేక సమాధానంగా చిరునవ్వు నవ్వేడు.

'మన ఎలిమెంటరీ స్కూళ్లన్నీ ఈ పరిస్థితిలోనే వున్నాయి' అన్నారు మళ్లీ హెడ్మాస్టారే.

'మేం చదివినప్పుడు బాగానే వుండినట్టుండేదండి' అన్నాడు కాశీపతి నసుగుతూ.

'మీారు చదివినప్పుడు ఇంతమంది పిల్లలు చదువుకోడానికి వచ్చేవారా? నిలబడిపోయారు. కూర్చోండి' అంటూ కుర్చీ చూపించా రాయన. కాశీపతి పిల్లలు కూర్చున్న బెంచీమీాదనే కొంచెం చోటు చేసుకుని కూర్చున్నాడు. నిజమే! తను చదివినప్పుడింతమంది పిల్లలేరీ! బతిమాలగా బతిమాలగా క్లాసుకో పదిమంది వచ్చేవారు. ఇప్పుడలాకాదే. ప్రతి పిల్లడు చదివితీరవలసిందే. మరి ఈ బడి—ఈ సదుపాయాలు ఏం సరిపోతాయి! అనుకున్నాడు కాశీపతి.

'ఏూ అబ్బాయి బళ్లోకి రావడం లేదేమండీ!' అని అడిగారు హెడ్మాస్టారు కాశీపతి ఆలోచన కంతరాయం కలిగిస్తూ. కాశీపతికి ఒక్కసారి చుఱుకపెటి నట్టయింది.

'అదేమిటండీ! రోజూ వస్తున్నాడట గదా!' అన్నాడు కొంచెం తేరుకుని.

'రావడంలేదండీ! కావాలంటే వాళ్ల టీచరు నడుగుదాం పదండి' అంటూ చిన్న కొట్టులావున్న ఒకటో క్లాసు గదిలోకి దారితీసేడు. ఆ గదిలో కాలు పెట్టడానికైనా చోటు లేకుండా పిల్లలున్నారు.

అందరూ ఐదేళ్లు నిండీనిండని పసిపాపలు. ఒక్క కిటికీ య్యైనా లేని ఆ ఇరుకు గదిలో భారతభాగ్యవిధాతలు చెమటలు కక్కుతున్నారు. ముగ్గురు పిల్లలు బాగా చిన్నవాళ్లు—ఒక గోడవారకు చేరబడి నిద్రపోతున్నారు. ఇంకా కొందరు అక్షరాలు దిద్దుతున్నారు. వాళ్ల ముఖాలు వాడిపోయున్నాయి. మాస్టరుగారి కుర్చీ చుట్టూ సుమారు ఒక పదిహేనుమంది పిల్లలు మూగి 'నాకు రాయండి—నాకు రాయండి' 'నాది చూడండి—నాది చూడండి' అంటూ కుమ్ముకుంటున్నారు. ఆ సంరంభంలో మాస్టారు అక్కడకు వచ్చిన వాళ్లను గుర్తించడానికి కొంచెంసేపు పట్టింది.

'మీ అబ్బాయి నాలుగైదు రోజులనుండి రావడంలేదండీ!' అన్నా డాయన కాశీపతిని చూసి. కాశీపతి కామాటలేం వినపడలేదు. ఈ పిల్లలకు ఈ నరకం ఎందుకురా భగవంతుడా! అనుకుంటున్నా డతను. 'వస్తానండి' అంటూ గది దాటి బయటకు వచ్చేడు. ఆ పిల్లలను గురించి ఆలోచిస్తూనే హెడ్మాస్టారి దగ్గర సెలవు తీసుకుని యాంత్రికంగా రోడ్డు మీదకు నడిచేడు.

ఇంటికి పోదామనుకున్న కాశీపతికి ఎదురుగా—రోడ్డు కవతలపక్కనున్న రిజర్వాయరు కనిపించింది. ఆ ఊరంతటికీ ఆ రిజర్వాయరునుండే నీరు సరఫరా అవుతుంది. సుమారు పదెకరాల ఆవరణలో పెద్దపెద్ద రాతిగుట్టలమీద ఆ రిజర్వాయరు కట్టేరు. ఆ ఆవరణలో ఎన్నో పెద్దపెద్ద చెట్లున్నాయి. ఆ గుట్టలెక్కి చూస్తే ఊరవతల వున్న తోటలు—కొండలు—పొలాలు అందంగాఆకర్షణీయంగా కన్పిస్తాయి.అన్నిటికన్న అక్కడ పిల్లల్ని ఆకర్షించేవి పావురాకాయలు. తెల్లటి వార్నిష్ పూసినట్టుండే పావురాచెట చివళ్లనుండీ గాలి వీచి నప్పుడల్లా గిర్రుమని తిరుగుతూ మెల్లగా కిందకు దిగే పావురాకాయలు కాశీపతికి చిన్నప్పుడెంతో యిష్టంగా వుండేవి. చిన్నతనంలో ఎప్పుడూ ఆ రిజర్వాయరు దగ్గరే ఆడుకునేవాడు. కాశీపతికి ఒక్కసారి రిజర్వాయరు దగ్గరకువెళ్లిచూసి రావాలనిపించింది. రోడ్డుదాటి పెద్దఇనుపగేటు తోసుకుని లోపలికి ప్రవేశించేడు. మంచి ఎండలోంచి వచ్చేడేమో ఒక్కసారి చెట్లనుండి వచ్చిన చల్లని గాలి ఒంటికి తగిలేసరికి కాశీపతికి ఏదో అలసట తీరినట్లనిపించింది. ఆ చెట్లమధ్య నించి నడుస్తూ. రాళ్లుదాటి రిజర్వాయరు వెనుక పక్కకు వెళ్లేడు.

కాశీపతికి ఆశ్చర్యం కలిగేటట్లు శేఖర్ అక్కడ చెట్టునీడలోవున్న పెద్దరాతిమీద కూర్చుని ఊరవతల తోటలవేపు చూస్తున్నాడు. పలక—పుల్ల అతని పక్కనే పడున్నాయి. కాశీపతి కేం చెయ్యాలో తోచ లేదు. మెల్లగా నడిచి శేఖర్ వెనకాల చేరేడు. శేఖర్ అతను వచ్చిన విషయాన్ని గమనించనే లేదు. కాశీపతి చప్పుడు చెయ్యకుండా అతని పక్కన కూర్చు న్నాడు. ఆ సమయంలో కొడుకుని మందలించటం అతని కిష్టంలేకపోయింది. అందుకే మెల్లగా 'ఒరేయ్! నాన్నా! ఏంట్రా చేస్తున్నావిక్కడ?' అని అడిగేడు భుజంమీద చెయ్యివేసి దగ్గరకు తీసుకుంటూ.

ఏదో లోకంలోంచి వచ్చిన వాడిలాగ శేఖర్ 'నాన్నా! ఆ తోట లెంత బాగున్నాయో! అక్కడ కెళ్దామా!' అన్నాడు ఉత్సాహంగా. ఆ సమయంలో అతని ముఖంలో ఎంతో కుతూహలం. ఎన్నో ప్రశ్నలు.

కాశీపతి మరింత ఆశ్చర్యపడ్డాడు. తనను చూసి భయపడతాడనుకుంటే ఆ ఊసే లేకుండా ఇంకా ఉత్సాహంగా వున్నాడేమిటా! అనుకున్నాడు. ఆ కుతూహలాన్ని పెంపొందించి ఆ ప్రశ్న పరంపరకు సమాధానం చెప్పేబడి పిల్లలందరికీ ఎప్పటికైనా దొరుకుతుందా! అనుకున్నాడు.

---

# భాగవతాంధ్రీకరణము - మూలవిభిన్నత పాఠ భేదములు

శ్రీ శిష్ట్లా రామకృష్ణ శాస్త్రి

సంస్కృత భాగవతమును క్లిష్టముగను, సందేహకరముగ నున్న భాగములను శ్రీధర వ్యాఖ్యానము ననుసరించియు, అవసరమైనచో విశిష్టాద్వైత పరముగను గూడ చక్కగ వివరించి, మూలమునకు మెఱుగు పెట్టి, తెలుగువారికి బహు సరళముగను, సరసముగను గూడ నాంధ్రీకరించెనని పండితులందఱు నేకగ్రీవముగ నంగీకరించిరి. వేదవ్యాసులవారి సంస్కృత రచనకంటె నెక్కువ రసవంతముగ పోతన యాంధ్రీకరణ మున్నదని విమర్శకుల యభిప్రాయము ఇట్టిచో 'పొరపాటుననో, ఉద్దేశపూర్వకముగనో పోతన కవి మూలమునకు భిన్నముగ రచన సాగించిన భాగములు గూడ గొన్ని కానవచ్చుచున్న'వని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన యాంధ్రభాగవత పీఠిక 51 వ పుటలోను, 'అనువాద సమయమున మూలములోని పదములకును, భావములకును భిన్న పదములను భావములను చేర్చిన సందర్భము లక్కడక్కడ కన్పడుచున్న'వని శ్రీ ప్రసాదరాయ కులపతి యను నొకరు 'ఆంధ్ర భాగవత విమర్శ' యను డాక్టరు బిరుద పరిశోధన వ్యాస సంపుటి యందు 128 వ పుటలో వ్రాసిరి. మూలమందలి కొన్ని భాగములను వదలివేసినను ప్రమాదము లేదు కాని, మూలమునకు భిన్నముగను దుష్టముగను నాంధ్రీకరించెనేని యాంధ్రభాగవతమునకు కళంకమును, పోతనామాత్యునకు న్యూనతయు నాపాదించినట్లే యగును. అట్లే యగుచో నాంధ్ర భాగవతమునకుం బోతన కవికిం గూడం బైనం దెల్పిన ప్రశస్తి యుండనే యుండదు. కాన నా విషయము పరిశీలింపదగినది. ఈ విషయమున అకాడమీ ప్రచురణ పీఠిక కర్తలు 13 ఉదాహరణములను, శ్రీ ప్రసాదరావు సుమారు 10 యుదాహరణముల నొసంగిరి. వీనిలోఁ గొన్ని దుష్టపాఠములను గ్రహించుటవలన సంప్రాప్తమైనవి. కొన్ని సమర్థింపఁ దగినవి. కొన్ని యన్వయ దోషము వలన సంఘటించినవి. మిగిలినవి పునః పరిశీలనము వలనగాని తేలనివి. అందుచే నవి పరామర్శింపఁదగినవి.

అకాడమీవారి భాగవత పీఠికలో,

శ్లో॥ స ఏవ భూయో నిజవీర్య చోదితాం,
స్వజీవ మాయాం ప్రకృతిం సిసృక్షతీమ్,
అనామ రూపాత్మని రూపనామనీ,
విధిత్సమానోఽను ససార శాస్త్రకృత్
(1—10—22)

వ్యా:—అనామరూపే ఆత్మని రూపనామనీ విధాతు మిచ్ఛుః నిజవీర్య చోదితాం స్వాంశ భూతానాం జీవానాం మాయాం మోహినీం అత ఏవ సృష్టిమిచ్ఛంతీం ప్రకృతి మనుససార అధిష్ఠితవాన్—అని శ్రీధర వ్యాఖ్య.

పోతన 'నిజాంశ భూతంబులైన జీవులకు మోహినియైన సృష్టిసేయ నిశ్చయించి, నామ రూపంబులు లేని జీవులందు నామరూపంబులు గల్పించుకొఱకు, వేదంబుల నిర్మించి, మాయాను సరణంబుసేయు ననువారును' (భాగ 1—234) అని, 'స్వజీవ మాయాం' అను దానిని, సృష్టికి విశేషణము గావించెను. 'ప్రకృతి మనుసార' అని మూలమునందుండ, 'మాయానుసరణము సేయునను వారును' అని యనుసరించుటకు 'మాయను' కర్మ గావించెను'—అని వ్రాయఁబడెను.

పై నొసంగిన యాంధ్రీకరణము అకాడమీ ప్రచురణ పాఠమైనను, వావిళ్ల వారి ప్రతిలో— 'నిజాంశ భూతంబులైన జీవులకు మోహిని యగుచు సృష్టిసేయ నిచ్చించి, నామరూపములు లేని జీవులందు నామరూపంబులు కల్పించుకొఱకు, వర్తిల్లు స్వమాయ నంగీకరించు ననువారును' అని యున్నది. వావిళ్ల వారి పాఠము ప్రకారము, 'సృష్టికి' – 'స్వజీవ మాయాం' అనునది కర్మ యగుటలేదు. ఈ పాఠమున 'మాయానుసరణంబు' అని లేదు. మాయ నంగీకరించుట యని మాత్రమున్నది. కాన వావిళ్ల వారి పాఠ మంగీకరించినచో, అకాడమీ ప్రతి పీఠిక వారి యాక్షేపణము తొలఁగిపోవుచున్నది. వావిళ్ల వారి పాఠమే, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు పరిష్కరించి యిచ్చిన 'రాయలు అండ్ కో' వారు ప్రచురించిన భాగవత ప్రతిలోఁ గూడ నున్నది.

శ్లో॥ గోప్నైర్మఖే ప్రతిహతేవ్రజ విప్లవాయ,
దేవేఽభివర్షతి పశూన్ కృపయా రిరక్షుః,
ధర్తోచ్ఛిలీంధ్ర మివ సప్త దినాని సప్త,
వర్షో మహీధ్ర మనఘైక కరే సలీలమ్॥
(2—7—32)

శ్రీకృష్ణుడు పశువులను రక్షించుటకై పర్వతము నేకకరమున లీలగా శిలీంధ్రము వలె (వర్షాసూ త్పన్నం శిలీంధ్ర కుసుమ మివ అని వ్యాఖ్య) ధరించెనని ఈ శ్లోకమునందలి యర్థము. కుక్కగొడుగు కడు తేలికయైనది. మహా పర్వతమును గూడ కుక్కగొడుగును వలె నవలీలగ నెత్తెనని కవి భావము. పోతన 'శైలరాజ మచల చ్ఛత్రంబుగాఁ దాల్చి' 11- 187. అని శిలీంధ్ర పదమునే తొలగించివైచెను—అని అకాడమీ ప్రతి పీఠిక కర్తల యాక్షేపము. శైలరాజమును కుక్కగొడుగుతోఁ బోల్చుట నీచోపమ యగును. దానిని పరిహరించుటకై యా పదమును పోతనగారు విడనాడిరి. ఇట్లు నీచోపమను పరిత్యజించుట మూలమునకు మెఱుగు పెట్టినట్లే యగును గాని మూలములోని నీచోపమ నాంధ్రీకరణములో నిలుపలేదనుట సరసము గాదు. ఔచిత్య పోషణమునకై పోతన బుద్ధిపూర్వకముగానే యీ మార్పు చేసియుండును. ఇందుకు మనము పోతన నభినందింపవలసి యుండఁగా, దోషారోపణము చేయుట సరసముగా నుండదేమో. మూలమునకు మెఱుఁగు పెట్టిన భాగములను [illegible] ప్రతి పీఠిక కర్తలు చేయవే [illegible] జెప్పిన యుక్తముగా నుండియుండును. [illegible] గోవర్ధన గిరి నెత్తు వర్ణనలో గూడ [illegible] కవి—

శా॥ బాలుం [illegible] పర్వతమని సంభావించి పూగుత్తి కెం
గేలం [illegible] లీలే నపుడో కృష్ణుండు దా నమ్మహా
శైలంబు [illegible] దాల్చి విపుల
చ్ఛత్రా [illegible]'...X-(1)916

క॥ రాజీవ [illegible]
రాజీవము [illegible] మెఱసెఁ
రాజేంద [illegible]
రాజ [illegible] గదుఁ॥
([illegible] 1—922)

అని పూగుత్తితోఁ [illegible], యెంత తేలిక యైనను కుక్కగొడుగు [illegible] బోల్చుటకంటె మెఱుగే యగును.

ప్రహ్లాదునికి [illegible] గఱపితివని హిరణ్యకశిపుఁడు [illegible] నతఁడు,

శ్లో॥ న మత్ప్రణీతం [illegible],
సుతో వదత్యేష సురేంద్ర శత్రో,
నైసర్గికీయం మతిరస్య రాజన్,
నియచ్ఛ మన్యుం కద దాస్మ మాస॥
(7—5—28)

అని పలికెను. సాభిప్రాయ[illegible]యైన 'ఇంద్ర శత్రో' శబ్దమును పోతన [illegible], 'తప్పులు లేవు మావలన దానవనాథ [illegible] నిటువలెఁజేయగ శత్రులమే దైత్య [illegible] వింటే'...
([illegible]—176—177.)

అని, 'దానవనాథ, దై[illegible] చంద్రమ' అను సామాన్య సంబోధనలను [illegible] నని యాక్షేపణము. ఇది యంత గణనీయము గాదు. పోతన

చేసిన సంబోధనలు గూడ నర్మమైనవే కదా. దీనివలన మూల మందలి ప్రధానమైన భావమునకు భంగము రాదు.

అంబరీషుని గుణములను వివరించుచు మూలమున
'తద్భృత్యగాత్ర స్పర్శేఽంగ సంగమవ్,' అని

వ్యాసులవారు రచింపగా, దానికాంధ్రీకరణముగ పోతనగారు 'సంగమచ్యుత జనగుణ సంగమందు'— (Ix-82 అని వ్రాసిరని 'గాత్రమును గుణము సమానార్థకములు గానేరవు. అంగ సంగమనిన కరచరణాద్యవయవ సంబంధమనియు, గాత్ర స్పర్శమనిన ఆలింగన హస్త స్పర్శనాది యనియు శ్రీధరులు స్పష్టముగా వ్యాఖ్యానించి యున్నారు' అని వెనుకందెల్పిన "ఆంధ్ర భాగవత విమర్శయగు డాక్టరు బిరుద పరిశోధక వ్యాస సంపుటి (పుటలు 133—34) లో శ్రీ ప్రసాదరాయ కులపతిగారి యాక్షేపణ. ఇక్కడ 'సంగమచ్యుత జనగుణ సంగమందు' అనుచోట 'సంగమచ్యుత జన తను సంగమందు' యని వావిళ్లవారి ప్రతిపాఠము. అప్పుడు గాత్ర శబ్దమును తను శబ్దమును సమానార్థకములె కదా. ఒకవేళ 'గుణ' శబ్ద పాఠమే వారికిం గావలయు నన్నచో,— గుణశబ్దమచ్చు పొరపాటో, లేక లేఖక ప్రమోదమో యై యుండునని నాయుద్దేశము— అది 'గణ' శబ్దమునకు 'గుణ' అని పడియుండును. అప్పుడు 'అచ్యుత జనగణ సంగమందు' యను పాఠము గూడ సమంజసముగనే యుండును. ఇక్కడ 'గణ' మనగా సమూహమని యర్థము. అప్పుడు 'సంగమచ్యుత జనగణ సంగమందు' అని యగును. లేదా, 'గాత్ర' శబ్దార్థ స్పష్టతకు 'అంగమచ్యుత జనగణ సంగమందు' అని సరిదిద్దినను సరిపోవునుకదా. ప్రాచీన లిఖిత ప్రతులు అనేక లేఖక ప్రమాదములకు పాలైనవి. అందులో నిది బహు స్వల్పమును సులభమునైన దోష సంస్కరణము. డాక్టరు బిరుద పరిశోధక వ్యాసములకు పాఠపరిశోధనముగూడ నత్యవసరమేమో. పద్యములో నర్థము భ్రష్టమైనపుడు ఆ దోషమును కవి కంటగట్టుటకు పూర్వము పాఠమును సంస్కరింప వచ్చునేమో యని చూచుట యనివార్యము. ఇంతకు వీ పాఠ మే ప్రతిలోనిదో వారు దెలుపలేదు.

గోపికలు శ్రీకృష్ణు వెదకిరని తెల్పుఘట్టమున దశమ స్కంధములో మూలమున,

శ్లో॥ గాయంత్య ఉచ్చైరముమేవ సంగతా,
విచిక్యు రున్మత్తక వద్వనాద్వనమ్,
పప్రచ్ఛు రాకాశ వదంతరం బహిః,
భూతేషు సంతం పురుషం వనస్పతీన్.

అని యున్నది. దానిని పోతనగా రిట్లాంధ్రీకరించిరి.

క. భూతములలోన వెలి ప్ర
ఖ్యాతుండగు నట్టి వాని కాంతులు కాళిం
దీతీర వనాంతరముల, బ్రాతిన్ వెదకంగ జనిరి
పాడుచు నధిపా! (xi-1007)

శ్రీధరు లిక్కడ 'వనస్పతీన్ పప్రచ్ఛుః' భూతేషు అంతరంమధ్యే సంతం పురుషశ్చ సంతమితి' అని వ్యాఖ్యానించిరి. భూతముల లోపల నంతర్గతుండై యున్న వానిని బయట వెతకిరని యర్థము. 'భూతములలోన వెలిప్రఖ్యాతుండగు నట్టివాని' అను తెనుగు సేత మూలార్థ విభిన్నత అని ప్రసాదరావుగారి వివరణము (పుటలు 136—137). ఇక్కడ పోతనగారి పద్యమునకు— 'భూతములలోన = భూతములయొక్క; వెలి=బైట; ప్రఖ్యాతుండగు నట్టివాని' అని ప్రసాద రావుగా రర్థము చేసికొనిరి. కాని, భూతముల=భూతములయొక్క; లోన = లోపలను; వెలి=బైటను; ప్రఖ్యాతుడగునట్టి వానిని వెదకిరని యన్వయము చేసికొనుటకు వీలులేదా? చిన్న కందపద్యమునకు సరిగా నర్థము చెప్పుకొనటచేతకాక, 'రామునితోక' అని యన్వయింపజూచెడు వారు పోతనార్యునంత వానిపై దోషారోపణ చేయంబూనుట సాహసము కదా!

ప్రసాదరావుగారు చేసిన మఱియొక యాక్షేపణము. పోతనగారు 'వాక్యగర్భిత' మను కావ్యదోషమునకుం బాల్పడిరట. అది శృంగి పరీక్షిత్తును శపించు సందర్భమున నీ పద్యమందు,

శా॥ ప్రారంభమ్మున వేటవచ్చి
ధరణీపాలుండు మా తండ్రిపై,
నేరంబేమియు లేదు,
సర్పశవమున్నేదుగ్రుండై వైచినాం
డీరీతిన్, ఫణి కమ్మజుఱ బ్రతుకునో,
హింసించునో కోరలన్,

రారే తాపసులార! దీని దివరే,
రక్షింపరే, మ్రొక్కెదన్. (I-476

ఈ పాఠ మాంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన యాంధ్రభాగవతములోనిది. దీనిపై ప్రసాదరావుగారి విమర్శ యిది. 'అలంకార శాస్త్రము ననుసరించి దీనియందు వాక్యగర్భితమను నొక దోషము గలదు. ఒక వాక్యమధ్యమున వాక్యాంతరము ప్రవేశించుట దీని లక్షణము. కానీ భాగవత పద్యమున ఆ దోషము గుణమైనది. ధరణీపాలుండు మా తండ్రిపై సర్వశవమున్నేడు గుండె వైచినాడు—అను నది యొక వాక్యము. దానిమధ్య—నేరంబేమియు లేదు— అను మఱియొక వాక్యము ప్రవేశించినది. ఒక భావ ముత్కటస్థితిలో వెలువడునపుడు ఇట్టి వాక్య ప్రయోగము లోకదృష్టమే. పోతన జాత్యమగు నుడికారపు సొంపు ననుసరించి యిట్లు రచించుట, ఆ బాలుని యమాయకత్వమును, అతని భావోద్రేకమును, అక్రమ ముగా అన్యాయము జరుగుటచే కలిగిన పరితాపమును, ఆ అన్యాయమునుండి రక్షించుటకై ఇతరుల నర్థించు టలోగల ఉద్వేగమును ప్రస్ఫుటమైనది. ఆయన కవితా శిల్పములో ఇదియొక వజ్రపు తునక'—(పుటలు 172–173) ఇందలి వ్యాఖ్యాన పూర్వకమైన సమ ర్థన ప్రసాదరావుగారి ప్రతిభను చాటుచున్నది. సందే హము లేదు. వారు కులపతికదా. కాని యిటువంటి వాక్య ప్రయోగము లోక వ్యవహారములో దృష్టమే యైనను, కావ్య వ్యవహారములో దుష్టమని యలంకార శాస్త్రానుగుణముగ ప్రసాదరావుగారే యంగీకరించిరి కదా. కాన యథార్థముగ నీదోషము పోతనగారి రచనలో మున్నదా? లేక, ప్రసాదరావుగారు తెచ్చిపెట్టుకొనినదా? లేక పాఠదోషమా యని విచారణ కొంచె మాలో చించినచో పోతనగారికీ దోషమంటగట్టుట యప చారమే యగును. లేదు' అనుచోట 'దు'కు బదులుగా 'క' అనిమార్చి 'నేరంబేమియులేక' అని చదువు కొనినచో నీ చిక్కులేమియు నుండవు. వజ్రపు తునుక కాకపోయినను, కావ్యదోషము మాత్రముండదు. ఇది బహుస్వల్ప విషయమును, చాల తేలికగ సాధ్యమగునదియు కూడ. వావిళ్ల వారి ప్రతిలోను, రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు పరిష్కరించిన రాయలు కంపెనీవారు ప్రచురించిన భాగవత ప్రతిలోగూడ 'లేక' యను పాఠమే కలదు, 'లేదు' అనుపాఠము లేదు. ప్రసాద రావుగారు వివిధ భాగవతము ముద్రణ ప్రతులను చూచినట్లుగా, సంప్రతించిన గ్రంథపట్టికలో నిచ్చి వారు. వారికి వావిళ్ల ప్రతిపాఠము నచ్చలేదా? వంద లాదిగా లిఖిత ప్రతులను, ముద్రణ ప్రతులనుగూడ పరిశీలించి నిర్ణయించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకా డమి వారి పాఠకులను ప్రామాణికము గ్రహించుటలో నాశ్చర్యము లేదు. ప్రామాణికములైన పాఠములను నిర్ణయించుటకు హేమాహేమీలైన గొప్పపండితుల సమితి మూలముతో బోల్చి నిర్ణయించినది. ఇటు వంటి సమితి నిర్ణయించిన పాఠములే పరిశోధక విద్యార్థులకు సంకటములు గూర్చినచో నింకజెప్ప వలసినదేమువ్నది. ఈ పాఠమునుబట్టి వెనుక చర్చించిన 'సంగమచ్యుత జనగుణ సంగమంద' అనుపాఠమును గూడ సాహిత్య అకాడమీ వారి పాఠమే యగునని నా విశ్వాసము. సరియైన పాఠమును నిర్ణయింపక, దుష్ట పాఠముల నంగీకరించి, పోతన కవి మూల విభిన్నముగ నాంధ్రీకరించెనని దోషారోపము చేసినచో నెవ్వరేమి చేయగలరు. ఆంధ్రభాగవతమును పూర్వ మొక మాఱు పరిష్కరించి యనుభవమున్న యే రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు వంటివారు గూడ నా సమితిలో నున్నచో నిట్టి పొరపాట్లు జరుగవేమో. అధిక లిఖిత ప్రతులలోనుండు దుష్ట పాఠముకంటె, స్వల్ప ప్రతులలోనుండు సుష్టుగు పాఠమును గ్రహించుట మేలు కదా.

అంబరీషోపాఖ్యానమున దుర్వాస మహామునిని సుదర్శన చక్రము వెంబడించిన విధము మూలమున నిట్లున్నది.

శ్లో॥ దిశోనభః క్ష్మాం వివరాన్ సముద్రాన్,
లోకాన్ సపాలాంస్త్రి దివం గతస్సః
యతో యతోధావతి తత్ర తత్ర,
సుదర్శనం దుష్ప్ర సహ దదర్శ॥

పై శ్లోకమునకు పోతనగారి యాంధ్రీకరణ మిది.

మ॥ భువి దూరన్ భువి దూరు,
నబ్ధి చొర నబ్ధుల్ సొచ్చు నుద్వేగియై

దివి ద్రాకన్ దివి ద్రాకు,
దిక్కులకుఁ బో దిగ్వీధులంబోవుఁ, జి
క్కివెసన్ గ్రుంకిన గ్రుంకు,
నిల్వ నిలుచుం, గ్రేడింపఁ గ్రేడించు నా
క్కవడిన్ దాపసు వెంట నంటి
హరి చక్రం బన్య దుర్వ్యక్రమై ॥(X–107)

చక్రము దుర్వాసుని వెంటనంటి వచ్చునపు డతడు భువి దూర, తానును భువి దూరుట, అతడు సముద్రములోఁ జొచ్చిన తానును సముద్రములో చొచ్చుట సముచితమే. కాని యతఁడు నిల్చిన తానును నిల్చుట, కేడించిన తానును కేడించుట అర్థసహిత ముగా తోచదు. తాను నిల్చినపుడు నిల్చి తాను తొలగి నపుడు తొలగిన, ఇక దూర్వాసునకు భయపడవలసిన పని యేమున్నది. మూలమున నిట్లు లేదు. అతఁ డెక్కడికిఁ బోయినను అక్కడక్కడ నెల్ల అది కన్పించె ననియే కలదు. దుర్వాసుని చంపుట చక్రము సంకల్పము గాదు. భయపెట్టుటయే దాని యుద్దేశము గావచ్చును. కాని పద్యములో చెప్పినట్లు నిల్చుట, తొలగుట ఆ పనిని నెఱవేర్పలేవు. అతఁడు నిల్చినను తాను పైకి దూకుచున్నట్లే నటింపవలెను. ఇచట పోతనార్యుని రచన మూలముతో సరిపోదని చెప్పక తప్పదు.'—అని ప్రసాదరావుగారి యాక్షేపణ.

ఇది మూలముతో సరిపోకపోయినను మూల మునకు మెఱుఁగు పెట్టుటయే యగును. పోతనకవి మూలమునకుఁ గొన్నిచోట్ల మెఱుఁగు పెట్టినాఁడని సహృదయ పండితలోకము గ్రహించిన విషయమే. ప్రసాదరావుగారు సహృదయముతో భావన చేసినచో నిది మూలమునకు మెఱుఁగు పెట్టినట్లే తోఁచి, యాక్షేపణమున కవకాశ ముండెడిది కాదు. యథార్థ మునకు వారి పూర్వపక్షములోనే చక్కని సమాధాన మిమిడియున్నది. దూర్వాస మహామునిని చంపుట సుదర్శన చక్రము సంకల్పముగాదని ప్రసాదరావుగారే యంగీకరించిరి. భయపెట్టుటే దాని యుద్దేశము గావచ్చుననిరి. 'కానీ పద్యములో చెప్పినట్లు నిల్చుట, తొలగుట ఆ పనిని నెఱవేర్పలేవు. అతడు నిల్చనను, తాను పైకి దూకుచున్నట్లు నటింపవలె'నని పోతన గారికి వారి యుపదేశము. కాని వారి యుపదేశము ప్రకారము జరిగినచో రెండు ప్రమాదము లున్నవి. దూర్వాసుడు నిల్చినపుడు చక్రము పైకి దుమికినచో మహర్షిని చంపక యుండలేదు. అది దాని యుద్దేశము గాదని ప్రసాదరావుగా రంగీకరించినదే. పోతే, దూకి నట్టే నటించవలెనట.—వారి యుపదేశము ప్రకార మొకమాఱు దూకినట్లే మాత్రము నటించి, సంహ రింపకపోయినచో, తర్వాత దుర్వాసమునికి చక్రమువలని భయపడవలసిన పనియే యుండదు. 'కుట్టకపోయిన కుమ్మరిపురుగే కదా' యను సామెత సిద్ధించును. కాబట్టి కేవలము భయపెట్టుటయే యుద్దేశ మైనప్పుడు, దూర్వాసుడు నిల్చిన తాను నిల్చుటయు, క్రేడించిన తాను క్రేడించుటయు నవసరమే కదా. పోతే, 'ఈ రెండు భావాలను మూలమున లేవు కాన పోతనగా రెందుకు వ్రాసినారా' యని యాక్షేపణ చేయుదురా? అదే మూలమునకు మెఱుఁగు పెట్టుట యందురు సహృదయులైన విమర్శకులు. భయంకర మైన వస్తువు ఎదుటనుండినచే చాలును, చంపునేమో యని భయముగొల్పును. పూర్తిగ వెనుకకు మరలి పోయి, యుపసంహరింపఁబడి, దృగ్గోచరముగాని యప్పుడే భయము తీరిపోవును. కాని తాను నిల్చినపుడు నిలిచియు, తొలఁగినపుడు తొలఁగినను, దృష్టిపథ ములో నున్నంతవరకు నది చంపునేమో యను భయము తప్పదు. ఇది భావనాశక్తివలన నేర్పడఁదగిన కల్పన. భావనాశక్తి లోపించినపుడు దోషముగనే గోచరించును. ఉదాహరణమునకు—దోషి యొకఁడు పోలీసు కానిస్టే బులునకుఁ జిక్కినాఁడనుకొనండి, దోషిని చంపుటకు కానిస్టేబులున కధికారము లేదు. కాని వాని వెంటఁ బడిపోవుచు, మధ్య మధ్య నా దోషి యే లఘు శంకతో యాగినచోట కానిస్టేబులు కూడ నాగుచు, తొలగినచో తొలగును. తర్వాత మరల తప్పక వెంటాడును. ఇటువంటి స్థితియే సుదర్శన చక్రము దూర్వాసుని వెంటాడుటకూడ. కానిస్టేబులు వెంటాడి నంతవఱకు దోషికి భయమెట్లు తప్పదో, దూర్వా సునికి వెంటాడు చక్రమువలన మధ్య మధ్య నిల్చినను తొలఁగినను గూడ భయముమాత్రము తప్పదు.

శ్రీకృష్ణుఁ డంతఃపురమునఁ దనభార్యలను పరామర్శించుచు,

మ॥ కొడుకుల్ భక్తి విధేయు లౌదురుకదా,
కోడండ్రు మీ వాక్యముల్

కడవంబాఱక యుందురా?
విబుధ సత్కారంబు గావింతురా?
తొడవుల్ వస్త్రములుం బదార్థ
రస సందోహంబులుం జాలునా?
కడమల్ గావుకదా భవన్నిలయముల్
కల్యాణ యుక్తంబులే॥ (భాగ. 1. 267)

"కృష్ణుఁడీ పద్యమున సామాన్య సంసారి యగుట చిత్రము" అని ప్రసాదరావుగారు వ్రాయుటయే కాక, 'కథారంగమును మఱచి పోతన తన సంసార రంగమునే ఇక్కడ ప్రతిఫలింపఁ జేసినాడు. ఆయన రచనా వైఖరిలో ఇదియొక విశేషము. ఎట్టికథను కవితా వస్తువుగా గ్రహించినను లీనమై తానే ఆ పాత్రలో వర్తించి, తన వైయక్తిక భావాను భూతులే వానిలోను ప్రతిబింబింపఁ జేయును. ఆయ నకు రెండే రంగములు. ఒకటి సంసారము. రెండవది వైకుంఠము' అని కూడ వ్రాసిరి (పుట. 165) శ్రీకృష్ణుడు సామాన్య సంసారివలె నగుటలో విచిత్రము లేదు. ఏలన ఆయన జగన్నాటక సూత్రధారుడుకాన. కాని, 'కథారంగమును మఱచి పోతన తన సంసార రంగమునే ఇక్కడ ప్రతిఫలింపఁ జేసినాడు. ఆయన రచనా వైఖరిలోనే యిది యొక విశేషము...ఆయనకు రెండే రంగములు. మొదటిది సంసారము" అనుటకు పోతన జీవిత తత్త్వమును యథార్థముగ గ్రహించిన ప్రాజ్ఞులెవ్వరు నంగీకరింపరు. ఏలన ప్రసాదరావుగారే 204 వ పుటలో వామన చరిత్రలో నమూలమగు,

మ॥ చెలియే మృత్యువు, చుట్టమే
యముడు, సంసేవార్థులే కింకరుల్
శిలలం జేసెనె బ్రహ్మతన్ను,
దృఢమే జీవంబు నో చెల్లరే,
చలితంబౌట యెఱుంగవిా
కపట సంసారంబు నిక్కంబుగా
దలచున్ వమాఢుండు సత్యదాన
కరుణాధర్మాధి నిర్ముక్తుఁడై॥ (VIII–649)

అను పద్యమునుజూపి 204 వ పుటలో "జగత్తు మిథ్యయనియు, విష్ణుభక్తి యొక్కటియే జీవులను తరింపచేయుననియు ఆయన విశ్వాసము" అని కూడ వ్రాసిరి. కాని యీ రెండు వాక్యములును పరస్పర విరుద్ధములు. ఏలన "చలితంబౌట యెఱుంగరీ కపట సంసారంబు నిక్కంబుగా దలచున్ మూఢుండు"ని స్వతంత్రముగా వ్రాసిన మహాభక్తుడును, విరాగియు నివృత్తమార్గోపజీవియునగు పోతననుగూర్చి పరస్పర విరుద్ధభావములుగల ప్రసాదరావుగారికి పోతనను గూర్చి నిశ్చితమైన యభిప్రాయము లేదన్నమాట.

భాగవతాంధ్రీకరణమున బమ్మెరపోతరాజు రేఫశకట రేఫములకు మైత్రి గూర్చెననియు నందుచే నతడు లాక్షణికుడైన కవిగాడని యప్పకవ్యాదులు దోషా రోపణము చేసిరి. ఆంధ్రకవులలో గొందఱు ఈ భేదమును పాటించిరి. మఱికొందరు దీనిని పాటింపరైరి. భాగవత శిథిలభాగములను పూరించిన నారయాదులు రచించిన భాగములలో నా దోషములుగలవు కాని పోత నార్యుని రచనలో నాలోపములులేవని కొందఱు సమర్థించిరి. వ్యాకరణమునకును లక్షణమునకు నెంత మాత్రము గౌరవములేని యీకాలమున నిదోషమంతగా పరిగణింపఁదగినది కాదు. కాని సంస్కృత భాగవ తార్థమునకు భిన్నముగా పోతన యాంధ్రీకరించెనని యభాండము వేయుట సముచితముగాదు. మూలమునకు మెఱుఁగుపెట్టుట మూలార్థ భావములకు భంగము గాఁజాలదు.



# ఉభయ సంధ్యలు

## డా. ముదిగొండ శివప్రసాద్

ఇటు తూర్పున

తలిరాకు జొంపాలపై స్నిగ్ధంగా ముగ్ధంగా జారే మంచు బిందువులా
తామర కొలనును వేయి ముఖాలతో విప్పార్చే నునులేత కిరణంలా

తుషారంతో,
తరుణారుణ భాను విషాణంతో సించితమైన
మలయగంధ సార సమార్ద్ర పవనంలా
పవనంతో రెపరెపలాడే పైరులా
భూమాత కట్టుకున్న చిలకపట్టు చీరెలా—
ఇటు తొలి వాకిలి రంగుల తెర !!

అటు పడమర

ముసలితనంతో నెరిసిన మబ్బు ముక్కలా
అలసిన సూర్యుని పండువారిన ద్రుక్కులా అస్రుక్కులా
నిరాశాంధకారానికి ఉపధలా, ద్విపదలా
తెలుపు, ఎరుపు, నలుపుల వర్ణ సమామ్నాయంతో
అటు మలివాకిలి మాయల వల !!

అసంధ్యగా మారిన ప్రకృతికన్న స్వప్నాలు ఘనీభవించినప్పుడు
ఆకారంలేని ఒక నిర్వికారం నామరూపాలతో దర్శనమిచ్చినప్పుడు
తొలి వాకిలినుండి బ్రాహ్మీ ముహూర్తంలో అవతరించిన ఒక దరహాసం,
మలివాకిలినుండి నిర్గమించింది కొన్ని క్షణాల తర్వాత

రెండు ద్వారాలకూ మధ్య ఓ ఆరడుగుల ప్రాంగణం !
పురాతన సనాతన చిరంతన నిరంతర ప్రవా ప్రాంగణం !!
ఇంట్లో చాందినీలు విరిసిన కొన్ని గదులతోబాటు
శిథిలమైన ఖాజు తోరణాల సవ్వడులూ విన్నాను.
రాగోష్ఠ చుంబనాలతోబాటు
రక్త కరాళ కృత్యాలూ కృత్యాలూకూడా కన్నాను.

అనందం వెల్లువగా పొంగిన ఈ ఇంట్లోనే
అదుగో విద్వేషం వింధ్య పర్వతంలా లేచింది

ఆనంద వారిధికి కాల్వలు నిర్మించడంచేత కాక
అగస్త్యుణ్ణి ఆ వాహనచేసే శక్తిలేక
మరో ఇంటికోసం వెతుకులాట
మరణానంతర జీవనానికై ప్రాకులాట !

పరిమితమైన ఈ ప్రాంగణంలోనే
ప్రజ్ఞా ప్రతిజ్ఞా ప్రదర్శనాలు
అజ్ఞానపు గంజాయి వనాలో
నిలబెట్టిన కత్తులు
నిర్నిద్రమైన అతిమానస తపస్సులు

రాఖందుల రాక్షస స్వప్నాలతోబాటు
రాత్రి తర్వాత రాబోయే అరోరాకోసం
మానస సరోవరం చుట్టూ మూడు వందల కోట్ల హంసలు
అమృతాభి గమనానికై సాగించే
నిరీక్షణా చిత్రం !

కాలంపై విసిరిన గాలంతో
కొందరి ఇంద్రజాలంతో
ఇప్పటినుండి నిన్నటికీ రేపటికీ పరుగులాట !
'ఇప్పుడే' నిన్నగానూ రేపుగానూ మారుతుందని తెలియని వెతుకులాట

జీవనాన్ని చూచి భయపడే పిరికివాడికి
జీమూత కేతనుడైన పలాయన వాదికి
రెండు వాకిళ్లూ రెండు బ్రహ్మరాక్షసులు
మధ్యనున్న 'ప్రాంగణం' మలినం--నికృష్టం—మోహావేశం.

వేదాంతులు ఎన్ని గ్రంథాలు వ్రాసినా వాదాలు చేసినా
వారి మేధా వినిర్గత సిద్ధాంత కుసుమాలు పూచినా
ఈ రంగుల తెరల ఇంద్రజాలం తెలియకనే
ఈ మంత్ర కవాటాలు తీయడం మూయడం ఎరుగకనే !
శంకరుడు, గౌతమ బుద్ధుడు, చార్వాకుడు ఐన్‌స్టీన్
ఇందరికి తెలియని ఈ రంగుల తెరల కవతలి
దృశ్యంతో విశ్వంతో నా కేమిటి పని ?
ఉపాధికి దర్శనమిచ్చే ఈ ప్రాంగణంలోనే
ఉన్నంతకాలమూ యదార్థంగా పదార్థంగా జీవించడమే
ఇందరి ధ్వని !!

---

# ఎదగని తోటలో....

# ....ఎదిగిన గులాబి

శ్రీ ఆర్. ఎస్. కె. మూర్తి

ఆ తోటకంతటికీ ఆ గులాబీనే ఏదో వింతగా ఉంటుంది. తోటంతా ఎదగని మొక్కలు; పెరగని పూలు. ఆ తోటలో పూసిన బంతిపువ్వు గడ్డిపువ్వంత చిన్నదిగా ఉంటుంది. బొడ్డుమల్లె జెల్లగోరింట పువ్వులా ఉంటుంది—వాసనా, వన్నెకాదూ లేకుండా. ఇక ఏ దానిమ్మో పిందెవేస్తే, అది చచ్చినా పెరగదు. సందుగు... ఆ నేల పూలతోటకు అనువైనది కానేకాదట. గోంగూరంటు, అదీ. వంకర పూలే పూస్తుంది!

కాని, ఆ గులాబీమొక్కం అదేమిటో ఏపుగా ఎదిగింది: చక్కటి పూలు పూస్తున్నది. సువాసనలు విరజిమ్ముతున్నది.

ఏపుగా ఎదిగిన ఆ గులాబీని చూస్తే, గాడిదల మధ్య నించున్న జిరాఫీ గుర్తుకొచ్చింది, కొందరికి—కాదు. కాదు, చాలమందికి. ఏ జనాభ్యమో గుర్తుకు రాదా అంటే రాకుండా మరి! ఇంతింతై వటుడింతై భూనభోంతరాలు నిండి సకల లోకాలకు గౌరవ భాజనమైన పరమేశ్వరస్వరూపం గుర్తురాకూడదా అంటే రాదు మరి! గాడిదలమధ్య నించున్న జిరాఫీనే గుర్తుకొస్తుంది—ఈ లోకపు జనాలకందరికి.

ఎందుకునంటే......ఏం చెప్పగలం? ఎవరి సంస్కారం వారిది!

ఎదగని తోటలో ...ఎదిగిన గులాబీ! అందరిలోను అది ఆప్యాయతనే రేపాలనే ఆశకు ఆస్కారం ఏముంది? అందరికి అది గౌరవ భాజనమే అవుతుందనే గ్యారంటీ ఎందుకుండాలి? ఎవరి మానసిక సౌందర్యం వారిది!

'ఒరేయి రామయ్యా, ఆ గులాబీ ఒక్కటే అలాఉంటే తోటంతా వికారంగా లేదురా! ఫీకి అవతల పారెయ్యి, ఆ పాడు మొక్కను,' అంటుంటారు, ఆ తోట కొచ్చిన 'సౌందర్యోపాసకులు' కొందరు. అంటారంటే, వారి సౌందర్యోపాసన స్వరూపం అదీ మరి!

రామయ్యేమో ఆ తోటకు మాలి.

'అయ్యో, గులాబీని పీకేస్తే యింకేమన్నా ఉందా, అమ్మగారి మనసు భగ్నమందూ?' అంటాడు, రామయ్య. అనాగరిక మానవుడు కదా, అతను—అందుకని!

'మీ అమ్మగారిది చల్లటి మనసు కదరా! ఇంత మాత్రానికే భగ్న మంటుందా ?' ఎగతాళిగా మాట్లాడుతారు, నాగరిక జీవులు.

'ఎదిగిన మొక్కను యిరిచెయ్యటానికి చల్లటి మనసు ఒప్పుకుంటుందేంటి ?' అంటాడు, మాలి—లోకం తెలియని అమాయకత్వంలో. 'ఆయమ్మ నిజంగా చల్లటి తల్లే'—అని తనకు తాను హామీ కూడ యిచ్చుకుంటాడు, మరోసారి — లోకపు నీతులకు అతీతంగా.

*　　　*　　　*

సుమిత్రాదేవి చల్లటి తల్లి — అనే అంటారు ఆవిడ 'దగ్గర' పనిచేసే కూలీలు, తోటేలు, నౌకర్లు. అనాగరిక జీవులు !

'ఆ...మబ్బు విడిచిన ఎండ, మొగుణ్ణి విడిచి వచ్చిన మన సుమిత్రమ్మ చల్లగానే ఉంటారు మరి' అంటూ వ్యంగ్యాలు, విసుర్లుపోతారు, ఆ కాలేజీలో ఆమె 'కింద' పనిచేసే లెక్చెరర్లు, మేష్టర్లు. సంస్కార జీవులు వీరు !

సుమిత్రాదేవి ఆ కాలేజీ ప్రిన్సిపాలు.

వారు చల్లటి తల్లని దీవించినా, వీరు మరేదో అని వెక్కిరించినా, వారికి వీరికి కూడ అసలామెను గురించి తెలిసిందే చాల తక్కువ. ఆమెను గురించి అసలు ఎవరికైనా తెలిసిందే చాల కొద్ది. నాలుగేళ్ళు ఆమెతో కాపురం చేసిన భర్తకే ఆమెను గురించి ఏమీ తెలియలేదు, మరి. ఆమె అసలు ఆయనకు అర్థమే కాలేదు. నాలుగేళ్ళు చక్కగా కాపురం చేసిన యిల్లాలు అకస్మాత్తుగా ఒక రోజున 'విడాకులు తీసుకుందామండీ' అన్నదంటే, ఆమె ఆ భర్తకు ఏం అర్థమైనట్లు చెప్పండి? పెళ్ళినాడు జరిగిన ఏదో పేచీని పురస్కరించుకొని...

*

సుమిత్ర పెళ్ళినాడు కట్నాల దగ్గర పేచీ వచ్చింది. పీటలమీదనుంచి లేచాడు, పెళ్ళికొడుకు. లేచినవాడు కళ్ళు ఆ నాసిక్ సరుకు మీదనే ఉంచుకొని లేచిపోయినా బాగుండేది. కాదని ఆ కళ్ళు దించి, పెళ్ళికూతురు వంక అదో నెత్తికెక్కిన చూపుతో చూచాడు—అప్పటికా పెళ్ళికూతురేదో భూమిలోకి దిగబడిపోయి ఉంటుందనే ధీమాతో. కాని కళ్ళెత్తి, ఎదిగిన వటు డిలా, ఆ పెళ్ళికూతురు తన వంక చూచిన చూపులకు కంగారెత్తిపోయి. కాళ్ళు లేళ్ళ కలుగులో చిక్కుకుపోయిన వాడల్లే కటకటలాడి పోయాడు—కోదండరామయ్య. ఆ పిల్ల కళ్ళలో కని పించిన భావం—దాన్ని ఏమని వర్ణించాలో ఎన్ని సంవత్సరాలకు తెలియలేదు, ఆయనకు. అది కోపమో, అసహ్యమో, ఆవేదనో, విచారమో, జాలో—ఏమిటో ఆయనకు తెలియలేదు, ఎంతకాలానికీ. కాకపోతే ఒక్క భయం మాత్రం ఆ పెళ్ళికొడుకును అనాడు కలి గింది—ఈ ఆడకూతురు తన బ్రతుకును జీవితకాల మంతా అసహ్యించుకోగలదని. తగాదాలు తీరి, పెళ్ళి పూర్తయిందన్న తర్వాత కూడ అతన్ని ఆ భయమే పట్టిపీకింది, చాలరోజులు. సుమిత్ర కాపురానికొచ్చి ఓ బిడ్డ తల్లయి కాస్త కాలం గడిచిపోయాక గాని, కోదండరామయ్య హృదయం కుదుటపడలేదు. మారు ఆకు వేసేంతర్వాతగాని ఈ మొక్క తనతోటలో నిలిచి పూలు పూస్తుందనే నమ్మకం కలుగలేదు, ఆయనకు.

కమల పుట్టేవరకు ఆయన బెంగకు తగ్గనేలేదు, అసలు.

అటువంటిది కమల పుట్టిన రెండేళ్ళకు ఒక రోజున పసిపిల్లను వొళ్ళో వేసుకు కూర్చొని, ఎటో ఏమిటోగా చూస్తూ, ఎదో కూనిరాగాలు తీస్తూ, కలగా మళ్ళీ 'మనం విడాకులు తీసుకుందామండీ, ఏమం టారు?' అన్న సుమిత్ర, అదే కన్నతో చూచిన కోదండరామయ్యకు ఆ పెళ్ళినాడు కళ్ళెత్తి తనను చూచి, లేళ్ళ కలుగులోకి నెట్టిన ఆమనే గుర్తు కొచ్చింది. ఆ సంఘటనను ఈ ఆడకూతురు మరచి పోలేదు. మరచిపోదు. అంతే తనను జీవిత కాల మంతా అసహ్యించుకుంటుంది. ఈ మొక్క ఈనేలలో ఎదగదు.

కంగారు పడిపోయాడు, కోదండరామయ్య.

'ఏమిటి సుమిత్రా, ఏమిటీ మాటలు? మన మిప్పుడు విడాకులు యివ్వటం ఏమిటి? ఏమిటీ ఆలోచన?'

'ఆలోచన కాదండీ. బాగా ఆలోచించి నేను తీసుకున్న నిర్ణయం?'

'నిర్ణయమా? ఆలోచించి మరీ తీసుకున్న నిర్ణయమా?'

'ఆలోచించకుండా నేనెప్పుడైనా నిర్ణయాలు తీసుకున్నానా?'

'ఆలోచించిన దానివే అయితే మరీ ఆడపిల్ల సంగతి ఏమని ఆలోచించావు? విడాకులిచ్చిన తల్లి కూతుర్ని, రేపా పిల్లను ఎవరైనా పెళ్ళాడుతాడా?'

'తల్లి గతంతో సంబంధం లేకుండా నా పిల్లను చేసుకునేవాడే దొరకడంటారా? ఈ కాలమెప్పుడూ యిలా కొంకిరిపూతే పూస్తూ ఉంటుందంటారా?'

కాలం పూసిన పూలు—యిదేం భాషో! అర్థం కాలేదు, కోదండరామయ్యకు.

'కాకపోయినా ఆలోచించు సుమిత్రా. యిలాంటి నిర్ణయాన్ని నువ్వెందుకు తీసుకున్నావు?' దీనుడై పోయాడు, కోదండరామయ్య.

'ఎందుకో మీకు తెలియదా?'

తెలుసుననే కోదండరామయ్య నమ్మకంకూడ.

'ఎప్పుడో పెండ్లినాడు జరిగిందాన్ని పురస్కరించుకొని ..'

'..............................'

'ఆనాడు నాన్న వాళ్లంటే ఉన్న భయంతో అలా చేశాననుకో. అది నచ్చని దానివి అసలిన్ని రోజులు నాతో కాపురం ఎలా చేశావు? ఇప్పుడేదో ఉద్యోగం దొరికిందనేగా, నువ్వింత నిర్భయంగా విడాకులిస్తానంటున్నావు? వెధవ మేష్టరీ ఉద్యోగంతో కోట్లు సంపాదించి, నీ కూతురి జీవితంలో పూలబాటలు వెయ్యగలనని అనుకోబోకు. దాని జీవితం పాడు చెయ్యకు. ప్లీజ్'—

ఆవేదనా, ఆక్రోశమూ, ఆశా, నిరాశలమధ్య ఊగులాడుతూ ఆయనచేసిన అభ్యర్థనను నిర్వికారంగా త్రోసి పుచ్చింది, సుమిత్ర—ఆనాడు.

* * *

త్రోసి పుచ్చక తప్పలేదు, సుమిత్ర కానాడు.

ఉద్యోగం దొరికిందనే ధీమాతోనే తానా నిర్ణయం తీసుకుందా? తన నిర్ణయాన్ని ప్రోత్సహించిన ఒక అంశం అది కావచ్చు. స్త్రీకూడ తన కాళ్ళమీద తాను నిలబడ గలిగిననాడు అభిమానమున్న అన్ని జీవులకు మల్లేనే ఆమెకూడ ఆత్మగౌరవ ప్రోదితమైన నిర్ణయాలు తీసుకోగలదు. ఒకరి కూతురిగా, మరొకరి భార్యగా, యింకొకరి తల్లిగా—ఇలా ఎవరో ఒకరి ఒద్దికలో బ్రతకవలసి వచ్చినంతవరకు ఆత్మగౌరవాన్ని గురించి ఆమె ఆలోచించలేక పోవచ్చు. ఏదో జీవిక లభించిన తర్వాత అనుబంధం, ఆప్యాయతాలేని బంధానికి, బానిసత్వానికి లోబడవలసిన అవసరం ఏముంటుంది? భర్తతోనే వ్యభిచరిస్తున్నానని బాధ పడ్తూ ఆ కాపురం చెయ్యవలసిన అవసరం ఏముంది?

* * *

'భర్త'తోనే తాను వ్యభిచరిస్తున్నట్లు అప్పటికి రెండేళ్లుగా బాధపడ్తూనే ఉంది, సుమిత్ర.

పెళ్లయిన రెండేళ్లకు ఆమెకు తెలిసింది—తాను వేరొకరి 'భర్త'ను పెండ్లాడానని. తనకు 'తాళి' గట్టినవాడు అంతకు మునుపే మాలతితో భర్తృత్వం నెరపాడని. కట్నం చాలదని పెండ్లి పీటలమీదనుంచి లేచిన పెండ్లికొడుకు, కట్నం మనలు ముట్టదని మాలతి హృదయంలోనుంచి మొరటుగా లేచివచ్చిన వాడని. పెండ్లి పీటలమీదనుంచి లేచిపోయిన వానిని తానుక్షమించలేక పోయానని కోదండరామయ్య అనుకోవచ్చు. లోకమూ భావించవచ్చు. కాని తనకో? మరొకరి హృదయ పీఠంమీద నుంచి లేచిపోయివచ్చిన మనిషితో కాపురం చెయ్యటమంటే ఎవరో డబ్బిచ్చి తెచ్చుకున్న డిగోలోతో సంసారం చెయ్యటమే కదా? రెండేళ్లు సుమిత్ర ఆ బాధను అనుభవించింది.

ఉద్యోగం దొరికేనాటికి రెండేళ్లనాడే తీసుకున్న నిర్ణయం సుమిత్రది. అసలు రెండేళ్లు వాయిదా పడిందంటే (స్త్రీగా సమాజంలో తనకున్న బలహీన స్థానం కారణం కావచ్చు). అంతేకాని నిర్ణయం అప్పటిది కాదే! మేష్టరుద్యోగంలో కోట్లు సంపాదించి కూతుర్ని పూలలో ముంచెత్తాలని తానూ పేరాశ పడలేదు. ఆత్మాభిమానంతో తాను బ్రతికి, ఆప్యాయతతో తన కూతుర్నిపెంచి, అనురాగమయ జీవితాన్ని ఆ చిన్నారికి యివ్వగలననేదే ఆమె ఆశ. అంతేకాని వినోద విలాసాలు యివ్వాలని కాదే. తల్లి గతంతో సంబంధం లేకుండా, కూతుర్ని చేపట్టే సంస్కార హృదయమే లభించదా, ఈ లోకంలో? అంత గొడ్డుపోయిందా, ఈ మానవలోకం!

ఎదగని మొక్కలున్న తోటలో ఏదో ఒక మొక్క ఏపుగా ఎదగకూడదా!

ఇంత ఆలోచించే కోదండరామయ్య అభ్యర్థనను త్రోసిపుచ్చింది, ఆ నాటి సుమిత్ర.

* * *

గొడ్డుపోలేదు, మానవలోకం......

అనురాగ హృదయులకి లోటు లేదు, ఈ లోకంలో. ఆత్మీయత నెరపేవారు లేకపోలేదు. కాని యీ కాలం? ఇది ఎదగని కాలమే! కట్టుబాట్లతో, సాన్‌ఫోర్టైజుడు చెయ్యని బట్టలకి మల్లే, కుదించుకుపోయిన సమాజమే! చైనీయులు తమ పిల్లల పాదాలకు చిక్కని బూట్లు తొడిగి అవి ఎదగకుండా చేస్తారుట. మన హృదయాలకి యిలాంటి ఏవో

పట్టీలు బిగించబడే ఉంటాయి. హృదయాలు ఎదగవు. సువాసనలు వెదజల్లలేవు. ఏపుగా ఎదిగిన మొక్కను వింతగానో, వెక్కిరింతగానో చూసే లోకమిది!

ఇట్టి లోకపు స్వరూపాన్ని అర్థం చేసుకోలేక పోయింది, సుమిత్ర. తాను చేసిన పనిని తన దృష్టి కోణంనుంచి మాత్రమే చూసిందామె. మరొక స్త్రీ 'భర్త'తో తాను కలిసి కాపురం చెయ్యలేననుకొన్నది. సాటి ఆడదాని జీవితంలో పువ్వులు పరవాలనుకుంది. తన జీవితం ముళ్ళ బాటైనా ఫరవాలేదనుకొంది. కోదండరామయ్య మళ్ళా పెళ్ళి చేసుకొని సుఖంగా ఉన్నాడని మొన్న నీ మధ్యనే విన్నది, సుమిత్రాదేవి. ఆ రోజున ఆమె హృదయం ఏదో తేలికగా ఊపిరి పీల్చుకున్నది కూడ. తన డబ్బుతో కట్నం సమస్యను తీర్చేసి, కట్నమివ్వలేని ఒక అభాగ్యురాలి జీవితం చక్కదిద్దానని ఆమె సంబరపడింది. ఎదగని ఈ లోకంలో కూడ తనలాగ ఎదిగిన హృదయా లున్నందుకు ఆమె గర్వపడింది. కంగ్రాట్యులేటు చేసుకొంది, తనను తాను.

* * *

అయితే ఎదగని ఈ లోకం తన ఎదుగుదలను అరికట్టలేకపోయినా, తన చిన్నారి జీవితాన్ని ఎదగనివ్వదేమోననే అనుమానం ఎన్నడూ కలుగలేదు, సుమిత్రాదేవికి. కాని, ఏమైందీ రోజున...? తన కమలే వచ్చి నిలదీస్తే ఏం చెప్పాలో తెలియలేదు, సుమిత్రమ్మకు.

'అమ్మా, నువ్వలా నాన్నగార్ని వదిలివేయకుండా ఉంటేనే బాగుండేది కదమ్మా !'—కాలేజీకి బయలుదేరి వెళ్తున్న తల్లిని కమల వేసిన ప్రశ్న యిది. సమాధానం తెలియలేదు, సుమిత్రమ్మకు. కొండ శిఖరం మీద నిలచి అలవోకగా ఈ లోకాన్ని చూస్తున్న తనను ఏ గాలిదెబ్బో క్రిందకు కొట్టివేసినట్లయింది.

* * *

మొన్న నీ మధ్యనే గదా, తన కట్నంతో తానో స్త్రీ జీవితాన్ని చక్కబరచానని తెలుసుకొని సంతృప్తి చెందింది! సరిగ్గా పది రోజులనాడే కాబోలు వచ్చింది, ఆ అమ్మాయి తన రూముకి. మాలతీ, కోదండ రామయ్యల కూతురట, ఆ అమ్మాయి. ఎంతటి బేలతనం ప్రదర్శించిందో!

'మేడం, మీరు నన్నిలా సస్పెండు చేసే నేనేదో ఘోరమైన తప్పు చేశానని లోకం ఎత్తిపొడుస్తుంది, మేడం. ఆడపిల్లను. క్షమించండి. ఏదో ఉద్రేకంలో యింగ్లీషు మేడం మాట కాదన్నాను. ఆడపిల్లనలా ఉద్రేకపడటం తప్పే. క్షమించండి'—అంటూ బెంబేలు పడిపోయింది.

ఆడపిల్ల! ఉద్రేక పడకూడదు! ఇంత చిన్న వయసులో ఎంతటి బానిస భావన! ఎందుకిలా రంగరించి పోస్తారో ఆడపిల్లలకి పిరికితనాన్ని! కాలేజీనుంచి నాలుగురోజులు సస్పెండైతే, తనకీ లోకంలోనే స్థానం లేకుండా పోతుందని భయపడే పిచ్చిపిల్ల! ఎవరి అమ్మాయో...?

'ఎవరమ్మాయి వమ్మా నువ్వు ?' అనడిగింది, ప్రిన్సిపాలు సుమిత్రాదేవి — డాక్టరు కోదండరామయ్య కూతుర్ని.

జవాబు విన్న సుమిత్రమ్మ హృదయం ఏదో రంగులరాట్నం ఎక్కినట్లు జివ్వుమంది. ఆ కోదండరామయ్య తన కోదండరామయ్యేనని, ఆయన పెళ్ళి చేసుకున్నది అప్పటి మాలతినేనని, ఆ దంపతు లిప్పుడు సుఖంగా ఉంటున్నారని. యిలా ఒక్కొక్క విషయమే ఆ పిల్లనుంచి తెలుసుకున్నప్పుడు సుమిత్రమ్మ హృదయం పొయ్యి మీద పెట్టిన చల్లటి నీళ్ళకుండలో కాస్త కాస్తగా వేడెక్కి ఏదో హాయితో నిండిపోయింది.

తాను చేసిన పనిని ఇకనీలోకం ఎలా వెక్కిరించినా ఫర్వాలేదు. మబ్బు విడిచిన ఎండ లోకానికి మేలునే చేస్తుంది. చీకటి కోణాలను వెలుగులతో నింపుతుంది. తానూ ఒక సాటిస్త్రీ జీవితాన్ని చక్కబరచింది...అలా హాయిని నింపుకుంది సుమిత్రమ్మ మనస్సు.

అయితే ఈ కోదండరామయ్యగారు తన పిల్లల హృదయాలను రోజుకోసారి ఫ్రిజిడైర్‌లో పెట్టి తీస్తున్నారన్నమాట!...సన్నగా నవ్వుకొంది, సుమిత్రమ్మ హృదయం.

తాను చేసిన పని చెయ్యకపోతే తన కమలకి కూడ ఈ అమ్మాయిలాగే 'ఆడపిల్లను మేడం' అంటూ...

నవ్వు వచ్చింది, సుమిత్రమ్మకు.

ఫార్చ్యునేట్లీ…తన కమల కిలాంటి పిరికితనం తెలియదు. లోకాన్నే ఎదిరించిన సుమిత్రమ్మ కూతురు కదా! ఏపుగా ఎదిగిన ఒక హృదయానికి మారు రెమ్మ కదా; కమల!

తన కమల యిలా బేలకాదు. ఓ...ప్రసాద్... ఎ వండర్‌ఫుల్ యంగ్‌ఛాప్! కమలకు ఆప్యాయత నందివ్వగల అనురాగ హృదయుడు! లోకం గొడ్డు పోలేదని తానొకనాడు అన్నమాటను రుజువుచేసిన ప్లెజంట్ యంగ్ మాన్!

తానెన్నిసారో పరీక్షించింది, ప్రసాద్‌ను.

'చూడుబాబూ, నువ్వు కమల స్నేహంగా ఉండటాన్ని నేనేదో అడ్డగిస్తున్నాననుకోకు. కమలతో స్నేహం చేసేవాడు ఆ పిల్లతల్లి గతాన్ని పట్టించుకోని వాడుగా ఉండాలి బాబూ!' ఇలా సూటిగానే అడిగేసింది.

'ష్యూర్' మేడం. నేనూ అదే చెప్తుంటాను, కమలతో. కాకపోయినా కమల తల్లికేం మేడం. ఆమె ఆదర్శమూర్తి. ఈలోకం అతిసహజంగా చూసి సహించే ఒక మహాపరాధాన్ని క్షమించలేని ధర్మ మూర్తి.'

'అయితే ప్రసాద్...'

'నాకంతా తెల్సు మేడం. కట్నం చాలలేదని పెళ్లిమాటలమీద నుంచి లేచే మగవాడ్ని క్షమించలేక పోవటంలోనే ఎంతో ఔన్నత్యాన్ని భావన చేస్తాను, నేను.'

కోదండరామయ్యగారి కూతురి కేసును డిస్పోజ్‌చేస్తూనే యిన్ని దృశ్యాలను తప్పుకొంది, సుమిత్రమ్మ మనస్సు.

*  *  *

ఇదంతా జరిగి ఎన్నోరోజులు కాలేదు. తన మనసును ఉయ్యాల లెక్కించి ఊగిసలాడించిన తృప్తి యింకా పచ్చిగానే ఉంది.

ఇంతలోనే కమల అన్నమాటలతో తానెక్కిన ఉయ్యాల అంతుతెలియని అగాంథంలోకి పడిపో తున్నట్లు కెవ్వుమంది, సుమిత్రమ్మ హృదయం.

ఆనాడలా నాన్నగార్ని వదిలిరాకుండా ఉంటేనే బాగుండేదా?? ఏమిటంటున్నది, తనకూతురు? ఎందు కంటున్నదీ భయంకరమైన మాటల్ని? 'ఏమమ్మా, ఏమైందీ, యిప్పుడు నాన్నగారి ప్రసక్తి ఎందు కొచ్చిందమ్మా?' అనడిగింది, సుమిత్రమ్మ ఆదుర్దాగా కాలేజీకి బయలుదేరినదల్లా గబుక్కున ఆగిపోయి.

'లోకం కదమ్మా, అది మనతోపాటు పరుగులు పెట్టుకుంటూ రాదుకదా? మనమే వెనకా ముందూ చూసుకుంటూ లోకంతోకలిసి అడుగులు వెయ్యటం మంచిదేమో?'

అబ్బ, ఎంతెంత పెద్ద మాట్లాడుతున్నదీ చిన్నారి కమల, లోకంతోకలిసి అడుగులు వెయ్యాలా? పరుగులు నేర్చినవారు, పరుగెత్తే శక్తిగలవారు. పరుగులు పెట్టుకుంటూపోతే తప్పా? వెనక్కు చూసుకుంటూ, ఆగుతూ, కూలబడుతూ, ఈ కుంటి లోకాన్ని వెంటపెటుకు పోవాలా?

'అయితే కమలా, ముందుకు నడవటం, కలిసి నడవలేని లోకాన్ని వెనకనేవదలి ముందుకుపోవటం— యిది తప్పంటావా? అలా ముందుకు నడిచినవారు లేకపోతే.. ఒక శంకరుడు, ఒక బుద్ధుడు, ఒక రామ కృష్ణుడు...వీరు పరుగులు పెట్టూ పోబట్టేగదా ఆయాసపడుతూ నన్నా. నురగలు కక్కుకుంటూ నన్నా, ఈలోకం కాస్త ముందుకు గెంతుతున్నది. కాకి గెంతులతోనన్నా?' ఎవ్వరితో ఎన్నడూ ఎట్టివాదనకు దిగని సుమిత్రమ్మ కూతురితోనే వాదం పెట్టుకోవాల్సి వచ్చింది.

'వారంతా సర్వసంగ పరిత్యాగు లమ్మా. వెనుకకు చూడకుండా ముందుకే పోయినా, వెనకనున్న ఏకూతుర్నో పట్టిపీడించే నెరవు ఈ లోకానికి లేదుకదా?'

కమల సమాధానం ఖంగున ఏదో సత్యాన్ని గంటకొటి వినిపించింది.

ఓహో...యిదా సంగతి? తనకేమీా చెయ్యలేని లోకం తనవార్నిపట్టి లాగుతున్నదన్నమాట. అన్న మీద కోపంతో అతని పుస్తకాలను చించివేసే తమ్ముడి తంతుగా ఉందన్నమాట, ఈ లోకపు తీరు. ఎదగని కాలంలో ఏపుగా హృదయాలను ఎదిగించు

కోవాలనుకునే వారు సర్వసంగ పరిత్యాగులై ఉండాలన్న మాట !

అయ్యో, ఎంతటి క్రూరంగా ఉన్నదీ లోకపు స్వరూపం;

ఈ లోకపు దుర్మార్గాన్ని తాను ధైర్యంగానే ఎదుర్కొని నిలబడింది. తననేమీ చెయ్యలేక పోయిందీ లోకం. తన కమల మళ్లీ యింత యుద్ధం చెయ్యాలా. ఈ ప్రపంచంతో. చేసి గెలిస్తే మాత్రం తర్వాత మళ్లీ కమల సంతానం : కాకపోయినా ప్రసాదే కాదన్న తన కమలను మరొకరు ముందుకువచ్చి చేపట్టారా, అసలు? ఎంతటి ఘోరమైన ఆరోపణ...లేచివచ్చిన దాని కూతురా, తన కమల? ఒక స్త్రీ హృదయం నుంచి లేచివచ్చిన జబ్బు మనిషిని, జబ్బు గుండె వాడిని క్షమించ లేక దూరంగా వచ్చినందుకు తనకీ మనుషులిచ్చే బిరుదు లేచివచ్చినదనా? ఆహా...ఎంత చక్కటి తీర్పు! అందరికోసం అందరి కలసి ఏర్పరచు కున్న సాంఘిక కట్టుబాట్లు పురుషులకు పూలమాలలై స్త్రీలకు గుదిబండలు అవుతున్నాయా? వివాహం వంటి పవిత్ర వ్యవస్థతో కూడ యిలాంటి దుస్థితిని సహించటమెట్లా!

తప్పదు. తనవారికోసం తలవంచక తప్పదు. లోకంతో కలిసి కుంటి అడుగులు వెయ్యక తప్పదు. ఏ కట్టుబాట్లను ఎలా కాదన్నా కుటుంబ క్షేమం కోసం సామాజిక కట్టుబాట్లకు బిగిపడక తప్పదు.

అయిందేదో అయిపోయింది. ఇప్పుడు తన కూతురి జీవితాన్ని చక్కదిద్దటమెట్లా, ఎలాగోలా ప్రసాద్ నే......

• • •

'చూడు బాబు, మీ తల్లి దండ్రులేదో...'

'అవును మేడం. వారన్నది మంచిదని అనను. మార్పు తప్పని నేను భావించను. అది తప్పనిదనే నేను అంగీకరిస్తాను. కాని సమాజపు కట్టుబాట్లకు సంబంధించినంతవరకు ఈ మార్పులు అతిసహజంగా కాలక్రమంలో వస్తేనే మంచిదేమో ననిపిస్తున్నది, మేడం—మా వాళ్ళ ధోరణి చూస్తుంటే.'

అలా ఎన్నడయ్యా వచ్చినవా, ఎందరో కొందరు బలికాకుండా! సుమిత్రమ్మ అనుభవం గిల్లి చెప్పింది. కాని...తన జీవితాన్ని బలిపెట్టుకునే హక్కు తనకున్న దేమో, కాని తన కూతురి జీవితన్ని బలిపెట్టే హక్కు తన కెక్కడిది ? తప్పదు. లొంగిపోక తప్పదు.

'అవునేమోలే బాబూ! నేను మార్పుయొక్క అవసరాన్ని గుర్తించానే తప్ప...సరేలే, ఆ గొడవంతా ఇప్పుడెందుకు ? మరిప్పుడు కమల నేం చేద్దా మంటావు ?'

'కమలను కాదని నేను జీవించగలనా, మేడం?'

'మరైతే...'

'మా వాళ్ళతో గట్టిగా పట్టుబట్టాను. వాళ్లా ఒక విధంగా అంగీకరించారు. కాని...'

'ఏమిటో చెప్పు బాబూ ?'

'ఎలా చెప్పాలో, ఏమని చెప్పాలో ?'

'ఫర్వాలేదు చెప్పు బాబూ. నా కమల కోసం నేను ఏదైనా సహిస్తాను.'

'ఆ పిల్ల తల్లి మనింటికి వస్తూ పోతూ ఉంటే బంధువుల్లో మనకేం మర్యాదగా ఉంటుందిరా, అన్నారండీ.'

'అంటే నేను కమలను వదిలి శాశ్వతంగా దూరంగా వెళ్తే...'

* * *

తప్పదు. తనకు తానీ శిక్ష అనుభవించక తప్పదు. ఒక తప్పును సరిదిద్దటానికి తాను చేసిన ప్రయత్నంలో ఈ లొంగుబాటు చూపించక తప్పదు. 'అలాగే కానీ బాబూ, ఆ పెళ్ళి కాస్తా అయిపోతే నేను దూరంగానే వెళ్ళిపోతాను. న్యాయం చెప్పిన న్యాయాధికారినే శిక్షిస్తున్న రోజులు కదా యివి ?'

'మీరలా అంటే నేను భరించలేను మేడం. ఎంతో సాహసం చెయ్యాలనిపిస్తోంది.'

'వద్దు బాబూ, వద్దు. నువ్విప్పుడిలా సాహసం చేస్తే రేపు నీ పిల్లల విషయంలో మళ్లీ మీ వారిలాంటి క్రైసిస్‌నే ఎదుర్కోవలసి రావచ్చు. ఈకథ యిక్కడితో ముగిసిపోనీ—బాబూ!'

*　　*　　*

ఎక్కడ ముగుస్తున్నదీ కథ!

*　　*　　*

''ఇదేమిట్రోయి రామయ్య, ఏమైందీ మీ మంచి గులాబీ'' పాశవికానందంతో పొంగిపోతూ ప్రశ్నించారు, సౌందర్యోపాసకులు తోటను చూడవచ్చిన సంస్కార హృదయులు!

'పాడు పశువులు! యిన్ని పాడుమొక్కల్ని వదిలేసి బంగారు గులాబీని పాడుచేసినై'—అమాయకంగా ఆక్రోశించాడు, రామయ్య.

రామయ్యేమో ఆతోటకు మాలి!

ఆ తోటంతా ఎదగనిమొక్కలు! పెరగనిపూలు!

ఆతోటకంతటికీ అదో వింతగా ఉంటుండేది, ఆ గులాబీ! ఎదగని తోటలో ఎదిగిన గులాబీ! పాడు పశువులు, పాడుచేసి పోయినై టు!

*　　*　　*

పోనీ యిక్కడ ముగియవచ్చా, ఈ కథ!

---



# పండితారాధ్య చరిత్ర: కొన్ని సంశయములు

## శ్రీ భాగవతుల లక్ష్మీనారాయణ

శ్రేష్ఠ శివకవుల వర్గమునకుచెంది, వేదవిద్యాపారంగతుడై, అష్టభాషా విశారదుడై, నిర్దుష్టమైన తొలి తెలుగు శతకనిర్మాతయై, జాను తెనుగు నుడికార ప్రయోగ ధురీణుడై, ఉదాహరణ వాఙ్మయ ప్రక్రియకు మార్గదర్శకుడై, ఐహికాముష్మిక ద్విపద హేతువైన ద్విపదరచనకాద్యుడై, 13—14 శతాబ్దముల సంధికాలమందు విలసిల్లిన పాల్కురికి సోమనాథకవి ప్రాతఃస్మరణీయుడు. ఈతని కృతులలో వీరశైవ మతోద్ధారకుడైన బండారు బసవేశ్వరుని జీవితచరిత్రయగు బసవ పురాణమును ఆరాధ్య మతోద్ధారకుడైన మల్లికార్జున పండితారాధ్యుని జీవితచరిత్రయును భాషావిదుల చేతనేగాక చారిత్రక పరిశోధకులచేగూడ అత్యంత మాన్యత గాంచినది బుధజన విదితమే. పండితారాధ్య చరిత్రము అణువునుండి మహత్తువరకుగల బహువిషయములను స్పృశించుచు ప్రథమ ఆంధ్ర కవితా విజ్ఞాన సర్వస్వమన నొప్పుచున్నది. ఇందలి చారిత్రక విషయములపై కలుగు మూడు సందేహములను స్థాలీపులాక న్యాయముగా చర్చించుటయే ప్రకృత వ్యాసోద్దేశ్యము. ఆ సంశయములు ఆరాధ్య వీరశైవమతముల ప్రాచీనతకును, చందవోలు, పానుగల్లు, కళ్యాణ కటకములయందు జరిగిన ఘట్టముల చారిత్రక పరిశీలనకును శైవమతానుయాయులు అన్యమతస్థుల నెరవులను విధ్వస్త మొనర్చిరను విషయాను శీలమునకును చెందినవి.

### 1. ఆరాధ్య వీరశైవ మతముల ప్రాచీనత :

ఆరాధ్య మతము అత్యంత ప్రాచీనకాలము నుండియు అనూచానముగా వచ్చుచున్న మతమేనని తదనుయాయుల విశ్వాసము. అటులనే శివ సృష్ట్యారంభమునందు వీరశైవులు ప్రమథగణములుగా నుద్భవించిరని వీరశైవుల విశ్వాసము. వీరశైవమత ప్రాదుర్భావము బండారు బసవేశ్వరుని కాలము నుండియే యని కొందరి మతము. వీరశైవము బసవేశ్వరాద్యుపజ్ఞయే'యని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారును అది బసవేశ్వరోపజ్ఞము కాదనియు అత్యంత ప్రాచీనమనియు అది క్షీణదశను ప్రాపింపగా బసవేశ్వరుడుద్ధరించి సంస్కరించెననియు శ్రీ బండారు తమ్మయ గారును అభిప్రాయపడినారు. చారిత్రకముగా ఆరాధ్య వీరశైవ మతముల నామములు అర్వాచీనములుగనే గన్పట్టుచున్నవి. అట్టితరి ఈ రెండు అభిప్రాయముల సమన్వయమున కేమైనా అవకాశముగలదా?

ఆరాధ్య వీరశైవ సంప్రదాయముల నామములు చారిత్రక దృష్టికి అందక పూర్వము తెలుగు దేశమునగె పాశుపత, కాపాలిక, కాలాముఖాది భేదములతో శైవము ప్రవర్తిల్లినది.

వామాః పాశుపతాశ్చైవ
కాలాముఖమహావ్రతాః
కాపాలా భైరవాశ్చాన్యే
స్వకా యోగధారకాః॥
శైవాబహువిధాశ్చైవ
వైష్ణవాః పాంచరాత్రికాః
వైఖానసాఃకులాః
కాలాన్తత్సం భేదాస్తథాఉమే॥
సాంఖ్యాశ్చ లాకులాశ్చైవ
తథాహంస పరాయణాః
ఏతే సమయిన స్సర్వే
అన్యోన్య కలహప్రియాః॥

అని వీరాగమము నుడువుచున్నది. ఇందుటం కింపబడిన పాశుపతము అత్యంత ప్రాచీనమైనది. 28వ శైవ యోగాచార్యుడైన లకులీశుడే పాశుపతమునకు మూల పురుషుడు. లాకుల సిద్ధాంతము వైశేషిక దర్శనమునకు చెందినదేగాక వైదికమునకు గూడా. మొదట లాకుల అనుయాయులు న్యాయదర్శనమును అనుసరించినను కాలాంతరమున వీరు న్యాయవైశేషికముల సమన్వయమును సాధించిరి. [4]నిజమునకు లకులీశుడు నూతనమతమును స్థాపింపలేదు. తన తదనంతరము ఎంతోకాలము తరువాత తనకుముందుగల శైవమును వీరశైవముగా బసవేశ్వరుడు పొంది పరచినటులే లకులీశుడును తన నాటికిగల శైవమును క్రమపద్ధతి నొనరించెను. [5]పాశుపతము లకులీశ, కాలాముఖ, యోగ, శైవ, నైయాయిక, మొదలగు వివిధ నామములతో పిలువబడినది. వీటి ఆచార వ్యవహారములు కాలాంతరమున భిన్నరూపములు దాల్చినవి. క్రీ. శ. 850 ప్రాంతమున వర్ధిల్లిన్న వాచస్పతి మిశ్రుని నాటికి పాశుపతము శైవ, పాశుపత, కాపాలిక, కారుణిక— సిద్ధాంతులనెడి నాల్గు విభాగము లైనట్లు ద్యోతకమగుచున్నది. యామునాచార్యుని ఆగమ ప్రమాణము నందును పాశుపతము నాల్గు విభాగములైనట్లు ద్యోతకమగుచున్నది. యామునాచార్యుని ఆగమ ప్రమాణము నందును పాశుపతము నాల్గు విభాగము శైవవియనియే చెప్పబడినను అందు కారుణిక—సిద్ధాంతులకు బదులుగా కాలాముఖులు పేర్కొనబడినారు. పాశుపతము అధర్వశిరోపనిషత్తునందు చెప్పబడినది. బ్రహ్మ, ప్రణవ, పంచాక్షరీ ప్రాసాదాది మంత్రములు, పశుపతి పాశాది వస్తు వ్యవహారము భస్మోద్ధూళన, త్రిపుండ్రధారణ, లింగార్చన, రుద్రాక్షధారణాది ధర్మములు పాశుపతులకు గలవని శ్రీకరభాష్యమున తెలిపియున్నది. పాశుపతులు అద్వైతమును మిక్కిలి గర్హించిరి. వారు జీవేశ్వరులకు భేదము జెప్పుదురు. పశువులగు జీవులు పతియగు రుద్రుని యనుగ్రహముచే పాశమయిన సంసారమునుండి విముక్తులై మోక్షము ననుభవింతురు. పాశుపతులు విశిష్టాద్వైత సిద్ధాంతమువారు. విశిష్టాద్వైతుల వలె వీరును శ్రౌత స్మార్త కర్మలతో సమానముగా శైవాగమోక్తములయిన కర్మలను గూడ నాచరింతురు. పరబ్రహ్మాత్మకమయిన శివలింగము ఆణవ, మాయా, కార్మికములను మలత్రయములందు ఇష్టలింగ, ప్రాణలింగ, భావలింగములను పరశివాత్మకములైన త్రిలింగములను సద్భక్తిచేత ఎవడు ధరించి ఈ భూమియందు చరించునో అతడే పాశుపతు డనబడును. లింగ మనగ శివుడు. అంగమనగ జీవుడు. ఈ రెంటి ఐక్యమే సంయోగము. ఇట్టి లింగధారణాదికములే పాశుపతదీక్ష లేక శివదీక్ష యనబడును. శివుడు శక్తి విశిష్టుడు కనుక శక్తి విశిష్టాద్వైతమే వీరి మతము. వీరు పరిణామ వాదమును, జగత్సత్య వాదమును విశ్వసింతురు. శక్తి విశిష్టాద్వైతమనగా శక్తి విశిష్ట జీవునకు శక్తి విశిష్ట శివునకు సామరస్యమనియే అర్థము. కించిద్ కర్తృత్వ కించిద్ జ్ఞాతృత్వములు జీవుని శక్తులు. సర్వజ్ఞత్వ సర్వ కర్తృత్వములు శివ శక్తులు. ఈ ఉభయ విధ శక్తులచే యుక్తులయిన జీవ, శివుల అద్వైతమే (సామరస్యమే) శక్తి విశిష్టాద్వైతము. సర్వప్రమాణసిద్ధమైన ఈ ప్రకృతి రూప ప్రపంచము శివుని పరిణామభూతమై యున్నందున శివస్వరూపమనియే నమ్ముదురు. వీరు మిథ్యావాదమును నిషేధింతురు. ఇట్టి శైవము మరల ఆచారభేదముచే నాలుగు విధములైనటుల నాయాభాగము పేర్కొను చున్నది. అవియే సామాన్య, మిశ్ర, శుద్ధ, వీర శైవములు. ఇందు శుద్ధ శైవ లక్షణము ఈ విధముగా నున్నది :

> శుద్ధత్వం శివముద్దిష్టం చ్ఛివ జాతాత్తు శైవకం ।
> శుద్ధ శైవ సమాయోగాచ్ఛుద్ధ శైవ మితీశ్వతం ॥
>
> శుద్ధ శైవాన్మహాసేన తస్మాజ్ఞాతః శివద్విజః.
> శివద్విజాస్తు విప్రేంద్రా ఆదిశైవాః ప్రకీర్తితాః ॥
>
> శివాచరణ దేవాంశ్చ సర్వాన్సంపూజ యేద్గృహే।
> పృథక్స్థానె న స్థితాన్సర్వాన్నార్చయే దన్య దేవతాః ॥ ఇత్యాది

అటులనే వీరశైవ వివరణ మిటుల గలదు:

> ఏక శివాయ మస్మిన్హి సర్వేస్మిన్ జగతీతలే।
> విశేష ఈతలే య స్మాద్వీ ర ఇత్యభి ధీయతే॥

శివేన సహ సంబంధం శైవమిత్యుదితం
బుధైః।
ఉభయో స్సంపుటీ భావాద్వీర శైవమితి
స్మృతమ్ ॥ ఇత్యాది.

ఇందలి శుద్ధ శైవమే ఆరాధ్య మతముగను, వీర శైవము తన్నామమునను పరిణతిగాంచి మల్లికార్జున పండితారాధ్యులచేతను బండారు బసవనచేతను ఆయా మతములు తెలుగుదేశమున కడుంగడు ప్రసిద్ధిని బడసెనని ఊహించుట కవకాశము గలదు.

కాకతి గణపతిదేవుని నాటికే రాజాస్థానము నందును ప్రజాబాహుళ్యమునందును పాశుపత శైవము జనప్రియము గాంచెను. [6]అంతకు పూర్వము కాలా ముఖులకుగల ప్రాముఖ్యము ఇందువలన కుంటువడినది. కాలాముఖ ఆచార్యులకువలెనే పాశుపతాచార్యుల శుభ నామములును శివ, శంభు, పండితాది అంత్యవర్ణ ముతో అంతమగును. రుద్రమదేవి కాలమున గుంటూరు మండలమునందలి మందడ గ్రామమున విశ్వేశ్వర శివా చార్యునిచే స్థాపింపబడిన గోళకినామక మఠము శుద్ధశైవశాఖకు చెందినదిగా అభివర్ణితమైనది.[7] ఈ శుద్ధశైవమే పాశుపతము. ఇదియే వైదికము, తాంత్రి కము అని రెండు విభాగములైనదని కారణాగమ సిద్ధాంతము. వైదిక శుద్ధ శైవము ద్విజులును, తాంత్రిక శుద్ధశైవము అన్యులును అనుసరించిరనియు ఈ ఆగమము నుడువుచున్నది.

రాయ్ బహదూర్ హీరాలాల్‌గారు గోళకి మఠమునుగూర్చి వ్రాసిన వ్యాసమున తెలుగుదేశమున స్థాపింపబడిన గోళకి మఠము శుద్ధ శైవమునకు చెందినదిగా గన్పట్టుచున్నదనియు అది తాంత్రికశాఖకు చెందినదిగాక వైదిక లేక శ్రౌతశైవమై యుండ వచ్చుననియు తెలిపినారు.[8] ఆరాధ్యమతమే వైదిక శ్రౌతశైవశాఖకు చెందిన శైవమనవచ్చును. వీరినే శుద్ధ శైవులనియు, లింగధారులనియుగూడనందురు. తాంత్రిక శుద్ధశైవము కొలది మార్పులతో వీరశైవ ముగా స్థిరపడినదనియు తలపవచ్చును. పాల్కురికి సోమనాథార్యుడును పండితారాధ్యచరిత్రమునందు పాశు పతమును శిరోధార్యముగా గ్రహించినాడు.

యతులితాఘోర పంచాక్షరీ పాశు
పతపురోగము శైవమత మంత్రవితతి
యా నీలకంఠ నామాక్షరాత్మకము గాదేని
యే మంత్రమున కగునీ మంత్ర శుద్ధి?
భా 1. పుట. 168.

బరమనైష్ఠికత శైవ పాశుపతాది
చిర తపోధన మహాపురుష రత్నముల
మాయావిముఖ వీరమాహేశ్వరాది
నాయ కౌఘానర్ఘ్య నాయకమణుల
భా. 2. పు. 229.

........................వెండియును
ననుపమ శైవనిష్ఠా నూననియతి
జనుగౌతమాదుల సజ్జలయందు
దనరంగ పాశుపత వ్రతోద్యుక్తి
జను నగస్త్యాదుల సజ్జలయందు
భా 2. పు. 263.

సామంబు దా వేద సామరస్య
సామాదులగు వవ సామాదులందు
సను నీశ్వర ప్రశంసా పర సూక్తు
లను షక్తి జదువుచు నగ్గించువారు
బ్రవిమలా థర్వ శిర శ్శిఖాదులను
దవిలి శ్రీ పాశుపత వ్రత వరదు
శ్రీ రుద్రమహియయు జెప్ప సూక్తములు
వారక చదువుచు వర్ణించువారు
భా. 2. పు. 431.

ఈ సందర్భమున ఆరాధ్యులును, వీరశైవులును తమ తమ మతములను పాశుపతమనియే నేటికిని వ్యవహరించుట గమనింపదగిన యంశము.

**2. చందవోలు, పానుగల్లు, కళ్యాణ కటకముల యందలి ఘట్టములు చారిత్రకములేనా?**

పండితారాధ్య చరిత్రమునందు చారిత్రక లక్షణ ములుగల సంఘటన లనేకము లుదితములైనవి. అందు వెలనాటి చోడరాజునకును, పానుగంటి ఉదయాసనీశ్వ నకును కాలచుర్య బిజ్జలునికిని సంబంధించిన ఘట్ట ములు ప్రస్తుత పరిశీలనకు గైకొనబడినవి. పండితుడు మత ప్రచారమునకు బోవుచు చందవోలునకు జేరెను. అప్పు డచట వెలనాటి చోళులు రాజ్యము చేయు చుండిరి. నాటి చందవోలు 'నరపతియగు వెలనాటి

చోడనికి గురుడగు బౌద్ధుంతు గుటిలుండు పాపకర్మి..'

ఆ రాజ సభయందు మతవాదము జరిగెను. వెలనాటి చోడరాజ గురువగు బౌద్ధుడు పండితుని తిరస్కరించెను. ఇది ఎన్నియో విపత్కర పరిణామములకు నాందియై తుదకు 'వెలనాటి చోడడనే పాపి, ధరణీతలేశ్వరాధమ పతంగంబు భస్మమయ్యెడును, తద్బంధులు, సుతులు విస్మయంబుగ నిపుడె భస్మమై పోదురని శపించి' వెడలెను. అంతట అచట మహోత్పాతములు పుట్టి 'సంతకు పురికరిగెచోడండు 'అతని సంతానమెల్ల నిస్సంతానమయ్యె. బాడయ్యె దద్భూమి ఖండితవిభుని యూడితశాప మహిష్కృత జేసి.'

అనంతరము పండితారాధ్యులు పానుగంటిని ప్రవేశించిరి. అప్పుడు అచట ఉదయావనీశుడనురాజు పరిపాలించుచుండెను. ఆ రాజు తన లెంకలలో శివభక్తుడైన ధవళేశునామయ్య యను నతనిని తోడి లెంకల కొండెములు విని అకృత్యముచేయ ఆజ్ఞాపింప నాతడు తనతలను తానే యుత్తరించుకొని కైలాసమున కేగెను. ఈ వృత్తాంతము నెరింగిన పండితారాధ్యుడు కోపోద్రిక్తుడై 'పుత్రమిత్ర కళత్ర బంధువులతో నిప్పుడె త్రుంగెడుగాక'యని ఉదయావనీశుని శపించెను.

అంతనతడు వనిపురము నందుండగా 'కల్యాణమున భక్తి గజిబిజిపుట్టి బల్లహుబిజ్జలు భంజించి రంత'యని తెలుసుకొనెను. తదుపరి బసవన దండనాయకుడు సంగమేశు గర్భంబు చొచ్చెననియు బిజ్జలుని సంతానమెల్ల నిస్సంతానమయ్యెననియు భ్రమసి యమాత్యాది భటవర్గమెల్ల దమలోన జచ్చిరి సమరంబుజేసి'రనియును వర్తమానమందెను. అటనుండి పండితుడు శ్రీశైలమునకు పోయెను.

పై ఘట్టములయందు వర్ణితులైన వెలనాటి చోడులు, పానుగంటి ఉదయావనీశుడు, కల్యాణ కటక బిజ్జలుడు సర్వాంగీకృతులైన చారిత్రక వ్యక్తులే. అయినను ఈ ఘట్టములు ఆయా ప్రదేశములలో జరుగలేదేమో అని తోపింపజేయు నిర్దుష్ట ఆధారములు లభించుచున్నవి. వెలనాటి చోడులు చాళుక్య—చోళ సామ్రాట్టుల మాండలిక సామంతులు. 'ఈ మాండలిక యుగంలో ఆంధ్రదేశములో ఎక్కువగా వ్యాపించిన మతం శైవము. కులోత్తుంగ చోడమహారాజు శైవుడు. అతని సంతతివారూ శైవులే'[9] ఈ వంశములోని వాడైన కులోత్తుంగ చోడగొంకరాజు మహాపురుషుడు. పిరమాహేశ్వరుడు. అతడనేక శివాలయములను ప్రతిష్ఠించెను. శివకేశవ దేవరగుళ్లకు సమముగా దేవభోగములకై దానధర్మములు ధారవోసెను. దక్షవాటి భీమేశ్వర మహాదేవుడు గొంకనృపతికి ఇష్టదైవము. ఆ భీమయదేవునికి అతడు సమర్పించిన ధర్మవృత్తులకు మేరలేదు. భీమనాథుని గుడికి అతడు గోపురముల నెత్తించి వాటి శిఖరములపై దివాకరబింబములను సయితము అపహసించు సువర్ణ కుంభ కలశముల నెత్తించెను.[10] అటులనే ఈ వంశములోని అన్యప్రభువులు మాత్రమేకాక వారి సామంతులు సహితము శైవమునే అనుష్ఠించి లెక్కకు మిక్కిలిగా శైవ దేవాయతనములకు దానముల నొనర్చిరి. ఈ రాజులలో ఏ ఒక్కరును బౌద్ధ ఆచార్యులను తమ గురువుగా స్వీకరించి నటుల చెప్పు నొక్క శాసన ఆధారము గూడ నేటికిని లభింపలేదు. అట్టి రాజుల యాస్థానమునకు పరమమహేశ్వరుడును శైవ ధర్మ ప్రచారాగ్రణియునగు మల్లికార్జున పండితారాధ్యులవారు వచ్చుతరి ఇట్టి వైపరీత్యములు జరుగుట కేమైనను ఆస్కారము కలదా యను ప్రశ్న యుత్పన్నము గాక తప్పదు.

అదే విధముగా పానుగంటి నాటిని పరిపాలించుచుండిన కందూరి చోడవంశపు రాజులును శైవులే. శ. సం. 1157 నాటి కందూరి భీమదేవచోడ మహారాజులవారి మల్లేపల్లిశాసనము, ఆ ప్రభువునకే చెందిన పడమటిపల్లి శిలాశాసనము, శ. సం. 1157 నాటి ఉదయాదిత్యచోడ మహారాజులవారి ఇదంపల్లి శిలాశాసనము[11] వారు శైవులని చెప్పకయే చెప్పుచున్నవి.

ఇక కాలచుర్య బిజ్జలుని విషయమునకు వచ్చిన బిజ్జలుడు జైనుడేయని జైన గ్రంథములును, శైవుడేయని శైవగ్రంథములును బేర్కొనుచున్నవి. కాలచుర్యుల కాలమున 'ఎన్నోమతములు పరస్పర సహనముతో వర్ధిల్లినవి. నాడు వైదిక ధర్మ విభాగములైన శైవవైష్ణవములు రెండునూ విలసిల్లినను మతానుయాయుల సంఖ్యనుబట్టి శైవులే అత్యంతాధికులు. శాక్తులు, కార్తికేయుని భక్తులు ఆ తదుపరి వత్తురు. మిగిలిన వారిలో బౌద్ధులకన్న జైనులే ఎక్కువ వ్యాప్తిగాంచిరి...... ప్రజాబాహుళ్యమునందే గాక రాజవంశమునందును శైవము ఆవాస మేర్పరుచు కొనినది...ముఖ్యముగా పాశుపతాగమమునకు

చెందిన బహువిరాగి సముదాయములు ప్రముఖ స్థానము నాక్రమించినవి...కాలచుర్యుల అసంఖ్యాక శాసనములలో అకులీశని ఆగమము ప్రస్తుతింపబడినది...'[12] ఇంతియే గాక బిజ్జలుడు అకస్మాత్తుగా హతుడైనట్లును గానరాదు. క్రీ. శ. 1168 నాటి యొకశాసనము నాధారపరచుకొని 'బిజ్జలుడు తనకుమారుడైన సోవి దేవుని కొరకు సింహాసన త్యాగము చేసెనని 'ఫ్లీట్ పండితుడు అభిప్రాయపడినాడు.[13] ఈ శాసనమునందు 'ఒకే ఒక రాజ ఛత్రపునీడను అకుంఠిత అధికారముతో సుఖముగా రాజ్య మొనరించు తరి బిజ్జలుడు రాజ్యభారమును తన అనుంగు పుత్రుడైన సోవిదేవునికి అర్పించె'నని స్పష్టముగా ఇందుల్లేఖింపబడినది. బిజ్జలుని అనంతరము అతని పుత్రులు సోవిదేవుడు 1177 వరకును, సంకముడు 1180 వరకును, ఆహవమల్లు, వీరనారాయణ బిరుదాంచితుడు 1183 వరకును సింహాసనమున కొలదికాలమును రాజ్య మొనరించిరి.[14] ఈ అంశములను పాల్కురికి సోమనాథుడు వర్ణించిన క్రమముతో బోల్చిన అందు సత్య మెంత కలదో తేట తెల్లము కాగలదు. ముంజేతి కంకణమున కద్దమేల !

### 3. అన్య మతముల నెరవుల విధ్వస్తము

త్రిలింగ దేశములో జైన వసదులును బౌద్ధ చైత్యారామాదులు పెక్కు ఉండెడివి. ఇందు పెక్కు నేడు శిథిలావస్థయందు నున్నవి. మరెన్నియో నామ రూపములు లేకుండ సమసిపోయినవి. ఇందు కొన్ని విధ్వంసమగుటకు కారణము శైవభక్తులే యని పాల్కురికి సోమనాథుడు పండితారాధ్యచరితమున ఘంటాపథముగ చాటినాడు. కాని ఇందు ఉటంకించబడిన శివభక్తులు వాలొనర్చినట్లు చెప్పబడిన విధ్వంస చర్యలు బసవనికి పూర్వము జరిగెనా, బసవని కాలమున జరిగెనా లేక తదనంతరమా యను విషయము నిశితపరిశీలనమువలననే తేలగలదు. ఇచ్చట మచ్చున కొక్క సంఘటన పేర్కొన బడుచున్నది. పండితారాధ్యచరిత్ర వాద ప్రకరణమునందలి జైన వాద నిరసన ఘట్టమునందు దేవర దాసయ్య 'బొట్ల కొర్వునను వసదు తేణ్ణాలును వచ్చి వైపించినట్లును', అబ్బలూరున యేకాంతరామయ్య జైనుల నుక్కడగించినట్లును చెప్పబడినది. ఈ సందర్భముననే బండారు బసవన్న ఆదిగాగల శైవభక్తు లొనరించి నట్టి కార్యము లెన్నియో ఇట పేర్కొనుట జరిగినది. సామాన్యముగ ఈ ఘట్టములన్నియును బసవని కాలము ననే జరిగియుండనోపుననుభావము ప్రథమ వీక్షణమున పాటమరింప గలదు. నిక్కమునకు ఏకాంతరామయ్య, బసవయ్యలు సమకాలీనులైనప్పటికిని దేవరదాసయ్య బండారు బసవయ్యకు మూడు నాలుగు తరములు వెనుకటివారు. ఈ ఏకాంత రామయ్య విషయమును గూర్చి బోధపరచు అబలూరు శాసన సముచ్చయము కూడా కొన్ని లోకాతీత సంఘటనలతో మేళవించి యుండుటచే అంత విశ్వసనీయము గాదనుచున్నారు. 1 వీరశైవ మతావిర్భావానంతరము కర్ణాటకదేశమున జైనమతమునకు ఇక్కట్టులు సంభవించిన వనుటలో ఎట్టి సందియమునకును తావు లేకున్నను ఈ విధ్వంసకారీ ఉద్యమము తెలుగుదేశమున కెంతవరకు ప్రాకినదను విషయము విచారణీయమ్మై యున్నది. ఇచ్చట డా. నేలటూరి వెంకటరమణయ్య—శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారలు చేసిన హెచ్చరిక పరిశీలింప తగియున్నది.

'కాకతీయ యుగమున జైనులు తీవ్రముగా పీడింపబడిరనియు వారి దేవహర్మ్యములు సంపూర్ణముగా నాశమొనరింపబడినవనియు సర్వ సామాన్యముగ జెప్పటు పరిపాటియైనది. బసవపురాణ, పండితారాధ్య చరిత్రలను ఇందుకు సాక్ష్యముగ స్వీకరించుట జరుగుచున్నది. అట్టి ఘాతుక కృత్యములు జరిగిన స్థలమును వాటి నొనరించిన శైవ భక్తుల పేరులు కొన్నింటిని ఈ గ్రంథములు పేర్కొనుచున్నవి. బసవని సంప్రదాయానుయాయులైన వీరశైవులు కర్ణాటకమునందలి జైనులను పీడించుటయు వారి దేవాలయములను విధ్వంసము గావించుటయు జరిగినది వాస్తవమే. అంతకు కొన్ని శతాబ్దముల క్రితమే తమిళదేశములోని జైనులు జ్ఞానసంబందదేశికర్ వంటి తమిళ శైవాచార్యులవలన మత దురభిమాన చర్యలయు క్రూర చర్యలయు వాతబడినారు ... తమిళదేశమున ఏడవశతాబ్దమునుండి పెంపొందసాగిన ఉత్కట భావప్రేరితమైన శైవము, పన్నెండవ శతాబ్దమున కర్ణాటకదేశమున బండారు బసవనచే ప్రచారముగాంచబడిన వీరశైవ సిద్ధాంతములవలనను జైనమతము కొంతవరకు క్షీణించినది ..అట్టి భయంకర చర్యలు సంభవించిన చాలా ప్రదేశములను తమిళదేశమునందు గాని, కర్ణా

టకమునందుగాని నిశ్చయముగా గుర్తింపనగును గాని ఆంధ్రదేశమున అట్టివి గానరావు. అయినను వీటి పరిణామములు కొన్ని ఆంధ్రదేశమునకు సంభవించినవి. కాని ఆంధ్రదేశమున కూడ అంత విధ్వంసము, హత్యాకాండ జరిగినదని చెప్పుటకు తగినంత యాధారము లేదు. ఈ మేరకు పరంపరాగతముగా వచ్చు కథా కథనములు ఉన్నప్పటికిని వాటిని ధృవపరచు శాసనములు గాని, మరి యే విశ్వసనీయ ఆధారములు గాని శూన్యము. పైగ రెండవ బేతరాజు కొమారుడు ఇమ్మడి ప్రోలభూపతి తన మంత్రి బేతన ప్రెగ్గడ భార్య మైలాంబ స్థాపించిన జైన వసదికి భూరి దాన మొసగినాడు ... పాశుపతశైవమున కావాసమైన ఓరుగల్లులోనే ప్రతాపరుద్రుని కాలమున ఓరుగల్లు వాసియైన అప్పయాచార్యుడను నొక జైనుడు ప్రతిష్ఠాసారమను జినేంద్ర కళ్యాణాభ్యుదయ గ్రంథమును రచియించెను...[16] ప్రతాపరుద్రుని కాలముననే విలసిల్లిన పాల్కురికి సోమనాథుడు[17] వీరశైవుడే యైనను ఇతడు సంపూర్ణముగా హింసామార్గమును ప్రోత్సహించలేదు.[18]

**ఉపసంహారము :**

పై నుదాహరించిన 2, 3 విషయములందు పాల్కురికి కథనము ఘనముగానో యత్కించిత్‌గానో ఎటుల సత్యదూరమైనదీ విశదీకరించు ప్రయత్నము జరిగినది. ఇట్టి వ్యత్యాసమునకు కారణమేమై యుండ నోపుననన :

పాల్కురికి సోమన కేవల కవిమాత్రుడేగాక స్వయముగా మత విస్తారకుడుగూడ. అతని రచనలను ముఖ్యముగా బసవపురాణ పండితారాధ్య చరిత్రములను ఆయా మతాచార్యులపై భక్తివలననేగాక ఆ మతముల విస్తార మొనర్చుటకైగూడ నిర్దేశించియే వ్రాసెను. ఈ ప్రయోజనము లెస్సగా సమకూరినదనుట నిక్కము. తన ముఖ్యధ్యేయము మత ప్రచారమైనందున ఇతడు చారిత్రకాంశములకు వలసిన ప్రాధాన్య మొసగలేదు. అదియునుగాక ఈతడు బసవపురాణ పండితారాధ్య చరిత్రలకు ఆధారభూతమైన సమాచారమును సేకరించిన విధముకూడ ఇట్టి వైవిధ్యమునకు తావొసగుచున్నది. శ్రీ పర్వతేంద్రంబునందు సకల భక్తానీకములకు దండప్రమాణంబు లాచరించి సోమనాథుడు గోష్ఠీ ప్రసంగ గతిని :

'ననదృశంబై యొప్పు బసవ పురాణ
మెసకంబుతో జెప్ప నిష్టమయ్యెడిని
వర కథా సూత్రంబు వెర వెఱిగించి
చరితార్థు జేయరే కరుణతో'

నని వేడుకొనగా వారు హర్షించి సముదిత ప్రీతితో

'బసవ పురాణంబు బసరించు శక్తి
నసలార నొసగితి యట్లు గావునను
రచియింపు బసవ పురాణంబు నీవు
నచలిత భక్తి హితార్థంబుగాగ.'

అదే విధముగా సోమనాథునకు శ్రీ మల్లికార్జున దేవు నురుమంటపస్థలి నందుండిన వీరమాహేశ్వరాచార వర్తకులు 'గురుపండితారాధ్య చరిత వర్ణింపు... అసమ వాక్పాటవశక్తి నసలార నొసగితి'మని ప్రార్థింప నతడందు కియ్యకొనెను. బసవన 1184 లోను మల్లికార్జున పండితులవారు 1185 లోను శివైక్యము చెందిరి. పాల్కురికి సోమన 1280—1340 ప్రాంతమున నుండినవాడు. కావున నతనికి బసవన పండితుల కాలమునాటి చారిత్రక ఘట్టముల స్వానుభవముండుట కల్ల. ఐనను ఇతడు తన కాలమునాడు గల ప్రముఖ శైవ భక్తులగు మల్లినాథుడు, దోచమాంబ, మున్నయ దేవయోగీశుడు, నారయాంకుడు, నీలకంఠాగజుడు, గోడగి త్రిపురారి ఆదిగాగల శైవభక్తులను ప్రార్థేయపడి వారు ఇచ్చిన సమాచారమును గొని తన గ్రంథములను రచియించెను. మరియును తన యీ రెండు గ్రంథములలోను 'నూతన పురాతన' భక్తి మహిమలను గూర్చి వ్రాయుచున్నానని అనేక పర్యాయములు నుడివినాడు. అందువలన ఈ గ్రంథములలో చెప్పబడిన భక్తులందరు బసవనికిగాని, పండితారాధ్యులకుగాని సమకాలీనులై యుండనవసరము లేకపోగా వారిలో కొందరు చారిత్రక పురుషులు గూడ అయియుండ నవసరము లేదు. తన కథ రక్తి కట్టుటకు ఏకాలమునాడో ఎచ్చటనో జరిగిన లేక అన్యదేశప్రజల వాడుకలోనున్న శివభక్త మహాత్మ్యములను, ఇతడు తన కథాకాలమున కనువగునటుల మలచి అమర్చినాడు.* ఈ ప్రక్రియలో అతడు

---

* ఈ విషయమును శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు నాకు తెలిపినారు. వారికి నేనెంతయు కృతజ్ఞుడను.

తత్తత్ గ్రంథ కథా వస్తువుల కాలముననున్న స్థూల చారిత్రక ఘట్టములను చాకచక్యముతో ఏర్చి కూర్చి పెనవేసి ఆ కథలు తెలుగుదేశమునకు చెందినవేమో అను భ్రమ కలుగునట్లు అద్వితీయ ప్రతిభతో సృష్టించినాడు. బండారు బసవనను, పండితారాధ్యుని గురించి విపుల పరిశోధనలు సల్పిన స్వర్గీయ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు గాని, స్వర్గీయ భావరాజు వెంకటకృష్ణరావుగారు గాని, శ్రీ నీలకంఠశాస్త్రిగారు గాని, డా. నేలటూరి వెంకటరమణయ్యగారు గాని వాటిని చారిత్రకాంశములుగా గుర్తింపకపోవుటకు అవి చారిత్రక మరుమరీచికలు అగుటయే ప్రధాన కారణమని తేట తెల్లమగుచున్నది. సోమనాథుడు వస్తుతః చారిత్రకుడు కాడు గనుక యీ లోపము అతని కెట్టి కళంకము ఆపాదించుటకును ఆస్కారము లేదు. కవిగా, మతాచార్యుడుగా సోమనాథుడు నిక్కముగా అపర సోమనాథుడే. (ఈ నా తొలి ప్రయత్నమును కీర్తిశేషులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పవిత్ర స్మృతికి సాంజలిబద్ధముగా అంకితము చేయుచున్నాను) ఈ వ్యాసమును వ్రాయుటలో నాకు సర్వ సహకారము నొనరించిన సర్వశ్రీ డా. నేలటూరి వెంకటరమణయ్య, డా. ఆర్. సుబ్రహ్మణ్యము, డా. ఆర్. నరసింహారావుగారలకు నా నామోవాకములు.

## ఆకరములు :


1. బసవ పురాణ పీఠిక – పుట 78–79. ఆంధ్రగ్రంథమాల.

2. బసవ పురాణ పీఠిక. పు. 139–146. వావిళ్ల ప్రచురణ.

3. A comprehensive History of India, P. 397.

4. శ్రీ వీరశైవ సిద్ధాంత శిరోమణి.

5. A comprehensive History of India, P. 398.

6. Religion in Andhra, Dr. B.S L. Hanumantha Rao, P. 275–6.

7. South Indian Inscriptions (SII) X, No. 395.

8. Early History of Deccan (EHD) P. 709 Note 2.

9. ఆంధ్రదేశ చరిత్ర — సంగ్రహము. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పు. 58.

10. శ్రీ భావరాజు వెంకటకృష్ణరావుగారు, భారతి, విజయ, చైత్రము. పు. 353–4.

11. శ్రీ బి. ఎన్. కె. శాస్త్రిగారు, భారతి, ఆగస్టు 1970.

12. EDH.. PP 437–8, and 441.

13. Ibid, P. 465.

14. Ibld PP, 461–2.

15. Ibid. P. 464.

16. Ibid P. 712

17. మెకంజీ కైఫీయతుల నాల్గవ సంపుటము, సంఖ్య 23 న గల ముక్కంటి కైఫీయతను నొక స్థానిక చరిత్రయందు కాకతి ప్రతాపరుద్రుడు పాల్కురికి సోమనారాధ్యునకు భూరిదానము చేసినటుల గలదు. ఇంతవరకు ప్రకటింపబడని యీ స్థానిక చరిత్రయందు ప్రతాపరుద్రుని తిరాంధ్ర సామ్రాజ్యమునందలి శీమలు, వాటి గ్రామముల తబిసీళ్లు, ఆ మహారాజు దేవ, గురు, బ్రహ్మ, సప్త రుషి స్థానముల క్రింద చేసిన దానములు మొదలగు అనేక ముఖ్య చారిత్ర కాంశములు గలవు.

18. ఓరుగల్లు స్వయంభూ మంటపమున సోమనాథుని గంథమును తస్కరించిన ధూర్తవిప్రుని శివభక్తులు చంపయత్నించి ఆ విషయమును పాల్కురికితో తమ గురువగు సోమనాథునికి దెలుపగా నాతడతనిని జంపిన ప్రయోజనము లేదని:

భవి గాని వాని తోడన్
వివాద మొనరింపఁ జూడ విధిలే దైనన్
శివభక్తి శక్తిఁ దృణమా
నవుచే గెలిపింతు దూషణ పరుంబాఉన్.

అని ప్రతిజ్ఞచేసి తన మహత్వముచే వారి మనములను చూరగొనెనని పిడుపర్తి సోమన పద్య బసవ పురాణ అవతారిక నుడువుచున్నది.


———

# తిరిగిపోయే పడవ

## శ్రీ వి. మోహన ప్రసాద్

క్రిన్నా
బందర్లో ఏమున్నయ్ నీకూ నాకూ ?

మున్నా
మనకున్నదల్లా
కాలి కింద బడి కిల కిలా నవ్వే స్ఫటికపు టిసుకా
అద్దం తప్పుకొనే జ్ఞాపకాల ఉత్తుంగ సముద్ర తరంగాలూ
బండి చక్రాల్లాటి రెండు బండరాళ్ళ ద్రవించి ఏడ్చే కళ్ళూ
నేల మీదబడి విరిగిన శూన్యాకాశపు పెళ్ళలా బందరు ప్వరలో
అప్పుడప్పుడూ కూసింతసేపు కూసే ఖాళీ రయిలూ
జర్దకపు గాలిలో రికామీగా తిరిగే మొగలి పూల వాసనా

మున్నా
మనకుందొక కనబడని స్మశానం
ఎల్లెండలా కపాలాలు చిట్లిపోతూ
టౌన్ హాలులో హిందూ కాలేజిలో
చీకటి సందులో సినేమా లాడే
గ్రీక్ మినర్వా టాకీసులో గుణ గుణ
గొణుగుతూ జారే టాకీ రీలులో
కట్టెలమ్మే చోటు తెలీదా మున్నా నీకు
గుర్తు లేదా ఓ పదిహేనేళ్ళ కిందట
పూల పల్లకీలో మనం ఓహోం ఓహోం అని
బోయీలమై మోసిన రెండు ఎండు పేళ్ళ
చితిలా మండిపోయిన చింత ?

పాలిపోయిన ఆకాశం
చందమామ చలి కొణుకుతూ
ఉందనే గాదా మనం సిగరెట్లు
నేర్చుకున్నాం ఈ ఊళ్లో
నిలూనా కాలిపోతూ ఊరంతా
తిరిగాం సైకిళ్ళపైన ముణగదీసుకు
పడుక్కున్న సముద్రాన్ని ఎన్ని కేకలేసి
గడియారాలు మోగించి నిద్ర లేపాం ?

ఆపై
దేశమంతా తిరిగి తిరిగి

కాశీ కావళ్లు మోసి
గంగా స్నానాలు చేసి
వీభూది పళ్లు పంచి

[1]నార్మన్ కామెరాన్‌తో స్నేహమయ్యాక
మెర్సీ నది అలల అద్దాల జ్ఞాపకాల
తుంపుల చందమామల్ని
జేబులో నింపుకొని ఒక్కొక్క
నీలి అద్దం ముక్కకీ ఒక్కొక్క
బీడీ కొనుక్కొని
తాగామా తూలామా
మరియు వానాలోకి
మానవ మానస సంచలనంలోకి
మసులీ పటాప్ం లోకి !

ఏమి మురళి అది ఏమి రవళి
మనల్ని తొందరపెట్టిన వేగిరపెట్టిన
జ్వరంలో వేగించిన కాల్చిన వేదన
మల్లీశ్వరి సినిమాలో మబ్బుల కదలిక శబ్దంలా
అద్దపు కిటికీపై వర్షించిన చిట్లిన చీలిన పెట్లిన
ఉరుముల మెరుపుల వెలుగుల పగులు జడివాన
నెవరూ మున్నా చూడరేం నిద్రలోంచి లేచి [illegible] ఊళ్లో ?

2. The eyes are not here
There are no eyes here
In this valley of dying stars
In this hollow valley.

మున్నా తలుపులు పగిలి
ఆలయ దీపం ఒణికి
కృష్ణుని రవ్వల మురళి మిణుకు మిణుకుమని
పింగాణీ కప్పు మీద జల తరంగంలా
మ్రోగుతోందిరా మున్నా మురళి
చిలకలపూడి మంగినపూడి
నిద్రలో విన్న శబ్దాలు
కార్తీక పూర్ణిమ సముద్ర స్నానాల
ఒంటికి అంటిన ఉప్పటి వెన్నెల
కెవ్వున పెనవేసుకొని
ఒడ్డున ఉంచిన తుండుగుడ్డ నెవరో నెత్తుకుపోయి
బయటికి రాలేక పాడుకుంటూ

[3]ఇంతే నటే సంద్రమెంతో యనుకొంటి
మనకు సూరీడుకూ మద్దెనుండే నా

6

చివరికి ఎవరో యిచ్చిన ఓణీ చుట్టుకొని
జ్వరాన పడి ఒళ్ళు కాలి బూడిద అయి
నక్షత్రాలలోకి రేగి
మున్నా పునరపి పునరపి.

4. Sightless unless
Ihe eyes reappear
As the perpetual star.
స్త్రీ పురుషుల పెదాల మధ్యన పల్చగా
బంగళాఖాతంలో వర్షంలా మాటలు
ద్వీపంలో దీపం నిలవదు
చంద్ర బింబం మునిగిపోతుంది
నావ ఒడిలోకి నీలి గగనం రాలిపోతుంది.

5. Between the idea
And the reality
Between the motion
And the Act
Falls the shadow.
పెదవుల మధ్య మాటల జల్లు తగ్గినాక
బందరు చందమామ
శవంలా తేల్తుంది పైకి.

మున్నా
నిజంగా మనమున్నామా మున్నెప్పుడయినా ?
6. Because I know that fime is always time
And place is always and only place
And what is actual is only actual only for one time
And only for one place...

సిటీ బస్సులు పడినయ్యో
పూర్వ మెపుడో మూసేసిన కాలేజి తెరిచారో
స్టేట్ బాంక్ ఆఫ్ ఇండియా ఎపుడొచ్చిందో
కొత్తగా ఎందరు రజస్వల లయ్యారో
ఎందరు దుఃఖ దీనతంత్రీ మూర్ఛనలే పొయ్యారో
మన కెందుకు మున్నా ?

కానీ
పూలూ పిట లూ
నవ్వితే బుగ్గలు చొట్టబడే మబ్బులూ
గాలంతా కమ్ముకొన్న యుడికులోన్ పరిమళం
మొగలి పూవుతో దాగిన మిన్నాగు పండిపోయిన నిట్టూర్పూ

మనకే కాదా తెలిసేది ?
కాని అంతా మామూలే మన బందరు [7]ద్యురాల్గ యేలో
సారసపరిల్లాలో మానస నగరంలో.

ఇక్కడా అక్కడా ఎక్కడా
ముఖాల్లేని కన్నీళ్లు
ఉంటే రెండంటే రెండు గ్లిజరిన్ చుక్కలు
కసిగా నవ్వుతూ విరుగుతూ చిట్లుతూ
నిప్పుల బుగ్గల మీద పెట్లుతూ
మున్నా
నువ్వు కూడా విసురు ఈ నవ్వుల కుంపటి.

అశ్రువులకన్నా మంచి
రక్షిత మంచినీటి సరఫరా ఏమన్నా ఉందామున్నా?
అక్కడా ఇక్కడా ఎక్కడా
ఒక్కటే కారుణ్యపు కాకి గోల
మృత్యు జోల బందరు లాలిపాట
ఏకాకిగా ఉన్న రాకాసి విశాల బాహువుల్లో
సందెడు ఆదేశం పిట్టలా ఒదిగి
మన చిరుగుల బనీను ఛాతీమీదకి
ఒరిగి చూస్తోంది మున్నా రాపోదాం మరి
ఈ ఆకాశంలోంచి
ఇంకో గగనాంతర్యానికి
చాకుపెట్టి కోసిన మరో
సముద్ర పర్యంకానికి
మరో ముక్కలయిన కాలానికి
అవధిలేని వ్యధార్త ఓంకారనాధ టాగోర్ గీతానికి
నామరహిత రూపానికి
రూపం ఆహుతయిన భావానికి.

---

1. అమెరికన్ కవి. మెర్సీనది—సౌండ్ ఆఫ్ మెర్సీ అనే కవితా గ్రంథం.
2. ఎలియట్ పద్యపాదాలు. 'ది హాలోమెన్' లోవి.
3. ఎంకి పాటలు.
4, 5.—రెండూ కూడ ఎలియట్ పంక్తులే. మళ్లీ 'ది హాలోమెన్'లోనివే.
6. ఎలియట్ రాసిన 'ది యాష్ వెన్స్‌డే'నుంచి అప్పు.
7. ప్యాట్రిక్‌వైట్ రాసిన 'ది ట్రీ ఆఫ్ మాన్' అన్న నవలలోని కాల్పనిక స్థలాలు. 'ట్రూ ప్లేసెస్ నెవర్ ఆర్' అన్లేదా మెల్విల్ 'మాబీ డిక్ నవలలో? కనుక బందరు ఒక ఊరుగాదు పేరుగాదు.

# మృదంగ తత్వము

శ్రీ సరస్వతి రామకృష్ణయ్య

ఈ గ్రంథము శ్రీ ధర్మాల రామమూర్తిగారిచే తెనుగున 1966 లో 'మృదంగ తత్వము' అను పేర రచింపబడినది. అదే గ్రంథము కొన్ని చేర్పులతో ఇప్పుడు ఇంగ్లీషులో వ్రాయబడినది. ఇంగ్లీషులో వ్రాయుటకు సహాయము చేసినవారు శ్రీ వారణాసి వీరభద్రం గారు, ఎమ్. ఎ. బి.యిడి. ఈ గ్రంథము ముఖ్యముగా ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు ఎజుకేషన్ డిపార్టుమెంటువారి ద్రవ్య సహాయమువల్ల ముద్రింప బడినది.

భరతనాట్య శాస్త్రము, సంగీత రత్నాకరము, స్వరమేళ కళానిధి, చతుర్దండి ప్రకాశిక, తాళదీపిక, తాళలక్షణ సంగ్రహము మున్నగు ప్రాచీన, మధ్య ఆధునిక సంగీత లక్షణ గ్రంథములు పెక్కులు గలవు. అయితే ఈ గ్రంథము లన్నిటిలోను తాళ విషయమై తాళ దశ ప్రాణములు మాత్రమే సవిస్తారముగా వివరింపబడిన ప్రకరణములు గలవు. ఏ ఒక్క గ్రంథము లోను తాళ వాద్యములను అభ్యసించుటకు లక్ష్య మార్గము సుంతైనను తెలుపబడలేదు. గురుముఖము గానే శిష్యుడు ఈ విద్యను నేర్చుట నేటివరకు గల సంప్రదాయము.

ఇప్పటి ఆధునిక కర్ణాటక సంగీతమునకు, గాయకునికి, తోడుగా వాడబడు తాళ వాద్యములలో మృదంగ వాద్యమే ముఖ్యమైనదియు, శ్రేష్ఠమైన దియు అని తెలిసినదే. ఆధునిక కర్ణాటక సంగీతము, ఆధునిక భరతనాట్యము ఈ రెంటివలెనే ఆధునిక మృదంగ వాద్య కళ కూడ దాదాపు 150 సంవత్సర ములనుండి, అనగా సంగీత ముమ్మూర్తుల వెనుకటి కాలమునుండి పెంచబడి ఈ నాటి పద్ధతిగా స్థిర పడినది.

ప్రసిద్ధ గాయకులు అనేకులున్నను మృదంగ కళలో విద్వాంసులు కొందరే గలరు. సమీపకాలమున మృదంగ విద్వాంసులు కొందరు మృదంగ వాద్యమును అభ్యసించు పద్ధతి, అనగా దాని లక్ష్యమార్గమును, వివరించు కొన్ని గ్రంథములను ప్రచురించియున్నారు. వాటిలో ముఖ్యముగా పేర్కొనవలసిన గ్రంథము 'మృదంగ పాడముఱై' తమిళములో 1946 లో అణ్ణామలై యూనివర్సిటీ ఇశై సీరీస్ Vol. XII మృదంగ లెక్చరరు శ్రీ మైలట్టూర్ వి. సామి అయ్యర్‌గారు రచించిన గ్రంథము. ఈ గ్రంథమున మృదంగ వాద్య కళాంశములను వివరముగా విద్యార్థి తెలిసికొనునట్లు అభ్యాసపు వరుసలు పెక్కులు మొదటి సారిగా ఇవ్వబడి యున్నవి.

ఈ 'మృదంగ పాడముఱై' కన్న ఇప్పుడు విమర్శింపబడు 'ఈ మృదంగ తత్వం' (ఇంగ్లీషులో) గ్రంథము చాల గొప్పదనియు, మేలిమియైనదనియు నిశ్చయముగా చెప్పవలెను. ఇంత వివరముగాను, ఎక్కువ సంఖ్యల మృదంగ కళాంశము లన్నిటికిని అవశ్యమైన అభ్యాసపు వరుసలు ఏ ఇతర గ్రంథము లోను ఇవ్వబడలేదు. ఈ గ్రంథమును పాల్‌ఘాట్ టి. ఎస్. మణి అయ్యర్, ఇప్పటి గొప్ప సీనియర్ మృదంగ విద్వాంసులు, చాల పొగడియున్నారు. మరియు కేంద్ర సంగీత నాటక అకాడమి వారు మనదేశములో గల మృదంగ శాస్త్ర గ్రంథము లన్నిటిలోను ఈ 'మృదంగ తత్వము' (తెనుగున) 'బెస్టు బుక్' అని తీర్మానించి దానికి అవార్డు ఇచ్చి యున్నారు.

ఈ గ్రంథములోని కొన్ని ముఖ్యాంశములు—

1. అనేక సంగీత లక్షణ గ్రంథములలో ఇవ్వ బడిన తాళ దశ ప్రాణ లక్షణ (Theory) వివర ములను ఎక్కువ విస్తారముగా ఇవ్వబడి యున్నవి.

2. మృదంగ వాద్యమును కావలసిన ఆధార శ్రుతికి తగినట్లు చేయు మార్గము (వాద్యమును రిపేరు చేయుటకును) వివరముగా తెలుపబడి యున్నది.

3. బాల పాఠకులకు ముఖ్యమైన అభ్యాసపు వరుసలు—అనగా పాల వరుసలు, జంట వరుసలు, దాటు వరుసలు, జాతులను వాటి గణిత ప్రస్తార మార్గములు మొదలైనవి విరివిగా ఇవ్వబడియున్నవి.

4. నేడు ముఖ్యముగా వాడబడు 35 సూళాది తాళముల వివరములు.

5. అభ్యాసపు వరుసలలో మోహరులను వాయించుటకు కావలసిన హెచ్చింపు (స్రోతోవహ), తగ్గింపు (గోపుచ్ఛ), సమ, ముగింపు మొదలగువాటికి అత్యావశ్యమై అభ్యసింపవలసిన పాట వరుసలు పెక్కులుగా కనబడుచున్నవి.

6. ముక్తాయి వరుసలు, అనగా 'తఫింగిణితోం' జాతి ప్రస్తార వరుసలు మిక్కిలి చమత్కారముగా కల్పనలుచేసి వాటిని ముమ్మారు వాయించి పల్లవి యొక్క సమ, అనాగత, అతీత గ్రహములకు సరిగా ముగించునట్లు, క్రమ వరుసలు అనేకములు 64 పఠక ములలో లెక్కచేసి వివరముగా ఇవ్వబడియున్నవి.

7. సంగీత కళలో 'పల్లవి' యొక్క అన్ని అంశములను, లక్షణములను చెప్పి వాటికి తోడుగా మృదంగ వాద్యము వాయించు విధానము, శబ్ద పల్లవి మొదలగువానికి పాఠములు ఇవ్వబడి యున్నవి.

ఈ గ్రంథములో గల అన్ని విధములైన అభ్యాసపు వరుసలను విద్యార్థి స్వయముగా శ్రద్ధగా శ్రమపడి సాధకము చేసిన నిశ్చయముగ అతను మృదంగ విద్వాంసుడుగా కాగలడు. కొందరికి ప్రారంభమున గురుముఖముగా తెలియవలసిన కొన్ని విషయము లుండవచ్చును.

శ్రీ ధర్మాల రామమూర్తిగారు ఒక ముఖ్యమైన విషయము తెలిపియున్నారు. మృదంగ విద్వాంసుడు తాను కూడ సంగీతము నేర్చియుండియు, గాయకునికి తోడుగా వాయించునప్పుడు గాయకుడు పాడుచున్న కృతిని గాని యితర ప్రబంధమును గాని తాను కూడ వాటి ధాతు మాతు రెండింటిని చక్కగా నేర్చియుండి వాటిలోని స్వర సాహిత్యాక్షరములను చక్కగా గమనించి కఠినమైన మోహరాలను, ముక్తాయి వరుసలను వాయించక గాయకుని పాట ఎక్కువ ఇంపుగా ప్రకాశించునట్లుగా వాయించవలెను. మృదంగ విద్వాంసుడు తన సామర్థ్యమును, నేర్పును, ధర్మమును తాను 'సోలో' వాయించునప్పుడును, కఠినమైన పల్లవికి వాయించునప్పుడును కఠిన ముక్తాయి వరుసలను వాయించి చూపించవలెనను తెలిపియున్నారు.

ఈ గ్రంథమున గల మరొక అతి ముఖ్యమైన అంశము—మృదంగ వాద్యమున ధ్వనించు ద్వాదశవాక్కులు (The Alphabets of the language of Mridanga Play), అనగా అక్షరములు—అవి వరుసగా—త, థ, న, ఝం, కి, ట, రి, హ, మ, ణ, ళ గు. ఈ 12 వాక్కులను (Syllables) వాటిని అకార, ఇకార, ఒకారాంతములుగా మృదంగ వాద్యములో ధ్వనించు విధములు పోటోల మూలముగా తెలుపబడినవి. మరియు ఈ వాక్కులు మన చెవిలో ధ్వనించు విధములు వివరముగా వర్ణించబడి యున్నవి.

శ్రీ ధర్మాల రామమూర్తిగారు ఈ 12 వాక్కులను వాటి అకార, ఇకార, ఒకారాంతములు: హ్రస్వ (లఘు), దీర్ఘ (గురు), ప్లుత కాల ప్రమాణములను తేటగా సులభముగా తెలియునట్లుగా వరుసలను వ్రాయుటకును, అట్లు వ్రాయబడినవాటిని చదివి అభ్యసించుటకు వీలుగాను సులభమైన నొటేషన్ (సంగీతమునకు గల స-రి-గ-మ-నొటేషను వలె) కల్పించి తన ఈ గ్రంథమున ఇవ్వబడిన అన్ని అభ్యాసపు వరుసలను తేటగా, సులభముగా తెలియునట్లు, చాల శ్రమపడి వ్రాసియున్నారు. మొదటి 'త' అను వాక్కును నొటేషనులో గ్రీక్కు భాషలోని '(θ)' ('='తీటా) అను వర్ణరూపముగా వ్రాసియుండుట ముఖ్యముగా గమనించవలెను. ఈ నొటేషను తెలిసికొనిన విద్యార్థి సులభముగా ఎంత కఠినమైన వరుసలను కూడ పాఠము చేయగలడనుట నిశ్చయము.

ప్రాచీన సంప్రదాయమున కనబడు 5 మార్గ తాళములు మొదలుగానుండు 108 ప్రసిద్ధ తాళములకును వెనుక (ఈ తాళములు ఈనాటిలో వాడుకలో లేవు. ప్రసిద్ధ వాగ్గేయకారులైన రామస్వామి దీక్షితులు మాత్రము తన రాగ తాళ మాలికలో ఈ 108 తాళములలో అనేక తాళములను జేర్చియున్నారు). పురందరదాసుల కాలమునుండియు ప్రసిద్ధముగా వాడుకలో నుండునవి సూళాది సప్త తాళములు. పురందరదాసులు ఈ సప్త తాళములకును మన

మిప్పుడు వాడుచున్న స్వరాలంకారములను కల్పించి రనుట తెలిసినదే.

ఈ సప్త తాళములలో త్రిపుట తాళములోని లఘు త్రిశ్రజాతిగాను, ఝంప తాళములోని లఘు మిశ్ర జాతిగాను, అట తాళములోని లఘు ఖండ జాతిగాను, మిగిలిన నాలుగు తాళములలో గల లఘువులు మాత్రము చతురశ్ర జాతిగను వాడుటయే సంప్రదాయముగా నుండుట మంచిది, మరియు ఝంప తాళ స్వరాలంకార ములో చివరి స్వరము దీర్ఘముగాను, అట తాళ స్వరా లంకారములో గల 6 స్వరములు దీర్ఘముగాను ఉండుట గమనించవలెను. ఇంకను ఝంపతాళ స్వరా లంకారము=రెండు ఖండ చాపులుగాను (స రి గ స రి । స రి గ మా॥); అటతాళ స్వరాలంకారము = రెండు మిశ్ర చాపులుగాను (స రీ గా సా । రి గా మా మా॥) అని యుండుట తేటబడును. మరియు ధ్రువ తాళ మున గల మొదటి లఘు—ద్రుత అంగములను జేర్చి లఘుశేఖరముగా వాడబడినట్లు పూర్వపు గీత ప్రబంధ ములను గమనించిన తేటబడును. మఠ్య తాళము 'రగణ'ముగానే వాటిలో వాడబడెను. ఏకతాళము వృద్ధి రూపముగా దానికి సమానముగా ఆది తాళము గానే చాల ప్రసిద్ధముగా వాడబడుట తెలిసినదే.

పై వివరింపబడిన కారణములచే పురందర దాసులు మొదలుగా వాగ్గేయకారలందరును తమ ప్రబంధ రచనలలో ఆదితాళము, రూపకతాళము, త్రిపుట తాళము (త్రిశ్రజాతి), ఝంపతాళము (రెండు ఖండచాపులు గలదిగా), అటతాళము (రెండు మిశ్రచాపులు గలదిగా) ఈ తాళములు మాత్రమే వాడిరని తెలియుచున్నది.

సంగీత ముమ్మూర్తుల కాలమునకు మునుపు ప్రతాపసింహరాజు కాలములోనే మార్గదర్శి వీరభద్రయ్య, ఆదిప్పయ్య, పల్లవి గోపాలయ్య, రామస్వామి దీక్షితులు మొదలగు వాగ్గేయకారులు ప్రథమంగా తాన వర్ణములు కొన్నింటిని అట తాళమున (ఖండజాతి) ఇప్పుడు వాడబడు రూపమున రచించిరి. మరియు వీరే పల్లవి పాడు పద్ధతిని ప్రారంభించిరి. సుమారు 150 ఏండ్లుగా వాలాజాపేట వేంకటరమణ భాగ వతులు 35 సూళాది (ఇతర) తాళములలో తానవర్ణ ములు కొన్నింటిని, అటు వెనుక మైసూరు సదాశివ రావు అటువంటి తాళములలో కొన్ని కృతులను మొదటివిగా రచించిరి. ఈ ఆధునిక తాళ పద్ధతిలో ఎంత ఇంపు ఉన్నదో గాని, భ్రమ మట్టుకు మిక్కు టముగా గలదు. ఉత్త గణిత ప్రస్తార అస్థి భారము గల ఈ పద్ధతిని ఆధునిక సంగీతజ్ఞులు, గాయకులు, మృదంగ విద్వాంసులు కఠిన పల్లవులు (కృతులుగాక యుండినను) పాడునప్పుడు ఎక్కువ ఉత్సాహముతో సభ్యులను భ్రమింపజేయుచు వాడుచున్నారు.

శ్రీ ధర్మాల రామమూర్తిగారిచే ఈ గ్రంథ మున ఇవ్వబడిన కఠినమైన ముక్తాయి వరుసలు ఈ పల్లవులకు పక్క వాదనలకు చాల ఉపయోగపడుట నిశ్చయము.

ఈ గ్రంథమును చక్కగా చదివి ఇవ్వబడిన వరుసలను క్రమముగా అభ్యాసముచేసి సాధించిన విద్యార్థి నిశ్చయముగా త్యాగయ్యగారు తెలిపినట్లు 'సొగసుగా మృదంగ తాళము జత గూర్చి (మృదంగ) నిజవాక్కులతో స్వర (శ్రతి) శుద్ధముతో (సభ్యులను) సొక్కజేయు (భ్రమించు) ధీరుడౌ (విద్వాంసుడే)' ననుటకు సందేహమే లేదు. సంగీతకళకు శ్రతి తల్లి వంటిది, లయ తండ్రి వంటివాడని పెద్దల వాక్కు.

ఈ గ్రంథమున అచ్చటచ్చట కొన్ని స్పెలింగు, ఇతర అచ్చు తప్పులు కనబడుచున్నవి. తప్పొప్పుల పట్టిక ఇచ్చియుండిన బాగుండును.

ఈ గ్రంథములో ముద్రణము, దానియొక్క గెటప్ చాల ఆకర్షణీయముగా నున్నది. మృదంగ వాద్య పాఠకులకు (స్వయముగా కూడ నేర్చుటకు) అత్యంత ఉపయోగమైన గ్రంథమనుటకు సందేహము లేదు.

---

## "ది థియరీ అండ్ ప్రాక్టీస్ ఆఫ్ మృదంగ"

("మృదంగ తత్వం)", ఇంగ్లీషు, 1973— గ్రంథకర్త : మృదంగ విద్వాన్ శ్రీ ధర్మాల రామ మూర్తి, రాజమండ్రి, ధర : రు. 50=00.)

# కలగూరగంప

## అనేకార్థద్యోతకం—మాట

గిడుగు సీతాపతిగారు, 'మాట' అనే పదానికి పదకొండు అర్థాలున్నాయన్నారనీ, వాటిని డాక్టర్ జి. ఎన్. రెడ్డిగారు తన సిద్ధాంత గ్రంథం 'A Study of Telugu Semantics' లో ఉటంకించారనీ ద్వా. నా. శాస్త్రిగారి 1973 నవంబరు 'భారతి'లో కొంత చర్చ చేశారు. 'మాట' అనే పదం తాలూకు అనేకార్థతను గురించి వ్రాస్తూ గిడుగువారిచ్చిన 11 అర్థాలుగాక ద్వా. నా. శాస్త్రి గారు అదనంగా మరికొన్ని అర్థాలిచ్చారు.

ఆ మీదట 1974 ఫిబ్రవరి, మార్చి 'భారతి' సంచికల్లో శ్రీ మామిడన్న సత్యనారాయణ మూర్తి, శ్రీ విశపు సుబ్రహ్మణ్యం చెరి అరడజను పైచిలుకు అర్థాలు చెప్పిన సరఫరా చేశారు. ఈ పరిశీలన ఇట్లా కొంత పాకానపడ్డది. అంతవరకు వ్యవహారం బాగానే ఉంది.

అయితే చారిత్రకంగా చూస్తే, తెలుగులో ఇటువంటి పరిశీలన చేసిన దాదాపు మొదటి వ్యక్తి స్వర్గీయ సి. పి. బ్రౌన్ అనవలసి ఉంటుంది. ఒక పదానికి ఉండే ఇటువంటి మారు అర్థాలను ఆయన తన నిఘంటువు బ్రౌణ్యం (1852) లో గ్రంథస్థం చేశాడు.

'మాట' అనే మాటకు సి. పి. బ్రౌన్ తన నిఘంటువులో ఇచ్చిన అర్థాలను ఇక్కడ పరిశీలించడం ఉచితంగా ఉండగలదు. బ్రౌన్ తన నిఘంటువులో వీలున్న చోటల్లా తెలుగు పదాల తాలూకు అనేకార్థ ఛాయలకు ఎన్నో ఉదాహరణ లిచ్చుకొంటూ పోయాడు. 'మాట' అనే మాటకు బ్రౌన్ ఇచ్చిన అర్థాలు, ప్రయోగాలు మచ్చుకుకొన్ని :

---

వాని మాట కాదు : This is not about him.
I am not talking about him : not him.

గడియకు వొకమాట చెప్పినాడు : He changed his mind every hour.

మంచి మాట : Very well.

యెంత మాట : What nonsence

వెయ్యి మాటలేల ? : In a word.

మాట తీయుట : To fish out secrets.

యింకా మాట : A child that cannot yet speak.

దాన్ని గురించి రెండో మాట లేదు : There is no alternative.

వారి వద్ద మాటలు పడ్డాడు : He was reprimanded by them.

ఆమె తిరుగా వస్తున్నదనే మాట తెలిసి : Knowing that she would return.

ఆ మాటే యెరుగను : I know nothing of that.

యిందుచేత మాట వచ్చును : By this you will get into disgrace

అతను మాట తప్పలేదు : He has not failed of his promise.

పొయ్యే మాటా వుండే మాటా : Does he propose to go or stay?

మాటకు మాటకు : Word for word.

తనమీద మాటరాకుండా యిట్లా చేసెను : He did this to avoid blame.

వాని మాట వాని వొళ్లో వేసినాను : I acted as he desired.

నీకు మాట, నాకు మూట : A command is easy to give but hard to perform.

అ పెండ్లి మాట ఈ గ్రంథములో లేదు : There is no mention of the marriage in this Book.
వాడికీ నాకూ మాటలు లేవు : He and I do not speak.
వాడితో నీకేమి మాటలు : Why do you speak with him?
కడకు వాని మాటే ముందరికి వచ్చింది : At last his words proved true.
మాటలుగా వ్రాసివుండే గ్రంథము : A book written in prose.
యింకా యే మాట తెలియలేదు : I do not know the result.
మాటలు మంచివేకాని మనసు మంచిది కాదు : He talks well but bas a bad heart.
ఆయన మాటకు యెదురు లేదు : His word is law.
మాటవాసి : Influence.
నా నోటి మాటపీకి నా కడుపుమంట పోసికొన్నాడు: He tormented me with harassing questions.

---

—ఇట్లా ఇంకా ఎన్నో ఉదాహరణ లిచ్చాడు.

అంతే కాదు. మిగతా ఎన్నో పదాల అనేకార్థ తను గురించి కూడా ఇట్లాగే బ్రౌన్ తన నిఘంటువులో చర్చించాడు. ఉదాహరణ లిచ్చాడు. ఉదాహరణకు, 'కట్టు' అనే పదానికి బ్రౌన్ ఇచ్చిన అనేకార్థ ద్యోతక ప్రయోగాలు మచ్చుకు కొన్ని :

కట్టు : వాకట్టు, కట్టుగా మాట్లాడుట, మీసకట్టు, యిసుక కట్టు, ఉలవకట్టు, సీతకట్టు, సీసకట్టు, జాతికట్టు, మంత్రకట్టు, నీరుకట్టు, యింటిలో ముందరికట్టు, కట్టుకొంగు, కట్టుకోక, కట్టుకథ, వాయసము కట్టినది. రంకు కట్టిరి, నడుము కట్టుట, పాపము కట్టుకొనుట, దాన్ని కట్టుకొన్నాడు. కనుకట్టు, తోటకు నీళ్ల కట్టుట, బండి కట్టుట, గాయముకట్టుట, కత్తికట్టుట, పన్ను కట్టు, ధరకట్టు, పద్యముకట్టు, నిలవకట్టు. బిడ్డ కండ్లకు కట్టుట, మబ్బు కట్టినది, నెత్తురు వెల్లువ కట్టినది. కడుపుకట్టి సంపాదించు, మీగడ కట్టినది, కట్టుచారు.........

చూడబోతే ఇట్లా ఈ ధోరణిలో జరగవలసిన పరిశీలన ఎంతైనా ఉంది. బ్రౌన్ నిఘంటువు ఇటువంటి పరిశీలనకు ఒక పెన్నిధివంటిది.

—శ్రీ బంగోరె.

## వేమన్న రభస

వేమన్న మహాకవి అని, ప్రజాకవి అని, అలాంటి కవి 'నభూతో నభవిష్యతి' అని కొందరంటే, అతడు అసలుకవే కాదంటున్నారు కొందరు. వేమన్న ఈ ప్రచారంలో ఉన్నభావాలకు ఆ నాడే అర్థం పట్టాలని, మనలో కొన్ని వర్గాలవారి మనస్తత్వాన్ని ఆ నాడే ప్రదర్శించిన ప్రగతివాది అని వేమన్నమీద కొందరు విపరీతమైన అభిమానాన్ని పెంచుకోడమేకాకుండా, ప్రఖ్యాతులైన కొందరు కవులు కవులేకారని, వారి రచనలు అక్కరలేదని ప్రచారం చేస్తున్నారు. తగినంత చారిత్రక, సాంఘిక శాస్త్రపరిజ్ఞానం లేనందువల్లనో, సరైన సాహిత్య దృక్పథం ఏర్పడనందువల్లనో, ఇలాంటి అభిప్రాయాలు ఏర్పడడం. కొంతకాలం అనన్య ప్రచారం పొందడం సహజంగా జరుగుతుంది. చర్చలద్వారా, సద్విమర్శద్వారా, నూత్న పరిశోధనలద్వారా సరైన అవగాహన కలిగి క్రమేణ కవి ప్రతిభకు ఉచితమైన స్థానం లభిస్తుంది. ఉదాహరణకు ఆంగ్ల సాహిత్యం తీసుకోండి. అలెగ్జాండర్ పోప్ మన వేమన్నలాగే ఘాటైన అధిక్షేపణలతో నైతిక నిలువలను బలపరుస్తూ సూటైన ఉపదేశాత్మకమైన కవిత్వాన్ని రాసి రాణించాడు. అతని కవిత్వం అందరి నోట తాండవించింది. షేక్స్పియర్, మిల్టన్‌వంటి మహాకవులకుకూడా అలాంటి ప్రజాదరణ లభించలేదు. అయినా అతన్ని కవిగా గుర్తించని వాళ్లెందరో ఉన్నారు. డా. శామ్యూల్ జాన్సన్‌వంటి విమర్శక మూర్ధన్యుడు 'పోపు' లేకపోతే కవిత్వమే లేదని గర్జించాడు. అయినా పోపును ఈనాడు కూడా మహాకవిగా గుర్తించడం సులభసాధ్యం కావడం లేదు. కేవలం సాహిత్య దృష్టితో చూస్తే, మన సాహిత్యంలో వేమన్నకుగల స్థానం ఆంగ్ల సాహిత్యంలో 'పోపు'కు గల స్థానం వంటిదే.

'జాన్‌డోన్' అనే కవి చాలాకాలం మరుగున పడిపోయాడు. మన శతాబ్దంలో మహాకవి టి. ఎస్. ఇలియట్ ప్రభృతులు 'జాన్‌డోన్'ను ఆకాశానికి ఎత్తేశారు. సిసలైన కవిత్వం 'జాన్‌డోన్'లోను అతని అనుయాయుల్లోను కనిపిస్తూందన్నారు. మన శతాబ్దపు పూర్వ విభాగానికి, పదిహేడవ శతాబ్దపు పూర్వ భాగానికి సమాజపరంగా ఎన్నో పోలికలున్నాయని, 'డోన్' కవిత్వం అత్యంత ఆధునికమైందని స్తుతించారు. మిల్టన్, షెల్లీలలాంటి కవులను పరాభవించారు. అయినా ఒక అర్ధ శతాబ్దకాలంలో ఇదంతా అత్యుక్తి అని, అపోహజనితం అని తేలిపోయింది. ఇలియట్‌కూడా తన అభిప్రాయాలను కొంతవరకు మార్చుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. వేమన్నమీద వెర్రి అభిమానం పెంచుకొన్నవారు, కొంతకాలం తరువాత తమ దురభిమానాన్ని కొంతవరకేనా చంపుకోవలసి వస్తుంది.

వేమన్నకు గతంలో మహాపరాధం జరిగి పోయిందనడం, ఏదో కుట జరిగిందని ఆరోపించడం కేవలం ఊహామూలకాలేకాని, సహేతుకాలుకావు. వర్తమానపు టద్దాల్లోంచి గతాన్ని చూడడంవల్ల వచ్చిన ఫలితాలు. అలాగే వేమన్న అసలు కవే కాదనడం కేవలం వితండవాదం—సాహిత్య విమర్శకాదు.

శ్రీ గంటి శ్రీరామమూర్తి.

## శ్రీ నోరి వారి వ్యాసం

వరా నరసింహశాస్త్రిగారిలాంటి వారు వ్యాసం వ్రాయడం సాహసకార్యమే. ముందుగా వారు దానిని నాకు వినిపిస్తామన్నారు. నా కావ్యాలలో ఏవి నిలుస్తవని వ్రాశారని ప్రశ్నించాను. ఏవీ వ్రాయలేదన్నారు. నేను విననన్నాను. ఇద్దరమూ నవ్వుకున్నాము.' 'విమర్శకుడుగా వినండన్నారు. విమర్శకుడుగానే వినను. నా కావ్యాలు లేనప్పుడు అది విమర్శయేకాదని ముందుగానే తెలుస్తోంది కనుక—అని అన్నాను. మళ్లీ నవ్వుకున్నాము. తరువాత వారు వినిపించనూ లేదు. నేను వినిపించమని అడుగనూ లేదు. వ్యాసమూ, వ్యాసముపై శ్రీ బండి విమర్శ చూచాను.

ప్రసంగాలలో శాస్త్రిగారు చిత్తశుద్ధి కలవారుగా కన్పిస్తారు. వ్రాతలలో లౌక్య ప్రజ్ఞ కన్పిస్తుంది. శ్రీ విశ్వనాథ కల్పవృక్షాన్ని ఉదాహరించకుండా ఉంటే వ్యాస సమగ్రతకు లోపమని వారి భయం. అది నిలుస్తుందనడానికి వారి మనస్సొప్ప లేదు. నిలువదని సూటిగా చెప్పే ధైర్యం ఉన్నట్లు కనబడదు. తికమకతో, భంగ్యంతరంగా వారీ వాక్యాలు వెలువరించారు. 'మా దృష్టిలో కల్పవృక్షము మరీ పెద్దదయి పోయినది. వ్యాస వాల్మీకుల శక్తి ఆధునికులకున్నదనడానికి మాకు సాహసము చాలదు. అదిగాక అది వాల్మీకులకు వ్యాఖ్యాన మంటున్నారు కవి. వ్యాఖ్యానాలు కావ్యాలు కావు కదా!...'

(1) 'మరీ పెద్దదయినది'— పెద్దగ్రంథం. అంటే ఎంతో ఒక ప్రమాణం నిర్ణయిస్తే- మరీ పెద్దసంగతి చూచుకోవచ్చు. ప్రమాణ నిర్ణయం జరుగలేదు కనుక పై వాక్యం ప్రామాణికం కాదు. మరీ పెద్దపుస్తకాలు నిలువ వనడానికికూడా వారి వాక్యంతప్ప ప్రమాణం ఏమీ లేదు. సంస్కృతంలో భారతం పెద్దగ్రంథమేకదా! వాల్మీకముకూడా పెద్దగ్రంథమే కదా! సంస్కృతానికి లేని యీ పెద్దతనపు దోషం తెలుగు కావ్యానికి ఎట్లా పట్టిందో వారు వివరించ లేదు.

(2) వ్యాస వాల్మీకుల శక్తి విషయం. ఇది శ్రీ విశ్వనాథకు లేదని సూచించారు. మంచిదే. లేదు. తెలుగు భాషలో కావ్యం నిలవడానికి పై వారిశక్తి ఉండవలసిన అవసరం ఏముంది? రామకథ వ్రాసిన సామ్యం ఉన్నది కనుక వాల్మీకి పోలికనప్పవచ్చును కాని వ్యాస ప్రవేశం ఎందుకు? పోనీ ఋషి కనుక ఊరికే కలిపారనుకుందాం. మరి వీరి వ్యాసం మాత్రం నిలుస్తుందని ఎట్లా అనుకున్నారు? వ్యాసాలలో తమ వ్యాసానికి నిలువగలతనం, కవిత్వంతో కల్పవృక్షానికి లేదనేది వారు చెప్పినట్లే అయినది కదా' ఇది నిజమా? కల్పవృక్షము సర్వమూ దేవతా వృక్షమే అనే వారున్నారు. దోషాలున్నవనే వారూ ఉన్నారు. కాని నిలువదని చెప్పేవారు శాస్త్రిగారు మాత్రమే. నేనా గ్రంథం నిలుస్తుందనికాని, నిలువదనికాని చెప్పడం లేదు. కాని శాస్త్రిగారి విమర్శయొక్క విధానం మాత్రం సరిగా లేదు.

శ్రీ విశ్వనాథ అభిప్రాయం ఇది—'అనంతమైన

కాలంలో ఏ గ్రంథము నిలుస్తుందో, ఏది నిలువదో నిర్ణయింప పూనుకోవడం హాస్యాస్పదం. నా పుస్తకాలేవీ నిలుస్తవని నేననుకోవడం లేదు. కొంతకాలం రామాయణం నిలుస్తుందని అనుకునే వాడిని. ఇప్పుడదికూడా అనుకోవడం మానివేశాను. నా గ్రంథాల విషయంలోనే నా అభిప్రాయం ఇలా ఉన్నప్పుడు మిగిలిన వాని విషయం అసలు ఆలోచన ఏమిటి? ఎన్ని ప్రాకృతాలు నశించిపోయినవి? ఆంధ్రభాషకు సుమారు వేయి సంవత్సరాల వెనుక స్థితి ఏమిటి? ముందు ఎల్లా ఉంటుందో ఎవరు చెప్పగలరు? అనంతమైన కాలంలో పరమేశ్వరుడు మిగిల్చాలనుకున్న భాషలను గ్రంథాలను మిగులుస్తాడు. లేనిది లేదు.'

దేవుడంటే ప్రేమ. ప్రేమ గ్రుడ్డిది—కనుక దేవుడు గ్రుడ్డివాడు—అనే తర్కం ఒకటి ఉన్నది. అల్లాగే శ్రీ శాస్త్రిగారు శ్రీ విశ్వనాథ, తమ కల్పవృక్షాన్ని వాల్మీకికి వ్యాఖ్యానం అన్నారు కనుక, వ్యాఖ్యానాలు కావ్యాలు కావు కనుక, కల్పవృక్షం కావ్యంకాదు—అనే ధోరణినిని అవలంబించారు. శ్రీ విశ్వనాథ, వేయి సంవత్సరాల కవులలో నేనొక్కడినే గొప్పకవిని—అన్నారనుకోండి. వారు అన్నారు కనుక మనము దానినే ప్రమాణంగా స్వీకరిస్తామా? శ్రీ విశ్వనాథ పై దానిని ఏ సందర్భంలో ఎందుకన్నారో ముందు విచారించాలి కదా! అందుచేత యీ పేచీ బాగుండలేదు. శాస్త్రిగారు స్వయంగా గ్రంథం చదివి, ఆ గ్రంథంలో సత్కవిత్వమున్నదో లేదో పరిశీలించి, ఒక అభిప్రాయం ఏర్పరుచుకుని సహేతుకంగా వెల్లడిస్తే కాదనేవారుండరు.

పత్రికాధిపతులు శ్రీ శాస్త్రిగారి భావాలకు తమ బాధ్యతలేదని, ప్రతి సంచికలోనూ స్పష్టీకరించడంతోనే వ్యాసం శక్తి సగం క్షీణించింది. శాస్త్రిగారు కొన్ని విమర్శలు చాల చక్కగా చేయడం నాకు తెలును. కాని, యీ, కాని పనికి ఎందుకు పూనుకున్నారో తెలియదు. 'నాకు నచ్చిన పుస్తకాలు' అని వారుటంకించిన పుస్తకాల్లో గుణాన్ని గురించి చక్కని వ్యాసాలు వ్రాస్తే బాగుండేది. లేదా నిలుస్తవని తాము చెప్పే తమ వచనపు పుస్తకాలను గూర్చి, వానిలో గుణము, నిలువడానికి హేతువులు, నిరూపిస్తే ఇంకా బాగుండేది. వారి గ్రంథాలనుగూర్చి వారి అభిప్రాయాలు ఒక రికార్డుగా ఉపకరించేవి.

—శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి.

## "బౌద్ధ శిథిలాలు 'లంజదిబ్బ' లెట్లైనవి?"

శ్రీ జి. ఆర్. వర్మగారు "బౌద్ధ శిథిలాలు 'లంజదిబ్బ' లెట్లైనవి" అను శీర్షికతో 1974 మే భారతిలో ఒక వ్యాసమును ప్రకటించిరి. ఆ వ్యాసము చదువగా నాకు కలిగిన అభిప్రాయభేదములను సంక్షిప్తముగా సవినయముగా పాఠకుల యెదుట బెట్టుచున్నాను.

వీరు ఈ వ్యాసములో బౌద్ధ శిథిలాలను 'లంజదిబ్బ'లనుటకు మారుగా 'సన్యాసి దిబ్బల'నుట మంచిది అను అభిప్రాయమును ప్రధానముగా చెప్పదలచుకొని ఈ వ్యాసమును వ్రాసిరి. అని నేను అభిప్రాయపడితిని.

37వ పేజీ మొదటికాలము రెండవ పేరాలో—

(1) "హిందువుల్లో ఆధ్యాత్మిక చింతనా పరులైన వారి తావులను, విరాగులైనవారి తావులను సన్యాసి దిబ్బలనుటలేదు."అని వ్రాసిరి. ఏమని అంటారో వ్రాయలేదు. ఒకవేళ పై వారి తావులను సన్యాసి దిబ్బలంటే—బౌద్ధ శిథిలాలను 'లంజదిబ్బ'లన వచ్చునని వీరి అభిప్రాయమా!

(2) "మన పురాణగాథల్లో ఋషులు సన్యాసులుగారు" అని వ్రాసిరి. ఋషి అయిన ప్రతివ్యక్తి సన్యాసి కావలయునని వీరి అభిప్రాయమా! వీరి దృష్టిలో 'ఋషి' అన్న పదమునకు, 'సన్యాసి' అన్న పదమునకు నిర్వచనములు యేమిటో తెలియదు.

(3) "కొన్ని శతాబ్దాల పిమ్మట బౌద్ధుల జూచి సన్యసించనారంభించారేమో!" అని.

ఇచ్చట బౌద్ధులను జూచి (హిందువులు) మనవారు సన్యసించుట ఆరంభించిరి. అనునది ధ్వనించుచున్నది. ఎందుకంటే "ఆరంభించారేమో"నని సందేహంగా వ్రాసిరి.

4. 'సన్యాసి పేరు ఈ లెఖను బౌద్ధుల సంబంధం అనవచ్చును' అని.

దీనిని బట్టి అంటే 'ఈ లెఖను' అని వ్రాయుటచే హిందువులు బౌద్ధులను జూచి సన్యసించుట మొదలుపెట్టిన యెడల 'సన్యాసి' అను పేరు బౌద్ధుల సంబంధం అని వీరి అభిప్రాయము.

బౌద్ధులకు పూర్వము సన్యాసము లేదని వీరి అభిప్రాయమా? 'సన్యాసి' అనే పేరే లేదని వీరి అభిప్రాయమా? కాక రెండూ కూడ లేవని వీరి అభిప్రాయమా !

అదే పేజీ అదే కాలము మూడవ పేరాలో

'బౌద్ధాన్నపహాస్యం చేయడానికే ప్రబుద్ధుడైన పనిగట్టుకు ప్రచారం చేసాడా? అన్న వాక్యము అర్థ సమన్వయము అగుటలేదు.

'బ్రాహ్మణ్యం దేవభాషజేసిన సంస్కృత శబ్దార్థం తెలియక ఆ పేరు పెట్టాడా?' అని.

పేరు పెట్టింది ఎవరు ? కాక సంస్కృత మును దేవభాషను జేసినది బ్రాహ్మణ్యమని వీరి అభిప్రాయమా? బ్రాహ్మణులైతే వీరికి యిష్టములేనట్లు తెలియుచున్నది.

'కారణం తెలియక తికమక పడేవారికి, కాబోలు ననుకొనేవారికీ మరింత 'నమ్మకంల్'గా మన పండిత పరిశోధకులు ప్రచారం చేసారా ? మూడో వారి ప్రమేయం గలదనిపించేట్లున్న వ్యాసం ఒకటి చూశాను' ఆ భాగం.

'......భోగినీ నిర్మాపితములు గనుక వీనికీ పేరు వచ్చినదన్న విషయము చిరకాలమునుండి వచ్చు చున్న జనశ్రుతిలో నిలచియే యున్నది...' అని.

దీనిపై వ్యాసకర్త 'వ్రాసినవారు పరిశోధకులో కాదో సూచింపకున్నా పై వాక్యాలు బట్టి రచయిత పండితుడని వచ్చును. మేధావులు, పరిశోధకులు సత్యాన్వేషణ జేసి జనసామాన్యంలో గూడ పాతుకు పోయిన మూఢభావాలు తొలగించాలేగాని వక్రభాష్యా లతో తప్పుడు నమ్మకాల బలపచ్చుట మంచిదికాదు.'' అని.

పై వ్యాసమును బట్టి వీరి అభిప్రాయము వ్రాసిరి. ఏదైనా ఒక విషయమును నిర్ణయించుటకు కేవలము ఒక్క ప్రదేశమునో, కాలమునో, విషయమునో గాక పూర్వాపర సందర్భములను విచారించుట అత్యంత ముఖ్యమైన విషయము. అట్లుగాక ఎవరో ఏదో చేసారు అంటే అన్నీ తెలిసిన మన సంగతి ఏమిటి అని.

వీరి వ్యాసం చివర అంటే 41 పేజీ రెండవ కాలం చివరి పంక్తులు 'నాటి బ్రాహ్మణ్యాన్ని గూర్చి యిలా వ్రాసినందుకు నేటి బ్రాహ్మణులు, మిత్రులు అన్యథా భావించకుందురుగాక' అని వ్రాసిరి.

అనకూడనిది అనేసి ఏమీ అనుకోకు అంటే ఎలా అనుకోకుండా వుంటారు. 'పోనీ అనుకోండి.' అంటారేమో! వారి యుద్దేశ్యము అలా అనుకోకుండా వుండాలి అనేగదా ఈ వ్యాసము వ్రాయుటలో గల ముఖ్య ఉద్దేశ్యము. వక్ర భాష్యాలు ఎవరో ఏమో చెప్పిరి అన్నప్పుడు తాము ఆ పంథాను త్రొక్క కూడదు గదా!

బ్రాహ్మణ్యమును దుయ్యబట్టారు అంటే అతిశయోక్తి లేదు. ఎందుచేతనంటే 37వ పేజీ రెండవ కాలంలో చివరి పంక్తిలో 'నాటి బౌద్ధద్వేష శేషం ఇంకా బ్రాహ్మణుల్లో ఉందా?' అని. యింకా 37 వ పేజీ మొదటి కాలం మూడవపేర 3 వ పంక్తిలోను, 37 వ పేజీ రెండవ కాలం రెండవ పేర 10 నుండి 15 పంక్తులలోను, 40 వ పేజీ రెండవకాలం రెండవ పేరాలోను, మూడవ పేరా 8,9 పంక్తులలోను, 41 వ పేజీ రెండ కాలంలో మూడవ పేర 4, 5, 6 పంక్తులలోను బ్రాహ్మణ్యాన్నిగూర్చి వీరు వ్రాసినవి చదివిన పాఠకులు గ్రహింతురు గాక.

37 వ పేజీ మొదటి కాలంలో రెండవ పేరా చివర, మూడవ పేరా మొదట—

'బౌద్ధ శిథిలాలు (చైత్య, విహార)ను సన్యాసి దిబ్బలనుట సహజము, ఏ మాత్రమూ ఏహ్యాభావమూ, న్యూనతా లేని పేరు.

రెండవ పేరు స్త్రీ సంబంధం, న్యూనత నాపాదించేదిగా ఉంది. ఇక్కడ వీరు రెండవ పేరు అని వాడారు. అంటే 'లంజదిబ్బ' అని. ఆ పేరు వాడుటకే వారికి అంత కష్టమైనప్పుడు, బ్రాహ్మణ్య మును గూర్చి, విమర్శకులను గూర్చి అంతఘాటుగా వ్రాసిరే, వీరికి ఎట్లుండును ?

—శ్రీ కె. ఎస్. ఆర్. శర్మ.

## ఆరుద్ర ప్రయోగించింది ఆంగ్ల పదమే

ఆర్యా,

ఏప్రిల్, మే నెల భారతిలో వరుసగా శ్రీ బండి నాగరాజు, శ్రీ పాకాల వెంకట కృష్ణయ్యగారలు

'రనండి' మాండలికమనీ, దాన్నే ఆరుద్ర ప్రయోగించారనీ వ్రాశారు. 'రనండి', 'పొనండి'— నెల్లూరు మాండలికాలైనా ఇక్కడ ఆరుద్ర ప్రయోగించింది ఇంగ్లీషు పదమే. 'పొనండి' అనేది ఎవరూ ప్రయోగించనూలేదు. దాన్ని ఎవరూ ఇంగ్లీషు పదంగా విభజించనూలేదు. అలాగే 'వినండి' అనేది కూడా నేను 'విన్ + అండి' అని విభజించలేదు. అలాంటి విభజన ఈ సందర్భంలో అర్థవంతమూ కాదు.

ఇక 'రనండి' నెల్లూరు మాండలికంగానే ఆరుద్ర ప్రయోగించారనడానికి ప్రతిబంధకాలున్నాయి. ఆరుద్ర నెల్లూరు మండలానికి చెందినవారు కారు. అలాగైతే సహజంగా ఆ మాండలికాలు ప్రవేశించవచ్చు. పఠాభి, నారపరెడ్డి, రామిరెడ్డి వంటివారి ప్రభావంతో నెల్లూరు మాండలికాలు ఆరుద్ర కవిత్వంలో ప్రవేశించాయని శ్రీ వెంకటకృష్ణయ్య గారంటున్నారు. కాని పఠాభి, రామిరెడ్డి ఇత్యాదుల కవిత్వంలో లేని 'రనండి, పొనండి' మాండలికాలు వారి ప్రభావంతో ఆరుద్ర కవిత్వంలో ప్రవేశించాయనడం కేవలం అసంగతం. ఆరుద్ర కవిత్వంలో ఇతరత్రా కూడా నెల్లూరు మాండలికాలు కనపడవు.

త్వమేవాహమ్‌లో విశాఖజిల్లా మాండలికాలు సైతం క్వాచిత్కంగానే వున్నాయి. 'సెకండ్లు'లో

'లాగండ్రా బాబ......'
'ఇంకా ఇంకా రాజ
ఇంకా ఇంకా నయ్ న......'
('నాయనా' అని పలకడానికి
ఊపిరీ ఛందస్సూ కూడా చాలవు'—
ఒక లఘుటిప్పణిలో—(శిశి.)
'ఇంతే ఇంతే కొడక
ఇంతే ఇంతే బతుకు'

అని ప్రయోగాలున్నాయి. త్వమేవాహమ్‌లో మాండలికాలంటూ వున్నది, సామాన్య జనులు బ్రతుకు నెట్టడాన్ని చూపే యీ భాగంలోనే. ఇక్కడ నెల్లూరి మాండలికాలు లేవు. ఇతరత్రానూ లేవు. కావ్య వస్తువు తెలంగాణాకి సంబంధించింది కాబట్టి, తెలంగాణా మాండలికాలు ప్రయోగించడం ఉచితం కావచ్చు. కవి విశాఖజిల్లాకు చెందినవాడు కావడంచేత విశాఖజిల్లా మాండలికాలు ప్రయోగించడం సహజం. కవికి గాని, కావ్యవస్తువుకు గాని సంబంధం లేని నెల్లూరి మాండలికాలని ప్రయోగించారనడం అనుచితం.

ఇక 'రనండి' ఆంగ్ల పదమే ననడానికి ప్రథమ నిదర్శనం 'ఇన్వేడించే', 'ఛెరిషించు', 'ఛెయాసు ఛెరిషించు' ఇత్యాదిగా బహుళంగా ఆంగ్ల క్రియా రూపాల్ని తెలుగు విభక్త్యంతాలతో కలిపి ప్రయోగించడం. పై వాటిని కూడా ఏ ప్రాంతపు మాండలికలుగానో అర్థవంతంగా నిరూపిస్తే మంచిదే. ఆరుద్రకి పిన్నవ కవులకన్నా ముందు మాండలిక నుడికారాలు ప్రవేశపెట్టిన కీర్తి దక్కుతుంది.

రెండోది ఇక్కడ 'రనండి' అనే పదం తెలుగు నుడికారంతో సహజంగా లేదు.

'నడవండి నా బాట' — అంటే నా బాట యందు నడవండి అని సప్తమి అర్థంలో విభక్తి లోపం గుర్తించవచ్చు.

'వినండి నామాట'— అంటే 'నా మాటను వినండి' అని ద్వితీయార్థంలో విభక్తి లోపం. ఈ రెండర్థాల్లోనూ విభక్తిలోపం ప్రసిద్ధంగా అందరూ గుర్తిస్తారు. కాని

'రనండి నా పంథా' అంటే 'రండీ నా పంథా' అనే అర్థంలో 'నా పంథానే రండి! 'నా పంథాలో రండి' అని వుండాలి. అంటే ఛందో రూపంలో

'రనండి నా పంథా (నే), 'రనండి నా పంథా(లో)' అని వుండాలి. ఇక్కడ 'నే', 'లో' అనేవి లోపించడం తెలుగు భాషకి సహజం కాదు. ఇది ఆంగ్లంలో ఆలోచించి, తెలుగులో ఆ నుడికారంతో అవే పదాలతో వ్రాసిన భాగం.

'రనండి నా పంథా' 'Run my way' అని ఇంగ్లీషు భావానుసరణం. 'Do it my way' అంటే 'ఈ పని నాలా చెయ్యండి' అని. ఇది ఆవిధమైన భావానుసరణమే. ఇంగ్లీషులో ఆలోచిస్తూ తెలుగులో వ్రాయడం ఆరుద్రకు ఆ నాటి అలవాటు. ఉదాహరణకు 'To put on a countenance' అనే భావాన్ని 'ఆఫీసు మొగాన్ని తగిలించుకొని' అని ప్రయోగించారు. ఇలాంటి అష్టావధానంలో ఆంగ్ల నుడికారంకూడా అప్పుడప్పుడు దిగుమతైన సందర్భాల్లో ఇదొకటి.

ఇదిగాక అదే చోట
'మాకేం భయమని
అనండి చనండి
రనండి మీరంతా'— అని వుంది.

ఇక్కడ నెల్లూరి మాండలికమే ఆరుద్ర వాడ దలిస్తే 'చనండి' అనిగాక 'పొనండి' అనే ప్రయోగించి వుండాలి. 'వెళ్లండి, రండి' మీరంతా అనే అర్థంలో 'పొండి', 'రండి' అని ప్రయోగించినట్లవుతుంది. ఇది అంత అర్థవంతంగా కన్పించదు.

'రనండి' అంటే 'పరుగెత్తండి' అనే అర్థం తీసుకుంటే ముందు 'వెళ్లండి' అనీ తర్వాత 'పరుగెత్తండి' అంటే 'విప్లవాన్ని ఉద్ధృతం చేయండి' అని ఆరుద్ర ఉద్దేశం. మిగిలిన రెండు చోట్లా

'రనండి జగమంతా'
'రనండి నా చెంత
కనండి మీవంత...' అనే చోట్ల 'రండి' 'పరుగెత్తండి' అనే అర్థాల్లో ఏదైనా సరిపోతుంది.

ఏదైనా యీ సందేహం ఆరుద్ర స్వయంగా తీర్చాల్సిందే.

ఇక 'ఆధునిక మణి ప్రవాళా'నికి ఆచార్య పీఠం ఆరుద్రదే ననడానికి కారణం నా వ్యాసంలో స్పష్టంగా చెప్పాను. 'ఆరుద్ర ముద్ర' అనేది పఠాభి ముద్రే అయినా, పఠాభి ఆంగ్ల పదప్రయోగం మిశ్ర సమాసాలు వాడటంతో ఆగిపోయింది. కాని ఆరుద్రలా ఆంగ్ల పదాలకి తెలుగు ప్రత్యయాలు చేర్చలేదు. మణి ప్రవాళంలో సంస్కృత విభక్త్యంతాలు తెలుగులో యథేచ్ఛగా ప్రవేశిస్తాయి. అందుకే ఆరుద్ర రచనకే 'ఆధునిక మణి పవాళం' అనడం ఆయనదే 'ఆచార్య పీఠం' అనడమూను.

వైచిత్రీప్రీతితో వీరుచేసిన ఈ కృతక ప్రయోగాల్లో ఔచిత్యం, అర్థగౌరవం వున్నాయని నేనెక్కడా అనలేదు. పఠాభిగాని, ఆరుద్రగాని ఇటువంటి ప్రయోగాలు చేయడం 'వైచిత్రీ ప్రీతికే' అని అనడంలో, నా దృష్టి 'శబ్ద వైచిత్రి' అనే. అంతేగాని అందులో 'అర్థవైచిత్రి', 'భావవైచిత్రి' వున్నాయనిగాని, లేనిపోని రసమూ, ధ్వనీ వున్నాయనిగాని నా భావంకాదు. అయితే ఆ వైచిత్రి 'శబ్దవైచిత్రి' అని కంఠోక్తిగా నేననక పోడానికి కారణం అభిజ్ఞులు ఆ విషయం అర్థం చేసుకుంటారని. అర్థభావ వైచిత్రుల విషయంలో శ్రీ వెంకటకృష్ణయ్యగారు వుదహరించినవేకాక ఆరుద్ర ఇటీవల వ్రాసిన పాటల్లో 'త్వమేవాఽహం' కన్నా తలమానికమైనవి చాలా వున్నాయని నేనూ అంగీకరిస్తాను.

—శ్రీ టి. జి. కృష్ణారావు.

# నన్నయ వేగోపమ

ఆర్యా,

వే నెల భారతిలో శలాక రఘునాథశర్మగారు వ్రాసిన 'నన్నయ వేగోపమ' యను వ్యాసము చదివిన పిమ్మట యందలి విశిష్టతను, తర్కమునకు మనస్సు వాయువును గూర్చి చెప్పబడిన విషయములు పేర్కొనుచున్నాను.

మనసు - వాయువు. రెండును వేగమున కుపమానముగా పేర్కొందురు. అన్నింటికన్న వేగమైనది మనస్సని యందరి తలంపు. ఆ సందియమునన్న మాటల నుట్టంకించి శర్మగారు తొలగించినారు. తర్కమునం జెప్పంబడిన వానిని తెలిసికొందము.

మనసు—సుఖాద్యుప లబ్ధిసాధన మింద్రియం మనః 'అనగా సుఖదుఃఖాదులను దెలిసికొనుటకు సాధనమైన యింద్రియము మనస్సు, ఇది స్పర్శము లేనిది, క్రియగలది.

వాయువు—'రూపరహిత స్పర్శవాన్ వాయుః' అనగా స్పర్శము గల్గియు రూపము లేనిది. ఇది నిత్యమున నిత్యమునని ద్వివిధము. పరమాణు రూపమైనది నిత్యము. కార్యరూపమైన దనిత్యము. అనిత్యము శరీరేంద్రియ విషయ భేదములచే త్రి విధము.' శరీరం వాయులోనే—ఇంద్రియం స్పర్శ గ్రాహకం త్వక్—సర్వ శరీరవృత్తిః— విషయోవృక్షాది కంపనహేతుః 'శరీరాంత స్సంచారీ వాయుః ప్రాణశ్చ' — శరీరము వాయులోకవర్తి. స్పర్శ గ్రాహకమై సమస్త దేహము నందుండెడి త్వక్కే యింద్రియము. వృక్షాదులను గదలించుటకు కారణమగు వాయువు విషయవాయువు. శరీరమున సంచరించు ప్రాణవాయువు నదే.

దీనినిబట్టి మనస్సు — వాయువు భిన్నములు గావని తెలియుచున్నది. మనస్సు వాయువులో నున్న

దనియే గదా! కావుననే మనస్సును ముందు పేర్కొని తరువాత వాయువును బేర్కొందురు.

వీని వ్యుత్పత్తులను బరికింతము. మన్యతే అనేనేతి మనః అనగా దీనిచేత నెఱుఁగఁబడును. అనగాఁ బ్రతి వస్తువును మనస్సుచేఁ దెలిసికొనవచ్చు నన్న మాట. వస్తు తత్వమును దెలిసికొనుటకు సాయపడు నది మనసన్నమాట. కాని వాయు నట్లుగాదు. వా తీతి వాయుః అనగా పోవునది— వీచునది యని వ్యుత్పత్తి. మనము దలంచిననే మనస్సు పయనించును. వాయువో? మన ప్రమేయము లేకయే పయనించును. మనస్సునకుఁ బ్రేరణ ప్రధానము. ఆలోచన, భావముల నాశ్రయముగాఁ గలిగి మనస్సు పయనించును. వాయువు స్వేచ్ఛా సంచారి. దీనికి ఆశుగః అనియు పేరున్నది. ఆశు గచ్ఛ తీతి ఆశుగః అనగా శీఘ్రముగాఁ బోవున దని యర్థము.

నన్నయ యే పదమును వ్యర్థముగాఁ బ్రయోగింపడు. అతడు సూక్తి, శర్మగారు నన్నయ పద ప్రయో గౌచిత్యమును జక్కగా వివరించినారు. మనస్సు — వాయువు శబ్దముల పోలిక వేగముతో నెందులకో సోదాహరణముగాఁ దెలిపినారు.

—శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి.

## బ్రౌన్ జాబులు

వే, 1974 భారతిలోని గ్రంథవిమర్శలు శీర్షికలో 'బ్రౌన్ జాబులు'—కు సమీక్ష వ్రాసిన అవంతి గారు సమీక్షకుడిగా వ్యవహరింపలేదేమో అనిపిస్తోంది; వ్యావహారిక సిద్ధరూపములను భాషలో భ్రష్టమై పోనీకుండా భాషను వ్యాకరించి, దానికొక స్థిరత్వమును చేకూర్చిన చిన్నయసూరిగారిని బ్రౌన్‌తో పోల్చి చెపుతున్నట్లు చెపుతూ బ్రౌన్‌ను 'ఈనాడు తెలుగు సాహిత్యాన్ని గురించి మనం మాట్లాడుకో గలుగుతున్నామంటే అది బ్రౌన్ పెట్టిన భిక్ష' అని వ్రాస్తూ ఆకాశానికి ఎత్తారు. బ్రౌన్ తెలుఁగు భాషకు కొంతమేలు చేసెనని చెప్పవచ్చు. ఆయన కూడా చేసింది వ్యావహారిక రూపాలను గ్రంథస్థ మొనరించి నిఘంటువు ద్వారా ఆయా పదములకు అర్థస్థిరత్వమును చేకూర్చుటే గదా! చిన్నయసూరి పదభ్రష్టత్వమును భాషలో నివారింపయత్నింప బ్రౌన్ అర్థచ్యుతిని నివారించిరి. వేమన సూక్తులను ప్రపంచమునకు తన భాషాంతరీకరణము ద్వారా చాటి చెప్పి కొన్ని గ్రంథములకు టీకలను వ్రాయించినంత మాత్రాన మన సాహిత్యాన్ని గూర్చి మనం తెలిసికొనుటకు బ్రౌన్ భిక్షే ప్రసాదమనుట అన్యాయము. క్షేత్రమెరిగి విత్తుట బ్రౌన్ బాగా ఎఱుగును. భారతీయు లందరిలో తన కీర్తి వ్యాపింపవలెనని కోరిక గలవాడు.

నాఁడు— నూఱేడులనాడు — శాస్త్రిగారి అను భవాలూ—జ్ఞాపకాలుతో నాటి రచయితలు తెలుఁగు రచనలు చేయుటకు విముఖులుకారని, వారి వారి భావాలను వెలువరించు భాషా భేషజంలో స్పర్థలు — ఆవేశకావేశాలు—సాహితీ లోకమున సంచలము ఉప్పతిల్లుటకు కారణమైనదని స్థూలంగా గోచరిస్తుంది. అవంతిగార్ని మరోమాటు శ్రీ పాదవారి రచనల చూడ గోరుచున్నాను.

ఇకపోతే చిన్నయగారు సాతాని చిన్నయ్యకాడు; నిశ్చయముగా మహాపండితుడే. చిన్నయసూరి వ్యక్తిత్వ స్ఫూర్తిని అంతగా అవంతిగారు అవగాహన జేసికొని నట్లు కానరాదు. సమీక్షకుడు నిష్పక్షపాతి కావలె. దువ్వూరి వేంకటరమణశాస్త్రిగారి 'రమణీయం' చదివితే చిన్నయసూరి తెలుగునాట తెనుఁగుభాష కొనర్చిన సేవ కొంతవఱకు అవగాహన కాగలదు.

'చిన్నయసూరి—తెలుఁగు భాష ప్రగతిని అడ్డుకొన్నాడు' అని వ్రాశారు. అసలు ప్రగతికి నిర్వచనం—గతంలోని అనుభవాలను వర్తమానపు మంచి వెదుల పరిశీలనాత్మక దృక్పథముతో మేళవించి, భవిష్యత్తునకు సోపానాలను నిర్మించికొనుటే. అటువంటపుడు నన్నయ నాటిభాష భ్రష్టమైపోకుండా కాపాడిన ఘనత చిన్నయ్యదే. అవంతిగారు తెలుఁగు భాష అంటే వ్యావహారికాంధ్రమనియే భావించి నట్లుంది. (తెలుగుభాష ప్రగతిని అడ్డగించేడన్నా, గ్రాంథిక భాషకు ప్రాణప్రతిష్ఠ చేయ గలుగుతాడన్నా— అన్న వాక్యమే ప్రమాణము.) కాని చిన్నయసూరి వ్యావహారికాంధ్రమునకు, గ్రాంథిక భాషకు సమన్వితిని సాధించిపెట్టి తెలుగు భాషను సుప్రతిష్ఠ మొనరించెనని చెప్పవచ్చు.

పేర్ల మాత్రముననే అది వ్యావహారిక రచనా? గ్రాంథిక రచనా? అని గుర్తుపట్టుగలిగినట్లున్నారు

అవంతిగారు. గురుమూర్తి శాస్త్రిగారి పంచతంత్ర కథాదుల పేర్లకు—చిన్నయసూరిగారి 'నీతిచంద్రి'కాది గ్రంథ నామాదులకుగల వ్యత్యాసాన్ని ఎలా గుర్తింపగలిగేరో?

'ఒక వ్యక్తివలన సాహిత్యపంథా పూర్తిగా మారడం ఆశ్చర్యమన్నారు.' ఒకచోట—ఆశ్చర్యపడాల్సింది లేదు. నన్నయ తనకు ముందుగల శాసన భాషను సంస్కరించి భారత రచన కుపక్రమించి శబ్దశాసన, ఆది కవి అని తెలుగువారిచేత ప్రస్తుతింపబడలేదా? శ్రీశ్రీని యుగకర్తగా పరిగణించుట లేదా? 'చారిత్రక కారణాలు అన్వేషించాలన్నారు.' నన్నయ రాజప్రాపు శ్రీశ్రీ మార్క్సు సిద్ధాంతాలపైగల నమ్మిక వారిని చారిత్రక పురుషులగా నొనర్చినట్లే, చిన్నయ సూరికిగల సహజ పాండితీ ప్రతిభతోబాటు విద్వజ్జనుల, రాజపోషకుల ప్రాపు, ఆయనకంత కీర్తిని తెచ్చిపెట్టినదని చెప్పవచ్చు. భాషను వ్యాకరించి స్థిర రూపమును సిద్ధపఱచినందున గ్రంథస్థమైన మన భాష జీవించియున్నది. లేకున్న వారవార పత్రికలలోని వేవేల కవితల మాదిరిగా మన సాహిత్య సంపద మనది మనదిగా దక్కకుండెడిదేమో? ఈ చిన్నయసూరి ప్రస్తావనను మోతాదుమించి వ్రాసి అవంతిగారు తాము అతివాద వ్యావహారిక భాషావాదినని నిరూపించుకొనుటకుగాను వ్యర్థప్రయత్నము జేసినట్లు కనిపిస్తుంది.

శ్రీ గంగసాని పద్మారెడ్డి.

## ఈషణత్రయము

భారతి— ఏప్రిల్ 1974 లో— శ్రీ వీరబ్రహ్మేంద్ర చరిత్ర గ్రంథమును విమర్శించుచు శ్రీ పమిడికాల్వ చెంచు సుబ్బయ్య, 'ఈషణ తయము వ్యవహారమును బట్టి ప్రయోగించుట జరిగినది. కాని అది ఏషణత్రయము అని యుండిన సాధువు' అని చెప్పినారు. కాని నేనుగూడ 'ఈషణత్రయము' సరైనదే అని అనుకొనుచుంటిని. ఈషణము, ఈషణత్రయము అను మాటలు శబ్దరత్నాకరములో నున్నవి. దారేషణము, విత్తేషణము, పుత్రేషణము—అన్నప్పుడు వీనిలో ఉన్నది ఈషణమా? ఏషణమా? సుబ్బయ్యగారు వివరింతురని కోరెదను. త్రివిధేషణములు పేర్కొన్న విద్యార్థి కల్పతరువు, 'ఈషణము — త్వరపెట్టునది = కోరిక' అని వ్యుత్పత్తి చెప్పినది. ఏషణ సాధుత్వమును గూర్చి నాకు తెలియదు, వివరింపగలరని అభ్యర్థన.

శ్రీ బండి నాగరాజు.



# గ్రంథవిమర్శలు

## శివజ్యోతి

(శ్రీ నిర్మల శంకర శాస్త్రి, మూల్యం: 3 రూ. శివాద్వైత సిద్ధాంత సంఘము, 184 ఎ — సర్వమంగళా సదనము, వెస్ట్ మారేడుపల్లి, సికింద్రాబాదు—26.)

ఆధునిక యుగమున వీరశైవ సాహిత్యమును సుప్రతిష్ఠితము గావించి, తన్మూలమున శైవమత వ్యాప్తికి తోడ్పడిన మహనీయులు ఆంధ్రపిత కైలాసవాసి కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు—క్రీ. శ. 1926లో వారు ఆంధ్ర గ్రంథమాల పక్షమున—పాల్కురికి సోమనాథుని బసవపురాణము సుపరిష్కృత ముద్రణము వెలయించి, దానికి శైవమతతత్త్వమును నిరూపించు పీఠిక వ్రాసిరి.[1] ఆ గ్రంథమాలలోనే, శైవ సాహిత్యమునకు సంబంధించిన, పాల్కురికి సోమనాథుని వృషాధిపశతకము, యథావాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకము ప్రశస్త పీఠికలతో క్రీ. శ. 1930లో ప్రచురించిరి.[2]

స్వర్గీయులు శ్రీ శంభుప్రసాదుగారు—క్రీ. శ. 1939లో శైవసాహిత్యమునకు మకుటాయమానమైన—పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రము పరిష్కృత ముద్రణమును ప్రకాశింప జేసిరి.[3] 1951 లో, వారు, శ్రీ నాగేశ్వరరావుపంతులుగారి పీఠికతో — బసవపురాణమును పునఃపరిష్కృతము గావించి — ఉపోద్ఘాతముతో ప్రకటించిరి.[4] క్రీ. శ. 1940 నుండి—భారతి యందు శైవసాహిత్యము — శైవమతమును గూర్చి బహువ్యాసములను ప్రకటించిరి. వానిలో భారతి రజతోత్సవ సందర్భమున వెలువడిన 'ఆంధ్రవీర శైవవాఙ్మయము'—అను వ్యాసము ప్రామాణికమై ప్రశంసల నందుకొన్నది.

ఆంధ్ర గ్రంథమాల—భారతి మూలమున జరిగిన శైవమత, సాహిత్య ప్రచారమువలన — ఆంధ్ర వాఙ్మయ చరిత్రమున—శివకవి యుగమేర్పడి—సాహిత్య ప్రపంచమున పై గ్రంథములు విశిష్టస్థానము నలంకరించినవి. విశ్వవిద్యాలయములలో వాఙ్మయ పరిశోధనలలో, సాహిత్య విమర్శనలలో చాలగా ప్రచురములైనవి—కాని సాహిత్య ప్రపంచమున—నవి కేవలము సారస్వత దృష్టితోడనే పరిశీలించుట జరుగుచున్నది. ఇది సరికాదు. బసవ పురాణ పండితారాధ్య చరిత్రలు శైవమత ప్రబోధ ప్రచారములకై రచితములైన ప్రామాణిక గ్రంథములు. అవి ప్రాయికముగా మతగ్రంథములే యైనను, వానియందు ప్రకృష్టమైన కావ్యకళా విశిష్టత గలదు. కావున నవి మత ప్రాధాన్యములు సాహిత్య ప్రాధాన్యములు నైన గ్రంథములుగా భాసించినవి. అయిన నీ నాడు మనకు మతముతో ప్రమేయము లేకపోవుటవలన—శైవ వీరశైవ మతములు భిన్నములను నభిప్రాయములను ప్రవర్తింపజేసి, శైవ సాహిత్య విమర్శనము సంస్కారులను సాహిత్య విమర్శకులను గూడ నపమార్గమును బట్టించినది—అందుచే ప్రాచీన కావ్య విమర్శన మస్తవ్యస్తమైనది.

ఈ నాడు శైవమత మన్నదివేఱు; వీరశైవ

---

1. గ్రంథ పరిష్కర్తలు కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు—వారు దీనికి 88 పుటల విపుల పీఠిక వ్రాసిరి—పాల్కురికి సోమనాథుని ప్రతిభను ప్రథమముగా లోకమునకు వెల్లడించిన, ఆ పీఠిక — పునర్ముద్రితము కాలేదు—

2. ఈ రెండు శతకములను శ్రీ పంతులుగారి పీఠికలతో తిరిగి ముద్రించుట ఆవశ్యకము—

3. పరిష్కర్తలు—పీఠికా కర్తలు— కీ. శే. కళాప్రపూర్ణ చిలుకూరి నారాయణరావు—

4. పరిష్కర్త : ఉపోద్ఘాతకర్త — విడుదవోలు వేంకటరావు— 3—4. ఈ రెండు గ్రంథములు నేడలభ్యములు. వీనిలో పండితారాధ్య చరిత్రను నేను, పాఠపరిష్కరణము గావించి రెండువందల పుటల పీఠికతో, నొక సుపరిష్కృత ముద్రణ ప్రతిని సిద్ధముచేసి యున్నాడను. అది ముద్రితము కావలసి యున్నది.

మతమన్నది వేఱని కొందఱి సాహిత్యవేత్తల యభిప్రాయము. కాని తెలుగుదేశమున శైవమన్న వీరశైవమేయని గ్రహింపవలెను. అది రెండు సంప్రదాయములు గలది.

## జంగమ సంప్రదాయము

1. వర్ణాశ్రమ ధర్మ సంబంధము అనగా వైదిక ధర్మ సంబంధము లేక లింగధారణ మాత్రము గలిగిన శైవము—ఇందువర్ణ వ్యవస్థలేదు. భక్తియే ప్రధానము. ఇది కన్నడ దేశమున బసవన ప్రవర్తింపజేసినది. దీనికి జంగమ సంప్రదాయము లేక బసవ సంప్రదాయము అని పేరు. బసవ పురాణమీ జంగమ సంప్రదాయమును ప్రవచించును.

## ఆరాధ్య సంప్రదాయము

2. వర్ణాశ్రమ ధర్మ సంబంధము — అనగా వైదిక ధర్మము లింగధారణ గలిగిన శైవము—ఇది వేదాగమోపనిషత్ప్రమాణములచే సిద్ధాంతితమై శ్రీపతి పండిత, శివలెంక మంచెన పండిత, మల్లికార్జున పండితారాధ్య పండితత్రయముచే ప్రతిపాదితమైన సంప్రదాయము. దీనికే ఆరాధ్య సంప్రదాయము అని పేరు. పండితారాధ్య చరిత్ర—ఆరాధ్య శైవమునకు ప్రధాన గ్రంథము —

ఇట్లు, శైవము—భిన్నములైన రెండు సంప్రదాయములున్నట్లు గోచరించినను, శివుని యర్ధనారీశ్వర స్వరూపము వలె రెండుసంప్రదాయములును నేకైకముగా, శివభక్తిని, శివపారమ్యమును శివభక్త మహిమను ప్రవ్యక్తము చేయును. ఈ రెండు సంప్రదాయములను ప్రపంచినది పాల్కురికి సోమనాథుడొకడే. ఈ రెండింటిలో ఆరాధ్యశైవమే అనాదిగా భారత వర మున వెలసినది. తెలుగుదేశమున జంగమ సంప్రదాయముకన్న ఆరాధ్య సంప్రదాయమే—బహళముగా వ్యాపించినది ఆంధ్ర సాహిత్యమున శివకవుల వెనుక శ్రీనాథుడీ ఆరాధ్య శైవ సంప్రదాయమును తిరిగి సుప్రతిష్ఠితము చేసినాడు⁵—అయినను నీనాడు మన సాహిత్య విమర్శనలలో, వీరశైవమనగా, బసవన ప్రవర్తిల్లజేసిన జంగమ మతమే యనియు, ఆరాధ్య శైవమనగా వేఱనియు భిన్నాభిప్రాయములు వ్యక్తము లగుచున్నవి. ఆరాధ్య శైవమును నామూలాగ్రముగా ప్రచురముచేసిన పండితారాధ్య చరిత్రయందలి మత విషయములు, అందలి లోకోత్తరమైన కవితావిశిష్టతవలన — విమర్శకుల దృష్టి నాకర్షింపలేదు — ఇందువలన మతము — సాహిత్యము—శరీరప్రాణములవలె నవినాభావ సంబంధము గల పై శైవ కవికృతులలో — సాహిత్యము మాత్రమే ప్రధానమగుటవలన — సాహిత్య విమర్శనమున—శైవ మతమునుగూర్చి—ముఖ్యముగా, ఆరాధ్య సంప్రదాయమునుగూర్చి — ఎవరికి తోచినట్లు వారు వ్రాయుచుండుట తటస్థించినది.

## శివజ్యోతి

ఇట్టి పరిస్థితులలో, శైవమత సంప్రదాయము—శివాద్వైత సిద్ధాంత స్వరూపము, ఆరాధ్య శైవ మహోన్నతత్వము మున్నగు విషయములను గూర్చి, నిర్దిష్టమగు పరిజ్ఞానము గలిగించు—నీ 'శివజ్యోతి' అను సంచికను ప్రకటించిన — సికిందరాబాదు (హైదరాబాదు) శివాద్వైత సంఘము వారెంతయు నభినందనీయులు—'

> "భస్మత్రిపుండ్రాంకిత దివ్యమూర్తిం
> రుద్రాక్ష కంకణ లసత్కర దండ యుగ్మం
> షట్కాల సంపూజ్యధృతేష్టలింగం
> శ్రీ నీలకంఠబుధ దేశిక మానతోఽస్మి"

శివాద్వైత సిద్ధాంత ప్రతిష్ఠాపకులై, శ్రీ కంఠాపర నామధేయులై—నీలలోహిత రుద్రాంశ సంభవులై బ్రహ్మసూత్రములకు శివాద్వైత పరముగా భాష్యము వ్రాసిన జగద్గురు శ్రీ నీలకంఠ భగవత్పాదాచార్య జయంతి. (11–4–1973) మహోత్సవమును పురస్కరించుకొని, ఏర్పడిన శివాద్వైత సంఘము వారి సంపాదకత్వమున వెలువడిన యీ సంచికయందు:—

1. శివ స్వరూపము.
2. శ్రీ శివ విశిష్టాద్వైతము.
3. ఆంధ్రదేశమున వర్ధిల్లిన శైవము — ఆరాధ్య సంప్రదాయములు.

---

5. ఈ విషయము శ్రీనాథుని గూర్చిన గ్రంథములందుగాని సాహిత్య విమర్శనలందుగాని ప్రసక్తము కాలేదు. (చూడుడు, నా శ్రీనాథయుగము— అముద్రితము)

4. ఆంధ్రదేశము—శైవము.
5. శివకవులు.
6. శ్రీ నీలకంఠ భగవత్పాదాచార్యులవారు — వారి సిద్ధాంత సారము.
7. శివ నిర్మాల్య స్వీకార నిర్ణయము.
8. శివతత్త్వము.
9. శివాద్వైతము.
10. శివ స్వరూపము.
11. శివుని యైశ్వర్యము.

అను పదునొకొండు వ్యాసములు గలవు—శివ స్వరూప మేకాదశ రుద్రమూర్తులు కావున నీ శివ జ్యోతియందును నేకాదశ వ్యాసములుండుట యెంతయు సార్థకమై యొప్పుచున్నది.

శైవమతతత్త్వ మవగాహన చేసికొనుటకు మతప్రచారము చేయుటకు ఈనాడు మత సంప్రదాయ పరిజ్ఞానమే కాక, చారిత్రక దృష్టియు రెండును నావశ్యకములే—సంపాదకులు దీనిని గుర్తించి సంప్రదాయ చారిత్రకాంశములతో నీ సంచికను వెలువరించుట ప్రశంసనీయమై యున్నది.

ఇందలి వ్యాసముల విషయములన్నియు వివరించుట గ్రంథ విస్తరమగును గాన ముఖ్యాంశములను విశదము చేయుచున్నాను. డాక్టరు పుల్లెల శ్రీరామచంద్రుడుగారి శ్రీ శివ విశిష్టాద్వైతము—డాక్టరు దివాకర్ల వేంకటావధాని గారి—ఆంధ్రదేశము—శైవము, శ్రీ ముదిగొండ రామలింగశాస్త్రిగారి శివకవులు—అన్న వ్యాసములు చారిత్రకముగా పేర్కొనదగినవి.

సాంప్రదాయికముగ శివాద్వైతమును సిద్ధాంతీకరించిన వ్యాసములలో జ్ఞానవయోవృద్ధులు శతావధానులు నగు శ్రీ ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రిగారి 'శివాద్వైతము' అను వ్యాసము ప్రథమముగా నెన్నదగినది. ద్వితీయమైనను అద్వితీయమైనది. శైవ సాహిత్య విద్యాభూషణ—శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారి 'నీలకంఠ భగవత్పాదులవారు—వారి సిద్ధాంత సారము' అనునది శ్రీ శంకరశాస్త్రిగారు నీలకంఠ భాష్యమున కంతకు తెలుగున ననువాదము గావించినారు. అందు ప్రథమాధ్యాయము—రెండు సంపుటములుగా, నివఱకే ముద్రితమైనది. కాని తక్కిన భాగములు ముద్రితము కాలేదు. ఆంధ్రమహాజనులీ తెలుగు నీలకంఠ భాష్యమును సంపూర్ణముగా వెలువడుటకు సహాయము చేయుదురుగాక—

శివపురాణాంకాను వాదములగు శ్రీ నిర్మల నీలకంఠ శర్మగారి శివనిర్మాల్య స్వీకార నిర్ణయము—శ్రీ నిర్మల రామనాథశర్మగారి శివతత్త్వము—అను వ్యాసములును—స్వతంత్రములగు విద్వాన్ కామర్సు చంద్రమౌళి శాస్త్రిగారి శివస్వరూపము, విద్యాభాషా ప్రవీణ మూలంపల్లి చంద్రశేఖర శర్మగారి శివుని యైశ్వర్యము అను వ్యాసములు శైవులకేగాక సర్వులకు పఠనీయములై యున్నవి.

పై చారిత్రక వ్యాసములలో రెండింటియందు మాత్రము భేదాభిప్రాయముల కవకాశమిచ్చు నంశములు కన్పట్టుచున్నవి. శ్రీ శివవిశిష్టాద్వైతము అను వ్యాసమున వ్యాసకర్తలు — 'పూర్వాచార్యులచే వ్యాససూత్రనయనమును ప్రసన్నము చేయుటకై, తానీ వ్యాఖ్య రచించినట్లు చెప్పుటచే—అట్లు పేర్కొనబడిన పూర్వాచార్యులు — శంకరాచార్య భాస్కరాచార్యాదులై యుందురు—' (పుట 5) అని తెలిపినారు—ఇందువలన నీలకంఠాచార్యుడు, శంకరాచార్యులకు తరువాతి వాడని తెలియుచున్నది. కాని— ఈ సంచిక యందే—66వ పుటలో నిట్లున్నది:

'శ్రీ నీలకంఠ భగవత్పాదులవారు—శ్రీ మదాద్య శంకరాచార్యుల వారికి సమకాలికులని శంకర విజయము చెప్పును. కాని నీలకంఠ భాష్యమునందలి యనేక విషయముల ననువదించిన శ్రీ శంకరాచార్యులవారు ఖండించినందున నీలకంఠాచార్యులు శ్రీ శంకరాచార్యులకు పూర్వికులనుట సమంజసంబగుసు.' (నీలకంఠ భగవత్పాదులవారు వారి సిద్ధాంత సారము).

నీలకంఠ శివాచార్యులవారి యవతారకాలము— కలిశకము—2030 స్వభాను సంవత్సర చైత్ర శు 10 సోమవారమగుటచే—వారు శంకరాచార్యుల కంటె చాలా పూర్వులు—(వేదాంత పరిష్కార తారహారము).[6]

6. మహామహోపాధ్యాయ లోకారాధ్య యోగి శ్రీ ముదిగొండ నాగలింగ శివారాధ్య కృతము. శ్రీ మున్నంగి పున్నయ్యపంతులుగారి ఆంధ్రానువాదము. (1961)

ఆంధ్రదేశము—శైవము అను వ్యాసమున 41 నుండి 4౨ పుటలలో—"కాశ్మీరశైవము—సిద్ధాంత శైవము — పంచాచార్య సిద్ధ శైవము మొదలగు భేదములేగాక — పాశుపతులు, కాపాలికులు — కాలాముఖులు — గోరక్షనాథ శాఖీయులు, రసేశ్వర శాఖీయులు మున్నగు శైవశాఖలు పేర్కొనబడియున్నవి. కాని ఇవి యేవియును, తెలుగుదేశమునకు సంబంధించినవి కావు—వీనిలో నేశైవమునకును లింగధారణ లేదు. 47 పుటలో వివరింపబడిన పంచాచార్య శైవ సంప్రదాయ మొక ప్రత్యేక శైవ సంప్రదాయము కాదని నిర్ణయింపబడినది.[7] తెలుగుదేశమున ప్రాచీన కాలము నుండి శ్రౌతశైవమగు ఆరాధ్య శైవసంప్రదాయమే వెలసినది. బసవోపజ్ఞమైన జంగమ సంప్రదాయ మతి స్వల్పముగా నాంధ్రదేశమున నెలకొన్నది.

పై విషయమేగాక -మఱి కొన్ని యంశములలో విపర్యాసములు కాన్పించుచున్నవి—ఈ సంచిక యందలి వ్యాసములన్నియు మత సంబంధములైనవి గాన—వానిని తెలుపుట సమీక్షాకారుని కర్తవ్యము. పుట 43. శైవ మతము ప్రధానముగా నాగమములపై నాధారపడి యున్నది" ఇది సరికాదు—శైవమతము, వేదములు—ఉపనిషత్తులు—ఆధారము గాగలది శివాగమములగు నిరువది యెనిమిది ఆగమములు — వేదము తరువాత వెలసినవే—వేదాగమములు లేక నిగమాగమములు — అనియేక్రమము. పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమున, వాదప్రకరణము జదివిన నీ విషయము విశదముగా తెలియగలదు—

పుట 44. "శ్రీ కంఠ శివాచార్యుడు శ్రీపతి పండితుడు, మల్లికార్జున పండితారాధ్యుడు—మున్నగు విద్వాంసులు శివునే పరదైవతముగా నిరూపించుచు బ్రహ్మసూత్ర ప్రముఖములైన వేదాంత గ్రంథములపై భాష్యములు రచించి శైవమునకు వేదాంత మతముతో సమానమైన ప్రతిపత్తి కల్పించిరి."

శ్రీకంఠ శివాచార్యుడు, శ్రీపతి పండితుడు, బ్రహ్మసూత్రములపై, శివాద్వైత పరముగా భాష్యములు రచించుట ప్రసిద్ధమేగాని మల్లికార్జున పండితుడు—భాష్యమును రచించెనని వ్రాయుట సమంజసముగాదు—మల్లికార్జున పండితుడు భాష్యమును రచింపనేలేదు—అతడు శివమాహాత్మ్యమును మద్ఘాటించు 'రుద్రమహిమ' అను సంస్కృత కృతిమాత్రమే రచించెను. (చూడుడు. పండితారాధ్యచరిత్ర వాద ప్రకరణము)

పుట 49. 'బసవేశ్వరుని కాలమువఱకు నాగమములే శైవమతమునకు సంబంధించిన ప్రధాన వాఙ్మయముగా నుండెను. ఆగమములతోపాటాకాలమున రచింపబడిన యీ క్రింది గ్రంథములనుగూడ పేర్కొనవచ్చును. శ్రీ కంఠ శివాచార్యుని శ్రీ కంఠభాష్యము (980) శ్వయోగి శివాచార్యుని సిద్ధాంత శిఖామణి (8 వ శతాబ్ది) శ్రీపతి పండితుని శ్రీ కరభాష్యము (12 వ శతాబ్ది) ఈశాన శివగురుని రేణుక విజయ చంపువు (10 వ శతాబ్ది) సిద్ధనాథుని రేణుక విజయము (960) నీలకంఠాచార్యుని క్రియాసారము వేలాది బసవన శివతత్త్వ రత్నాకరము, ఈశాన శివాచార్యుని ఈశాన గురుపద్ధతి—మున్నగునవి వానిలో ముఖ్యములు'

పై గ్రంథములన్నియు బసవేశ్వరుని కాలమునకు ముందుగా రచింపబడినవి కావు. పేర్లలో కాలములలో వ్యత్యాసములున్నవి. (8 వ శతాబ్ది)

'శ్వయోగి శివాచార్యుని సిద్ధాంత శిఖామణి—ఈ శ్వయోగి యెవరు?—సిద్ధాంత శిఖామణి రేణుకాచార్య కృతము—పాల్కురికి సోమనాథుని గ్రంథములలో నీ రేణుకాచార్య ప్రసక్తిగాని, సిద్ధాంత శిఖామణి ప్రసక్తిగాని లేదు—అసలు రేణుకాచార్య డెప్పటివాడు—అనువిషయమై భేదాభిప్రాయము లున్నప్పుడు—అతని గూర్చి రచింపబడిన గ్రంథములు (పైని పేర్కొనబడినవి) ఆయా కుండలీకరణములు చేసిన కాలముల యందు రచింపబడినవని చెప్పుటకు మనకేయాధారమును లేదు—

శ్రీపతి పండితుని శ్రీకరభాష్యము. (12 వ శతాబ్ది) అని కలదు. కాని శ్రీపతి పండితుడు—క్రీ. శ. 930 ప్రాంతమువాడు.[8]

---

7. Prof. K. M. Sakhere—Vira Saivism – In religion and Philophy 1949.

8. చూ. తెలుగు కవుల చరిత్ర. పుటలు 68—82. మద్రాసు విశ్వవిద్యాలయ ప్రకటితము. (1950)

వేలాది బసవన శివతత్త్వరత్నాకరము—శివ తత్త్వరత్నాకర కృతికర్త కేలాది బసవరాజుగాని వేలాది బసవన కాడు.

'లోకానాంతు హితాయ సార
కెల దీ సింహాసనా ధీశ్వరో
గౌరీనాథ కృపాఖిలార్జిత
కళా పాండిత్య విభ్రాజితః
కుద్వేహం బసవేంద్ర భూమి
రమణో రత్నాకరాఖ్యం కృతిం
సర్వం ప్రేక్ష్య చ వాక్ప్ర పంచ ము
సకృత్ పుత్ర! స్వమాకర్ణయ'

అని శివతత్త్వ రత్నాకరావతారిక—ఈ కృతి రచనా కాలము—క్రీ. శ. 1709. కాన బసవని కాలమునకు నాలువందల యేండ్లు తరువాత పుట్టినది.

పుట—51. (పాల్కురికి సోమనాథుడు) ... 'అతడు బ్రాహ్మణ కుటుంబమున జన్మించి శివ భక్తుడై వీరశైవదీక్ష స్వీకరించెను— అతడు చివఱకు వర్ణభేదమును నుజ్జగించి జంగము డయ్యెను.'

ఇందేపుట 54—లో 'బ్రాహ్మణులైన వీర శైవు లారాధ్యులనియు నబ్రాహ్మణులు జంగములు లేక— లింగబలిజలనియు పిలువబడుచుందురు' ఈ వాక్యములు పరస్పర విరుద్ధములు — ఇందువలన సోమనాథు డబ్రాహ్మణుడు, జంగము లేక లింగబలిజ అగును. ఇట్టి వ్రాతవ్రాయుట—[9]చతుర్వేద పారగుడగు సోమనాథునికి మహాపచారము గావించుటయే. సోమనాథు డారాధ్యబ్రాహ్మణుడు. (చూ. ఈ సంచిక యందే పుటలు 59—60.)

ఇట్టి స్వల్పవిపర్యాసములున్నను — సంచిక యంతయు శైవమత తత్త్వమును, విశదీకరించుచు, నుత్తమ శ్రేణిలో నున్నది— ఆంధ్రదేశమున భాషా జాతీయ సమైక్యతలను సాధించినది శైవము. అట్టి శైవమత ప్రచార ప్రవర్ధకమగు నిట్టి సంచిక — వార్షికముగా గాక ప్రతిమాసమునను వెలువడునట్లుచేసి ఆంధ్రమహాజనులు ప్రోత్సహించి, శైవమతాభివృద్ధికి దోహదము చేయుదురుగాక.

—కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు.

# కళంకిని

(నవల)

(కౌముది, పుటలు: 360 వెల రు. 10—లు (మేలు ప్రతి) ప్రతులకు: రోచిస్ బుక్స్, విజయ వాడ – 1)

తమిళ పంచకావ్యాలలో ఇళంగో అడిగళ్ (పూజ్యపాదులు) సంతరించిన సిలప్పదికారం ద్వితీయ మైనా అద్వితీయమైన కావ్యం. సతీదేవి అని ప్రసిద్ధి కెక్కిన కణ్ణకి కథను కమనీయంగా అభివర్ణించే ప్రశస్త రచన యిది. ఈకథను ఇతివృత్తంగా స్వీకరించి సుప్రసిద్ధ హిందీ రచయిత శ్రీ అమృతలాల్ నాగర్ 'కళ్యాణమంజీరాలు' అనే నవల వ్రాశారు. దీన్ని ఆధారంగా చేసుకుని శ్రీ కౌముది కళంకిని అనే యీ నవల వ్రాశారు.

సంస్కృతం మొదలైన ఎన్నో భాషల నుంచి మనం చాలా రచనలు తెలుగు చేసుకున్నాం. కాని తెలుగు తోబుట్టుభాషలైన తమిళం, కన్నడం మొద లైన వాటిలోని మహాకావ్యాలు తెలుగులోకి ఆలే రాకపోవడం శోచనీయం. ఈదృష్టితో చూస్తే, రచయిత కృషిని అభినందించక తప్పదు. కాని తీరా నవలను చదివిన తర్వాత, తమిళంతో పరిచయం గలవారికి, ఆశాభంగం ఏర్పడుతుందని సవినయంగా మనవి చేస్తున్నాను.

సుప్రసిద్ధ కుటుంబాలకు చెందిన కణ్ణకీ కోవలులకు చిన్నతనంలోనే వివాహం జరుగుతుంది. కొంతకాలం వాళ్ల దాంపత్యజీవితం సౌఖ్యావహంగా సాగుతుంది. కాని, ఆ తర్వాత, కోవలుడు మాధవి అనే వేశ్య వలలో పడిపోయి, అగ్నిసాక్షిగా పరిణయ మాడిన భార్యను మరిచిపోతాడు; చివరికి కన్నెత్తి కూడా చూడడు. పడిన గోడలు పడినట్లే ఉండవు గదా మరి! మాధవి శీలాన్ని సంశయించి కోవలుడు మళ్లీ కణ్ణకిని చేరుకుంటాడు. అప్పటికే మాధవీ కోవలులకు మణిమేఖల అనే కుమార్తె జన్మించింది.

---

9. 'నలిఁబాల్కురికి సోమనాథుఁ డనంగ
వెలయువాఁడను జతుర్వేద పారగుఁడ—'
(పండితారాధ్య చరిత్రము)

ఉన్న ఊళ్లో నర్తకం చెయ్యడానికి బ్రతికి చెడిన కోవలుడికి బుద్ధి పుట్టలేదు. అందువల్ల, అతడు సతీసమేతంగా మధురకు వెడతాడు. అక్కడ, దురదృష్టవశాత్తూ, రాజుగారి కోపానికి గురిఅయిన కోవలుడు హత్య చేయబడతాడు. ఆ కోపం కొద్దీ కణ్ణకి మధురను మంటలపాలు చేస్తుంది. ఇదీ సిలప్పదికారంలోని కథ.

నిజానికి, సిలప్పదికారంలోని కథ అతి రమణీయమయింది. ఉన్నది వున్నట్లుగానే చెప్పినా, ఆ కథ ఆధునిక పాఠకులను సైతం అలరిస్తుందని నా అభిప్రాయం. రచయిత చాలా మార్పులు చేశారు. కల్పనలెన్నో చేశారు. ఎంత ప్రసిద్ధమైన కథనైనా కొన్ని మార్పులతో చెప్పడం రచయితలకు కొత్త కాదు. ఈ విషయంలో మన పూర్వులే మనకు మార్గం చూపించారు. అయితే, యీ మార్పులు కథా గౌరవాన్ని ఇనుమడింపజేసేవిగా ఉండాలి; మూల రచయిత సృష్టించిన పాత్రలకు కొత్త మెరుగులు దిద్దేవిగా ఉండాలి. కాని ప్రస్తుత నవల అందుకు భిన్నంగా ఉందని చెప్పడానికి విచారిస్తున్నాను.

శాస్త్రోక్తంగా మాధవీ కోవలులకు వివాహం జరిగిందనడం, కోవలన్ మాధవిని విసర్జించిన తీరు, వంశవృక్షపట్టకం కల్పన, ఆ పట్టకం కారణంగా ఉత్పన్నమయిన తీవ్ర పరిస్థితి, మణిమేఖలకు వివాహ ప్రయత్నం, కోవలన్ కణ్ణకిమీద చెయ్యిచేసుకోవడం, కోవలుణ్ణి రక్షకభటులు దేహశుద్ధి చేయడం— వంటి మార్పులు అసమంజసంగా కనిపిస్తున్నవి.

కణ్ణకిని విడిచిపెట్టి కోవలుడు కొంతకాలం పాటు మాధవితో ఉండడం వాస్తవమే. అంతమాత్రాన అతడు వట్టి స్త్రీలోలుడనీ, చవకబారు వేశ్యలతో కూడా తిరిగేవాడనీ చెప్పడం, ఏవిధంగా చూచినా, మూలకథకు న్యాయం చేసేదిగా కనిపించడం లేదు. ఈ నవలను చదివినతర్వాత కోవలుడంటే అసహ్యంతప్ప మరొకటి కలగదు. కాని అతడు అనుకున్నంత వేశ్యాలోలుడు కాడు!

ఇక పాత్రలపేర్లు: కథాగత విషయాలలో చేయబడిన మార్పుల్ని కొందరు సహిస్తారేమో కాని, పేర్లలో కనిపించే దోషాన్ని మాత్రం సహించరనుకుంటాను. కన్నగి, మానాయిహన్, మసాత్తువాన్... ఇలాగే మరికొన్ని. ఇవి కాక, తరుణోపాయం, రూపురేఖలు, ఆశీనులు మొదలైన తప్పులూ పుస్తకంలో కనిపిస్తున్నవి.

శ్రీయుతులు పూతలపట్టు శ్రీరాములరెడ్డి, మరుపూరు కోదండరామరెడ్డి, చల్లా రాధాకృష్ణశర్మ ప్రభృతులు ఇంతకుపూర్వమే సిలప్పదికార కావ్యకథను తెలుగువారికి పరిచయం చేశారు. రచన చేసేముందు శ్రీ కౌముది వీరి రచనల్ని కూడా సంప్రదించి వుంటే బాగుండేది. పైగా, కళంకిని అన్నపేరుకన్నా కళ్యాణ మంజీరాలు అన్నపేరే సముచితమని నా అభిప్రాయం.

మార్పులమాట యెలా ఉన్నా, రచన మాత్రం సాఫీగా సాగింది. తమిళ మూలంతో పరిచయంలేని తెలుగు పాఠకులకు ఈ నవల రుచిస్తుందని నేననుకుంటున్నాను. సుప్రసిద్ధమైన ఒక తమిళ కావ్యకథను నవలగా తీర్చిదిద్దినందుకు రచయిత కృషిని మరొకమారు కొనియాడుతున్నాను.

—డా॥ చల్లా రాధాకృష్ణశర్మ.

## "ముక్తాయి సూత్రభాష్యము"

(తెనుగు 1973) గ్రంథకర్త—శ్రీ ధర్మాల రామమూర్తిగారు—ధర—రు. 25–00 ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడమి ద్రవ్యసహాయము ముద్రింపబడినది.)

ఈ "ముక్తాయి సూత్రభాష్యము"ను గ్రంథము శ్రీ ధర్మాల రామమూర్తిగారు మృదంగవాదన కళ విషయమై వ్రాసిన రెండవ గ్రంథము. వారు ముందు

వ్రాసిన "మృదంగ తత్వము''నకు ఈ ''ముక్తాయి సూత్రభాష్య''ను అనుబంధగ్రంథమనియు లేక ఉత్తర (రెండవ) భాగముగా ఎంచవలసినట్లుగా తెలియును. మృదంగ వాద్యమును అభ్యాసము చేయుటకు అవశ్యమైన అన్ని విషయములును ఈ రెండవ గ్రంథము మూలముగా పూర్తి అయినదని తెలియును. ముందు వ్రాసిన 'మృదంగ తత్వము'న 64 పథకముల మూలముగా ఇవ్వబడిన ముక్తాయి వరుసలుగాక మరికొన్ని ఇంకను కఠినమైన ముక్తాయింపు వరుసలను తమచే గణిత ప్రస్తారము మూలముగా కల్పింపబడిన 108 సూత్రములద్వారా గాయకునికి ఎంత కఠినమైన ఏ తాళమునను గల పల్లవికి పక్క వాద్యమునకు కావలసిన చాల అడ్వాన్సు ముక్తాయి వరుసలు ఈ క్రొత్త గ్రంథమున ఇవ్వబడియున్నవి. ఒక్కొక్క సూత్రమును వివరముగా దెలుపుచూ వానికి సంబంధమైన పథకముల మూలముగా వాటిలోని వరుసల గణిత రూపములను తేటపరచి యున్నవి.

ఈ గ్రంథమున గల అనుబంధములో మరికొన్ని అవశ్యములైన, అనగా, ఒకే ఆవర్తనమున తగ్గింపులు, షట్కాలగతులు (నడలమార్గము లేక గమనము), షట్కాల ముక్తాయింపులతో కఠినమైన పల్లవుల విషయములు సహా చక్కగా వివరింపబడియున్నవి.

ఈ గంథములో చాల ముఖ్యమైన తప్పొప్పుల పట్టిక ఇవ్వబడియుండుట విశేషము.

శ్రీ ధర్మాల రామమూర్తిగారు ఈ గ్రంథమును రచించుటలో అత్యంత శ్రమపడి యుండురనుటకు సందేహమే లేదు. మృదంగ వాద్య కళను నేర్చుటకు అభిలాషగల విద్యార్థులకును, ఇతర సామాన్య మృదంగ విద్వాంసులకును చాల అవశ్యమైన గ్రంథములు ఈ 'మృదంగ తత్వము'; 'ముక్తాయి సూత్రభాష్యము.'

తాళ విషయమై 'మృదంగ తత్వము' (English) గ్రంథమునకు నేను వ్రాసిన విమర్శనములో చాల వివరములు తెలిపియున్నాను. అవి అన్నియు ఈ 'ముక్తాయి సూత్రభాష్యము'నకు సరిపోవునని యెంచెద.

—శ్రీ సరస్వతి రామకృష్ణయ్య.

## రాజా రామమోహనరాయ్

(ఆంగ్లమూలం : శ్రీమతి జమునా నాగ్; తెలుగు అనువాదం; శ్రీ కె. తారకం; ప్రచురణ : యం. శేషాచలం అండ్ కో. మచిలీపట్టణం; మద్రాసు; సికింద్రాబాద్. 200 పేజీలు. వెల: రూ. 2—50.)

భారతీయ సాంస్కృతిక పునరుజ్జీవనానికి తోడ్పడి, దేశంకోసం ధనమూ, శరీరారోగ్యమూ అర్పించి, అపఖ్యాతిని ఎదుర్కొని సాహసోపేతంగా ముందుకు సాగిన మహనీయులు రాజా రామమోహన రాయ్. రెండువందల సంవత్సరాలు తిరక్కుండానే దేశాభ్యున్నతికి రామమోహనరాయ్ కృషి స్వల్పమనీ, అధికమైన ఖ్యాతిని ఆయనకు అంటగడుతున్నారని ప్రసిద్ధ చరిత్రకారులే ఆరోపించటం శోచనీయం. ఈ సందర్భంలో రామమోహనరాయ్ జీవిత చరిత్ర తెలుసుకోవటం చరిత్ర, సంస్కృతులంటే అభిమానం గల వారందరికీ అవశ్య కర్తవ్యం. నేటి పరిస్థితులలో ఎంతో కొంత మతాతీత రాజ్యాంగంగల దేశంలో జీవిస్తూ, మూఢనమ్మకాలను చాలవరకు వదిలించుకున్నామని నమ్ముతూ ఉన్న యువతరానికి రామమోహనరాయ్ జీవిత చరిత్ర సంభ్రమాశ్చర్యాలు కలిగించకపోవచ్చు. కాని భారత స్వాతంత్ర్య పోరాటంలో అసువు లర్పించిన త్యాగధనులతోపాటు, సాంస్కృతికంగా దేశాన్ని ఆటవిక దశనుండి రక్షించి 'యీ దేశానికి కావలసింది రాజకీయ స్వాతంత్ర్యం మాత్రమే కాదు సాంస్కృతికమైన వికాసంగూడ' అని తెలియజెప్పిన విజ్ఞుడు రామమోహనరాయ్.

ఇంగ్లీషుభాష నభ్యసించటం నాగరకతకు, బ్రతుకుతెరువుకే కాదు సభ్యప్రపంచంలో మన అస్తిత్వాన్ని నిరూపించుకోవటానికి. ఖండాంతరాలలో మన సంస్కృతిని విస్తరింపచేయుటానికి ఇంగ్లీషు జ్ఞాన నేత్రం వంటిదని చెప్పిన క్రాంతదర్శి రామమోహన రాయ్. బ్రహ్మసమాజంతో గాఢమైన సంబంధం ఉన్న శ్రీమతి జమునా నాగ్ రచించిన రామమోహనరాయ్ జీవిత చరిత్ర, చరిత్రకారులకు, సంస్కృతిని గూర్చి తెలుసుకోగోరినవారికి ముఖ్యంగా సాంస్కృతిక పునరుజ్జీవన దశలో రామమోహనరాయ్ పాత్రను గుర్తించి తెలుసుకోగోరినవారికి బాగా ఉపకరిస్తుంది. జీవిత చరిత్రకారు లతిశయోక్తులకు లోనుకావటం, ఆరాధన భావంతో వాస్తవానికి దూరంగా వెళ్లిపోవటం అప్పుడప్పుడూ జరుగుతూంటుంది. శ్రీమతి జమునా నాగ్ సీతానాథ తత్వభూషణుల మనుమరాలు. ఆయన బ్రాహ్మ ధర్మనేత్త కావటంచేత రచయిత్రి అందించిన సమా

చారం నిర్దుష్టంగానూ, అధికారికంగానూ ఉన్నాయి. సుప్రసిద్ధ బ్రాహ్మ ధర్మప్రచారకులు శ్రీ తారకంగారు గ్రంథంలోని విషయాన్ని సుబోధకంగా తేటతెలుగులో అనువదించారు. 'రచనకైనా, అనువాదానికైనా నాకు అర్హత, సమర్థత లేవు' అని తారకంగారు చెప్పుకొన్నప్పటికీ యీ రచన చదివాక దీనిని అనువదించటానికి తగినవారు తారకంగారే అనిపిస్తుంది.

'తూర్పున ఉదయించి పడమట అస్తమించిన తేజోరాశి రామమోహనరాయ్' అన్న తారకంగారి మాటలు విస్మరింపరానివి. మొదటి అధ్యాయంలోనే రామమోహనరాయ్ అన్నగారైన జగన్మోహనుని భార్య అలోక్‌మంజరి సహగమనం చేసిన దృశ్యాన్ని వర్ణించారు. రామమోహనుడు సహగమనాన్ని వ్యతిరేకిస్తూ 'నాఅన్నను శాంతంగా పోనివ్వండి. చనిపోయినవాళ్లు బ్రతికిఉన్న వారిని తమతో కూడా రమ్మనరు. భర్తను కోల్పోయిన ఆమెను రక్షించండి' అని వేడుకుంటాడు. జనమెవ్వరూ లక్ష్యపెట్టరు. నీవు వెనుదిరుగు వదినా. మన స్త్రీలను ఈ అమానుషమైన ఆచారంనుండి విముక్తి పొందిస్తావు. వైధవ్యం పొందిన ఇతర నారీమణులను రక్షించి దేశానికి మహోపకారం చేసినదానవౌతావు' అని తన వదినను ప్రార్థిస్తాడు. కాని ఆమె 'శాస్త్రాలను ధిక్కరించినట్లయితే భగవంతునిచేత శిక్షింపబడతాను' అంటుంది. తర్వాత రామమోహనుని ఆవలకు నెట్టేసి 'అలోక్‌మంజరిని కాష్ఠానికి కట్టివేసి సంప్రదాయసిద్ధంగా అగ్నిసంస్కారం చేస్తారు. గుడిగోపురం ఆకారంలో అగ్నిజ్వాలలు ఆకాశాన్ని అందుకుంటాయి. ఎండవానలకు, గాలికి చివికిన కట్టెలన్నీ ఒకదాని తరువాత ఒకటి జారిపోతాయి. ఆ మంటలలోనుండి హఠాత్తుగా ఒక స్త్రీ ఆర్తనాదం వినబడుతుంది. ఆడవికంప అంతా మధ్యమధ్య ముక్కలు ముక్కలుగా విరిగిపడిపోతుంది. రగులుకొలపడానికి గాలి ఈల వేస్తుంది. 'నేనింక ఈ జ్వాలల్ని భరించలేను. ఈ వేడికి నా కళ్లు కనపడడంలేదు' అంటూ అలోక్ మంజరి ఆ బాధనుండి విముక్తి చెయ్యమని ప్రార్థిస్తుంది— ఈ వర్ణన చదివాక పుస్తకమంతా చదవాలన్న ఆసక్తి కలుగుతుంది. అంతేగాక రామమోహనరాయ్ మనస్సులో ఏ భావబీజం సహగమన దురాచారాన్ని వ్యతిరేకించటానికి కారణమైనదో చక్కగా తెలుస్తుంది.

సహగమన దురాచారాన్ని ఖండించి విజయం సాధిస్తే రామమోహనరాయ్ కేవలం మత సంస్కర్తగా మిగిలిపోయి ఉండేవాడు. బాల్యవివాహాలను అసహ్యించుకొనే స్థితికి వచ్చేసరికి రామమోహనునకు మూడు వివాహాలు పూర్తయినాయి. మొదటిభార్య మరణించిన కొద్దికాలానికే రెండోపెళ్లి, మరొక సంవత్సరానికే మూడోపెళ్లి అయింది. ఇద్దరు భార్యలతో కాపురం చెయ్యవలసిన స్థితి రామమోహనుని భావాలకు పూర్తిగా విరుద్ధం. కాని తప్పలేదు.

1818 నుండి కృషి ప్రారంభించిన రామమోహనరాయ్ 1929 డిసెంబరు 4 వ తేదీన దానిని బ్రిటీషు ప్రభుత్వం శాసనంగా రూపొందించేవరకు జరిపిన పోరాటం భారతదేశ చరిత్రలోనే మరపురాని అధ్యాయం. శాసనాన్ని రూపొందించిన ఖ్యాతి బెంటింక్ ప్రభువుదే కావచ్చు. సహగమనాన్ని విజ్ఞులైన మరికొందరు పెద్దలు కూడ వ్యతిరేకించి ఉండవచ్చు. కాని 1818 కి పూర్వమే ప్రారంభించి, దశాబ్దం వరకు విడిచిపెట్టక శాసనరూపమైన నిషేధాన్ని సాధించేవరకు కృషిచేసిన ఖ్యాతిమాత్రం రామమోహనునిదే అనటం నిర్వివాదమైన అంశం.

1828 ఆగస్టు 20 వ తేదీన రామమోహనుడు స్థాపించిన బ్రహ్మసభ పనిచేయటం ప్రారంభించింది. సభను స్థాపించటానికి క్రైస్తవ ఏకేశ్వరోపాసకుల 'హర్కారా' సంఘ ప్రభావమూ, తారాచంద్, చంద్రశేఖర్ అనేవారి తోడ్పాటూ ఉన్నాయి. చైతన్యం భారతదేశాన్ని కదిలించి ఎందరి హృదయాలనో కరుణార్ద్ర భావాలతో పునీతం చేసిన బ్రహ్మసమాజాన్ని స్థాపించిన ఖ్యాతి రామమోహనునిదే. ఇద్దరు తెలుగు బ్రాహ్మణ పండితుల వేదపఠనంతోనే అది ప్రారంభమైంది. 1820 ప్రాంతాలలో సహగమనం మొదలైన పూర్వాచారాలపై రామమోహనుని అభిప్రాయాలు సరికావని ఎదుర్కొన్న శంకరశాస్త్రి; సుబ్రహ్మణ్యశాస్త్రి అనేవారు మదరాసీయులు. రామమోహనుని ఎదుర్కొన్న ఆనాటి పండితుల విశ్వాసాలు ఎంత మూర్ఖంగా ఉండేవో, వాటినాయన ఎంత తార్కికజ్ఞానంతో ఎదుర్కొన్నాడో తెలుసుకొన్నప్పుడు రామమోహనుని పాండిత్యం చదువరులలో సంభ్రమాశ్చర్యాలను కలిగిస్తుంది.

రామమోహనరాయ్ బెంగాలీలోనేకాక సంస్కృతం, హీబ్రూ, గ్రీక్, ఇంగ్లీషు, అరబ్బీ, పారసీ భాషలలో గొప్ప పండితుడు. 'తుహీఫత్-ఉల్-మువాహిద్దీన్' (పరిశుద్ధాస్తికుల కొక బహుమానం) అనే పుస్తకాన్ని ఆయన 1803 నాటికే అరబ్బీ పారసీ భాషలలో వెలువరించాడు. 'మిరాత్-ఉల్-అఖ్‌బార్' (వార్తా దర్పణం) అనే వారపత్రికను పారసీభాషలో నడిపాడు. ఈ పత్రికా ప్రచురణను ప్రభుత్వం నిషేధించినపుడు, సుప్రీమ్‌కోర్టు కూడ వ్యతిరేకంగా తీర్పు చెప్పినపుడు పర్షియన్ భాషలో ఆ నాడాయన వ్రాసిన సంపాద కీయంలో 'హృదయంలోనుండి వంద రక్తబిందువు లతోకొన్న గౌరవాన్ని ఓ మహాశయా—ఏదో దయను ఆశించి ద్వారపాలకునికి అమ్మవద్దు' అన్న వాక్యాలు మరపురానివి.

ఢిల్లీలో మొగల్‌పాదుషా రెండవ అక్బర్ రామ మోహనుని తన రాయబారిగా నియమించాడు. ఆయనే రామమోహనునకు 'రాజా' అనే బిరుదిచ్చాడు. 1830లో రామమోహనరాయ్ ఇంగ్లాండు వెళ్ళాడు. అక్కడాయన కార్మికుల మెప్పునూ, విద్వాంసుల మెప్పునూ కూడ పొందగలిగాడు. ఇంగ్లండ్ ఉన్నతికి కారణం భారతదేశ దుస్థితియన్న రహస్యం ఆకళించుకొన్నాడు. ఒక వర్తక సంఘం భారతదేశాన్ని పాలించటంకంటె బ్రిటీషు రాచరికమే మేలని తలపోశాడు. ఇంగ్లండులో చాల ఆర్థికమైన చిక్కులకు కూడ లోనైనాడు. 1833 సెప్టెంబరు 27 న రామమోహనరాయ్, బ్రిష్టల్‌లో మరణించాడు. ఇప్పుడక్కడ భారతీయ పద్ధతిలో కట్టిన సమాధి ఉన్నది. అందరు సంస్కర్తలకువలె సంఘంచేత వెలివేయబడటమేకాక రామమోహనరాయ్ స్వజనంచేత ముఖ్యంగా కన్నతల్లిచేత వెలివేయబడినా చలించక చీకటిలోకి కాంతికిరణం వలె దూసుకు పోయాడు. తానెక్కడున్నా వెలుగు నిచ్చి, వెలుగు మిగిల్చి తెర మరుగయ్యాడు. ధన్యజీవి రామమోహన రాయ్ జీవిత చరిత్ర రచించి జమునా నాగ్ జిజ్ఞాసువు లకు మహోపకారం చేశారు. ఇంత మంచిపుస్తకం ప్రకటించిన ఎమెస్కోవారు, అనువదించిన తారకం గారు కొనియాడదగినవారు.

## స మ ర వి జ యు

(కవితా సంకలనం; ప్రచురణ:—శ్రీనివాస సాహితీ సమితి—హైదరాబాదు. ప్రతులకు:—శ్రీనివాస సాహితీ సమితి 1—1—336/58; వివేకనగర్—హైదరాబాదు—500020. 36 పేజీలు; వెల: రూ. 2.)

యుద్ధకాలంలో సంఘం సంక్షుభితం కావటమే కాదు సారస్వతరంగంలోను యుద్ధ బీభత్సం కొంత కన్పిస్తుంది. సైనికుడు ఏకాగ్రతతో ప్రాణాన్ని పణంగాపెట్టి శత్రువు నెదుర్కొంటూంటే కవి కలం పట్టి సైనికుని కీర్తిస్తూ, శత్రువును శపిస్తూ, జాతి ఐక్యతను ప్రబోధించటం పరిపాటి. పాకిస్థాన్‌తో జరిగిన యుద్ధ సమయంలో యువకులు నినాదప్రాయ మైనవి, ఉపన్యాస భాగాలవంటివీ, కేవలం తిట్లూ శాపనార్థాలతో నిండినవీ అయిన గీతాలను విరివిగా రచించి ప్రచురించారు. యుద్ధం ఆగిపోయినా ప్రజల కడగండ్లు తీరనట్లే సహృదయులకు కవితా సంకల నాల బెడద వదలలేదు. తాము రచించిన కావ్యఖండి కలు విస్మరించరానివని తలంచటంచేత కొందరు యువ కవులు తమ గీతికలను 'సమర విజయ' పేరుతో కావ్యసంకలనంగా వెలువరించారు. పాకిస్థాన్‌తో జరి గిన యుద్ధ సమయంలో వేలకొద్దీ గీతాలు వెలు వడినా సహృదయుల మనఃఫలకాలపై నిలిచినవి చాల కొద్ది. 'సమర విజయ'లో సహృదయుల నాకట్టు కొనే గీతాలు లేవు.

ఈ సంకలనంలో శ్రీయుతులు బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి; తుంగదుర్తి విశ్వనాథశాస్త్రి; మిరియాల రామకృష్ణ, గంధం జోయెల్ మొదలైన ఇరవైమంది రచించిన కావ్యఖండికలున్నాయి. శత్రు వుపై కోపముంటే చాలదు గదా! కావ్యరచనకు కావలసిన వ్యంగ్యోక్తి లేక చాల కవితలు నిస్తేజంగా ఉన్నాయి. ఉన్నంతలో బెల్లంకొండ; మిరియాల, సైబ పరంధాములుగారల కవితలు బాగున్నాయి. అవైనా క్షణికమై జ్వలించేవేగాని నిలిచి వెలిగేవి కావు మననం చేసుకోదగినవీ కావు.

'కవితా కాహళి' అనే ముందు మాటలో డా॥ సి. నారాయణరెడ్డిగారు 'సమర ఘట్టంలో స్వదేశ రక్షణకై కవుల గుండెల్లో తుకతుక ఉడికిన లావాగ్నుల ఆవిరులను చూపెటే కవితా సంపుటి యిది' అన్నారు. ఈ మాటలు పూర్తిగా అతిశయోక్తులు. ఆ ఆవిరులు

గీతాలలో మాత్రం లేవు. నారాయణరెడ్డిగారే అన్నట్లు యీ కవులు శబ్దం, శిల్పం, అంతర్లయ—వంటి గుణాలను దృష్టిలో పెట్టుకోలేదు.

—శ్రీ రామమోహనరాయ్.

## గాంధి తత్వము

(రచయిత: జి. వి. ఆర్. కృష్ణారావు, ప్రచురణ: రచయిత, గవర్నమెంట్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, మహబూబ్‌నగర్, వెల: రు. 2—50.)

'గాంధీజీ మరణించారంటే ఆయన భౌతిక కాయం మనని దూరమయింది గాని ఆశయాలూ, మాటలూ చేతలూ కాదు' అన్నారు ముందు మాటలో శ్రీ ఎం. సాంబశివమోహన్. 52 పుటలున్న ఈ పుస్తకాన్ని చదివితే తొలుత పేర్కొన్న అభిప్రాయానికి భిన్నమైన అభిప్రాయం కలగడంలో ఆశ్చర్యం లేదు. గాంధీ ప్రబోధాలను గాంధీతత్వము అంటున్నారు చాలామంది విజ్ఞులు. 'తత్వము' అనే పదాన్ని విశాలార్థంలో ఉపయోగించుతున్నారే గానీ 'శాస్త్రాలన్నింటికీ శాస్త్రం తత్వశాస్త్రమనే అర్థంలో ప్రయోగించడం లేదనిపించుతుంది ఈ మాటను. అయితే శ్రీ కృష్ణారావు విజ్ఞుడు. 'అణు విజ్ఞానం చాలా అభివృద్ధి చెందింది. 1 పుట మొదటి పేరాలోనే ఈ అంశాన్ని ఉపోద్ఘాతము నలే, పోనీ ప్రవేశికవలే ఇట నుదహరించిన రచయిత ఇదే దృష్టితో గాంధీ ప్రబోధాలను వస్తునిష్ఠంగా పరిశీలించితే బాగుండేది. 'ఆకాశాన్నంటగోరే మహోన్నత భవనాలు' (1వ పుట) అనే ప్రయోగం లోకంలో వాడుకలో ఉన్నదేగానీ ఆకాశమంటే యేమీ లేనిదని నిరూపితమయిన తరువాత ఈ ప్రయోగంలో ఔచిత్యం కనిపించదు. ఆంగ్లంలో ఆలోచించి తెలుగులో వ్రాయడంలో ఉన్న సంకటమే ఇది. 'చాలా ఎత్తుగా పెరిగే' అనే మాటలవంటివి పుష్కలంగా ఉన్నాయ్ తెలుగుభాషలో.

ప్రకృతిని జయించామా ?

'ప్రకృతిపై వైజ్ఞానికు డెన్ని విజయాలను సాధించినా కాలం—దేశం మనకెంత కైవశం అయినా ఎంత పెద్ద యంత్రాలను మనం కనిపెట్టి నిర్మించి వాడినా నిత్యజీవితంలో సుఖం శాంతి లేకపోతే—బతుకులు బరువైతే వానివల్ల ఏం ప్రయోజనం?' 2వ పుట. స్థూలంగా యీ వాక్యం, ముందు మాటలో నుంచి యీ విమర్శ ప్రారంభంలో నుదహరించిన వాక్యాలకు విరుద్ధంగా ఉన్నవి. ప్రకృతిని మానవుడు జయించాడనే మాట లోకంలో ప్రచారంలో ఉన్నది. కానీ శాస్త్రీయ దృక్పథం మాత్రం కాదు. ప్రకృతి సూత్రాలను అవగాహన చేసుకుంటున్నాడు మానవుడు. అదైనా ప్రకృతి సహాయంతోనే. అయితే ఇక్కడ ఒక వైరుధ్యం ఉన్నది. 'బతుకులు బరువులు కావడానికి' కారణం ప్రకృతిని గురించిన పరిశోధనల ఫలితాలు కాదు. ఆ ఫలితాలను మానవులందరికీ అందజెయ్యక పోవడమే కారణం. అందుకు కొంతకాలం పడుతుంది. అదొక పరిణామం. ఒక దశలోనుంచి మరొక దశ వస్తుంది. వర్తమానంలోని సంకటాలకూ, ఇరకాటలకూ గాంధీ ప్రబోధాలను అమలు జరపకపోవడానికీ ముడిపెట్టడం సరైన పద్ధతి కానేరదు.

గాంధీ వాదం :

'—తమ ఆలోచనలవల్ల, మాటలవల్ల, పనులవల్ల ఆచరణ ద్వారానూ ప్రకటించి విశ్వశ్రేయస్సు సాధించినారు' అన్నారు రచయిత 2వ పుటలో. అంతటితో ఆగితే బాగుండేది. 'అయితే మన దేశంలోనే గాంధేయుల సంఖ్య క్రమక్రమంగా తగ్గిపోవడం ఎందువల్ల జరుగుతున్నది' అని కూడా అంటున్నారు. పరస్పర వైరుధ్యం వ్యక్తం కావడంలేదా యీ వాక్యాలలో. విశ్వశ్రేయస్సును సాధించిన 'సిద్ధాంతం' క్రమక్రమంగా అంతరించిపోవడం జరుగుతున్నదంటే అర్థమేమిటి? (1) గాంధీ వాదం ఒక తత్వం కాదు. (2) గాంధీజీ చెప్పిన మాటలూ, చేసిన ప్రబోధాలూ, ఆచరణ ఒక ఎత్తుగడ లేదా వ్యూహం మాత్రమేనని గాంధేయులే నిరూపించుతున్నారు. (3) గాంధీ తత్వం ప్రత్యేక తత్వం కాదు. ఈ దేశంలో అలనాటినుంచీ అమలులో ఉండిన సిద్ధాంతాలనే క్లుప్తంగా గాంధీతత్వ మనడం వాడుక. అయిందని కూడా నిరూపించింది చరిత్ర.

శ్రీ కృష్ణారావు మేధావి. వారిని విమర్శించడం ఈ రచయిత ఉద్దేశం కాదు. కానీ ఒక మనవి. తెలు

గులో—ఆ మాటకు వస్తే ప్రతిభాషలోనూ కూడా—ప్రతి పదానికి తాత్వికమయిన, ప్రయోగార్థకమయిన, సందర్భానుసారమయిన అర్థాలుంటయ్ గదా. అటువంటప్పుడు ఆంగ్లంలోని 'మెటీరిలియలిస్ట్'లు అనే పదానికి తత్వశాస్త్రంలో ఒక అర్థం లేదా?—పదార్థవాదులు అని తెనిగించడం సమంజసం కాదా? 'విలువలు' మానవ నిర్మితాలనీ చాటి విద్యా సాంస్కృతిక రంగాలలో విప్లవాన్ని తెచ్చిపెట్టినది అంటున్నారు 4 వ పుటలో రచయిత. ఇక్కడ 'విలువలు' అనే పదాన్ని ఏ అర్థంలో ప్రయోగించారూ? అది అట్లా ఉంచండి. సత్యమనే పదానికి శ్రీ కృష్ణారావు చెప్పిన అర్థాన్ని మార్చుకొనడ మవసరం కాదా? 'జ్ఞానంలో ఉండేదే సత్యం' అనే నిర్వచన మొకటి ఉన్నది. జ్ఞానమనగా పరిసరాలను గురించిన పరిజ్ఞానం.

గాంధీ వాదంలో ప్రత్యేకత యేమీ లేదనడానికి 5 వ పుటలో 'ఉదహరించిన అహింసా పరమో ధర్మః' వంటివే నిదర్శనలు. కాక వ్యక్తిని సత్ ప్రవర్తనునిగా చెయ్యాలనే ఆకాంక్షతో మతాన్నీ రాజకీయ లక్ష్యాలన్నింటికలగాపులగం చేశారు. ఈ కలగాపులగం విధానాన్ని రైటానరబుల్ శ్రీనివాసశాస్త్రివంటి విజ్ఞులు వ్యతిరేకించిన సంగతి చరిత్ర ప్రసిద్ధము.

పోతే 'గాంధీజీ భారతీయ సంస్కృతిని చక్కగా అర్థము చేసుకొనిరి' అన్నాడు 5 వ పుటలో. సంస్కృతి అంటే శ్రీ కృష్ణారావుగారి అర్థం యేమిటి? 'గాంధీజీ అర్థం చేసుకున్నది భారతీయ సంస్కృతిని అవునో కాదో గానీ, భారతీయ ప్రజల మనస్తత్వాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకున్నారు' అన్నా డొక తత్త్వవేత్త.

'సత్యంతో నా ప్రయోగాలు' అనే గ్రంథంలో నిత్యసత్యాలని ఆవిష్కరించే ఉత్తమ రచన' అన్నారు 9 వ పుటలో రచయిత. నిత్యసత్యాలంటే యేమిటో వివరించి ఉంటే బాగుండేది—' మారుతున్న కాలంలో మారని సత్యాలుంటవా? ఉంటే వాటి స్వరూపమేమిటి?' అని ఎటూ అమలులోకి వస్తవి?' అని ప్రశ్నించాడు తత్త్వవేత్త.

మైఖేల్ బెకూనిన్ వలే అనార్కిజాన్ని శాస్త్రీయ పద్ధతిలో గాంధీజీ ప్రబోధించి ఉండలేదు. ఎర్నసేట్ హెకెల్‌వలే ఏకతాన్తైతిక విలువలను మానిస్‌టిక్ నిధిక్స్‌ను ప్రబోధించి ఉండలేదు. గాంధీజీ స్వరాజ్య సముపార్జనయే ఆయన లక్ష్యంగా ఉండెను. అందుకు ఉపయోగపడే యే పద్ధతి నయినాసరే వినియోగించడానికి వెనుకాడలేదు గాంధీజీ. బహిరంగంగా చెప్పారు కూడా ఆ సంగతి. అదొక ఆవేశం. ఆ ఆవేశం ఫలితాలను ఆర్థికంగానూ— సాంఘికంగానూ. రాజకీయంగానూ మాత్రమేకాక వైజ్ఞానికంగా కూడా ఈనాడు అనుభవించడం లేదా మనం ?

ఆర్థిక చిక్కులు :

స్వరాజ్య సముపార్జనలో పురుష యత్నానికి సంబంధించినంతవరకూ, గాంధీజీ నాయకత్వం ప్రశంసనీయమే. కానీ స్వరాజ్యమే స్వాతంత్ర్యం కాదని ఆనాడు ఉద్యమంలో పాల్గొన్నవారిలో చాలామంది గ్రహించలేదు. బ్రిటిష్‌వారు భారతదేశంనుంచి వైదొలగడమే తక్షణ లక్ష్యమని ప్రచారం చేసిన ఫలితంగా ఆర్థిక పునర్నిర్మాణమూ, వ్యక్తి వికాసమూ కించపడినవి. ఈనాటి మన స్థితి గతంలోని మన చేష్టల పర్యవసానాలలో ఒకటి.

సత్యాహింసలనే ఒక సిద్ధాంతం కాదు. లక్ష్యాలో, ఆదర్శాలో అయితే కావచ్చు. లక్ష్యాలయినా, ఆదర్శాలయినా మారనట్టివి మాత్రం కాదు. కానీ విచిత్ర మేమిటంటే సత్యాహింసలను గురించి తల కొక గ్రంథం వ్రాసి రకరకాల వ్యాఖ్యానాలు చెయ్యడం. హేతువాద దృష్టితో నేటి ఆర్థిక సమస్యలను పరిశీలించలేక, వాదనకు నిలబడనట్టి కారణాలను ప్రచారం చెయ్యడం.

'నివురుగప్పిన నిప్పువలె నిద్రాణమై యున్న మానవత్వాన్ని మనం ప్రజ్వలింపజేయగల్గితే—వారి మనస్సులను మార్చగలము' 11 వ పుట. ఇదుగో ఇదే అసలు చిక్కు—గాంధీ విధానాలతో. పేరుకు మాత్రమే గాంధీ శిష్యులున్నారు దేశంలో యీనాడు. మానవ స్వభావానికి విరుద్ధమయిన సిద్ధాంతాలను ప్రబోధించి వాటిని అమలు జరిపేవారు కరువైపోయినారేమని విచారపడడం గాంధేయ మార్గమా?

భాష :

ఈ పుస్తకంలోని తెలుగును గురించి చాలా చెప్పవలసి ఉన్నది. క్లుప్తంగా చెప్పకుందాము.

'నకలు చెయ్యమని' 8 వ పుట—అనే బదులు చూచి వ్రాయమని అని వ్రాస్తే బాగుండదా?

'పరిపాలన సాగించినారు' 7 వ పుట—అనే బదులు రాజ్య మేలారు అనడంలో ఔచిత్యం లేదా?

'వేధింప తొచ్చినవి' 11 వ పుట అనే బదులు వేధించ నారంభించినవి అనడం సరసంగా ఉండదా? 'తీవ్రముగా' అనే (11 వ పుట) బదులు 'కుణ్ణంగా', లేదా సాకల్యంగా ఆలోచించెను అనడంలో ఔచిత్యం లేదా. తప్పులను వెతకడం యీ విమర్శ లక్ష్యం కాదు. మన భాషను కనీసం విద్వాంసులయినా సక్రమంగా, ఔచిత్యానుసారంగా వాడాలని విన్నవించడం తప్పు కాదు గదా!

చైతన్యం కాదు :

'భారత జన సామాన్యంలో ఒక క్రొత్త చైతన్యం వెల్లివిరిసినది' 20 వ పుట. అది చైతన్యం కాదు. చైతన్యమనగా లక్ష్యమేమిటో తెలిసికొని, ఆ లక్ష్యం నెరవేరినతరువాత చెయ్యవలసిన పనులను సూచనగా నయినా రూపొందించుకుని లక్ష్యసాధనకు ఉపక్రమించటం. నెహ్రూ రిపోర్ట్ ఈపని కొంతవరకూ చేసినా అది సమగ్రంగా లేదు. వాదనకోసం ఉన్నదనుకున్నా స్వరాజ్యం సిద్ధించిన తరువాత ఏ ఒక్కపనీ కూడా అలనాటి ఊహల ప్రకారం జరగలేదు. కాబట్టి ఆనాడు 'జనసామాన్యంతో' వెల్లివిరిసినది చైతన్యం కాదేమో! ఆవేశమేమో!

ఆ తరువాత 'జనసామాన్యం' అన్నారు. సామాన్యులలో చాలామంది ఆ ఉద్యమానికి దూరంగానే ఉన్నారు. చదువుకున్నవారూ, న్యాయవాదులూ. డాక్టర్లవంటివారూ ఆ ఉద్యమంలో పాల్గొన్నారు. జనసామాన్యంలోనే నవచైతన్యం వెల్లివిరిసివుంటే వర్తమానంలోనే పరిస్థితులు మరొక విధంగా ఉండేవేమో!

జనాలు, జనసామాన్యం, ప్రజావాహిని, సాముదాయం అనే పదాలద్వారా ప్రజలను వ్యక్తులుగా, నెత్తురూ, మాంసమూ, చీమూ ఉండే వ్యక్తులుగా గౌరవించడం మాత్రం జరగదు. వ్యక్తులుగా గౌరవించనంతకాలమూ వ్యక్తులు తమ సమస్యల పరిష్కారానికి ఉపక్రమించరు. అది జరగనంతకాలమూ ప్రజలలో చైతన్యం లేనట్లేనేమో! అటువంటి చైతన్యానికి ఉపయోగపడే విద్యా ప్రచారం సామాన్యులలో జరిగేరోజు రానంతకాలమూ గాంధీ తత్వం గతించి నెమరు వేసుకొని ప్రయోజనమేమిటి?

ఏమయినా 52 పుటలల సరళంగా గాంధీ తత్వం వ్రాసిన శ్రీ కృష్ణారావును అభినందించకుండా ఉండలేము. విజ్ఞులు చదవదగిన పుస్తకం ఇది. చదివి ఆలోచించాలి? ఆలోచించేందుకు తీరిక యేదీ మనకు? ఉన్నదంటారా?

—శ్రీ కథాధర్.

## పనిమనిషి

(రచన—ముళ్లపూడి సచ్చిదానందమూర్తి, వెల—రెండు రూపాయలు. సాహిత్యరంజని, 7—355 యాకూత్‌పుర, బ్రాహ్మణవీధి, హైదరాబాదు—23.)

మానుకోట (మహబూబాబాద్) కాలేజీ ఆంధ్రోపన్యాసకులు శ్రీ ముళ్లపూడి సచ్చిదానందమూర్తి ఎం. ఏ. గారు పదేళ్ల మధ్యకాలంలో వ్రాసిన ఆరు కథలున్న చిన్న సంపుటి యిది. వానిలోని మొదటి కథ పేరే పుస్తకానికి పెట్టేరు.

ఈ ఆరు కథలలోనూ రెండు ఈనాడు ప్రజానీకాన్ని కల్లోలపరుస్తున్న దొంగవర్తకం, కల్తీలు, అధికధరలు, అధికారుల సిగ్గుమాలినతనం, లంచగొండితనం గురించినవి.

'ఇది కథ కాదు'లో ఈ బాధల గురించి 'ప్రజల గోల కర్థంలేదు. ఈ ఆందోళన, యీ అలజడి, ఈ ఆలోచన ఎన్నికలకు ముందుంచవలసింది. ఇప్పుడేడిస్తే ఏం లాభం' అని ఒక వర్తకుడిచేత అనిపిస్తారు.

కాని ఆహారధాన్యాలు ఆ అభిప్రాయంతో ఏకీభవించవు. 'ఆకలున్నవాడికీ, అవసరమున్నవాడికీ ఆలోచన వుంటుంది...నిజం ప్రజలకు చెప్పు. బుద్ధికలిగి భుజంభుజం కలపండి' అని పేరుపేరునా పేద వర్గాలని హెచ్చరిస్తాయి. ఈ భేదం గమనార్హం!

అధ్యక్షోపన్యాసం ప్రజాపీడకులంతా పరస్పర సహకారం నెరవుకుంటూ ప్రజలనెల్లా మోసగిస్తున్నారో వర్ణించే అవహేళనాత్మకమైన కథ.

విద్యాసంస్థలు నేడు చదువుకు గాక అజ్ఞానానికీ, కుటిల రాజకీయాలకూ కేంద్రం కావడం చూసి పరితాపం తెలుపుతున్న కథ పట్టాభిషేకం.

మధ్యతరగతి కుటుంబాలలో ఇంటిపనివాళ్ల సమస్యలను వర్ణించే వినోదాత్మకమైన కథ పనిమనిషి.

ఇవిగాక 'శోభ అనే అమ్మాయి', 'సిరితా వచ్చిన వచ్చును' అనే మరో రెండు కథ లున్నాయి.

రచయిత తమ 'ముందుమాట'లో కథలో వస్తువుకన్న శిల్పానికి ప్రాధాన్యం ఎన్నుకొన్నారు. కాని ఇక్కడ ఈ కథలలో రచయిత యెత్తుకొన్న కథా వస్తువు నిత్యజీవిత సమస్య అయివుండడమే వానిలోని ఆకర్షణ. శిల్పదృష్ట్యా అవన్నీ చాలా చాలా సాధారణంగా వున్నాయి.

పైగా కథా శిల్పానికి ఫూటా కలిగించినా, శ్రేష్ఠత సమకూర్చినా రచయిత వుపయోగించే భాషకు ప్రత్యేక స్థానం వుంది. ఈ కథా రచయిత సంస్కృత సమాసాలమీది మోజుతో సాఫీగా నడుస్తున్న తెలుగు వాక్యాలమధ్య సుదీర్ఘ సమాసాలను చొప్పించి 'కరేల్'డు మనిపిస్తారు.

'మనోజ్ఞ సుందర హిమబిందు స దోహ పరీవృత గిరిదేశరాజ్ఞీ సందర్శనా ప్రభావ ప్రేరితుడనై కథలు రాశాను.' (పుట. 33.)

'ఇదే చూపు లోక చిత్రకారు నద్భుత సౌందర్య కళాఖండి ని ర్మాణ కార్యారంభానికి ప్రేరేపిస్తాయి.' (పుట. 38.)

'అహిమ సమీర వీచిక' మొదలైనవి.

ఇవన్నీ 'శోభ అనే అమ్మాయి' కథకే పరిమితం కావడం చూస్తే కథావస్తువును బట్టే భాషలో వైవిధ్యం శిల్పానికి అవసరమనే అభిప్రాయంతో వ్రాయలేదు గదా అనిపిస్తుంది. కొంతవరకు ఆ అభిప్రాయం సరియైనదే అయినా, ఎక్కడా కూడా భాష ఒకే తీరున సాగడం ముఖ్యం. ఎగుడుదిగుడు నడక శిల్పానికి ఫూటాయే కలిగిస్తుంది.

'శకుంతల కిలారుమని నవ్వి'

'కిలారుమని నవ్వడం'—ఈ పదం కొత్తగా వుంది. 'కిలకిలా నవ్వడం' వుంది. 'బిళ్లీ కిలకిలా నవ్వేది'యంటూ ఈ రచయితే వేరొక చోట వుపయోగించారు. కిలారుమనే ప్రయోగం ప్రాంతీయమో, వ్రాత పొరపాటో, అచ్చు తప్పో మరి!

అలాగే 'చింతపండురెక్క' అనే ప్రయోగం. ముద్దగావుండే పదార్థంతో చిన్న అంశను తెలపడానికి 'రెక్క' అని వాడుతారా?? ఉల్లిపాయవంటివాని విషయంలో ఆ పదం వాడుతారు. పిసరు, ఖద్దు, రెక్క, గింజ, మొదలయినవి ఆయా పదార్థాల స్వరూప స్వభావాలనుపట్టి అంశార్థకాలుగా వుపయోగించబడుతున్నాయి.

'లంకపిండి' అనే ప్రయోగం వుంది. ఏమిటా పిండి?—

అలాగే 'కట్మలిజం నశించాలి' అనే ప్రయోగంలో 'కట్మలిజం' అంటే, నల్లిబ్రతుకు అనా?

ప్రాంతీయ పరిభాషలూ, పదబంధాలూ సమకూర్చుకొని తెలుగుభాష సంపన్నం కావలసిన ఈ తరుణంలో రచయితలు పదప్రయోగాల విషయంలో, అచ్చు తప్పుల విషయంలో, ఇతర భాషాపదాలు, ప్రాంతీయ పదాల వివరణ విషయంలో ఓపిక చూపించడం అవసరం. అటువంటి బాధ్యత విద్వాంసులైన సచ్చిదానందమూర్తిగారివంటి వారిమీద అధికంగా వుంటుంది.

## లో క ం

(రచన: బోయ జంగయ్య. వెల: రు. 1—50. ప్రచురణ : సాహితీమిత్రులు, నల్గొండ (ఆం. ప్ర.)

బోయ జంగయ్యగారు వ్రాసిన కథల సంపుటి. దీనితో అయిదు కథ లున్నాయి. పల్లె ప్రజలలోని మూఢ విశ్వాసాలు, వాని నుపయోగించుకొని గ్రామాలలోని స్వార్థపరులు సాగించే దుర్నయాలు కళ్లకు కటినట్లు చూపుతుంది గత్తర కథ.

కులాహంకారం, అర్థంలేని కుటుంబ ప్రతిష్ఠల పేరుతో కోడలికి విషం పెట్టడానికి కూడా వెనుదియ్యని కిరాతకుల్ని చూపుతుంది 'కేసు వాయిదా పడింది'—కథ.

పడుచుకారు కుర్రవాళ్లు బాధ్యతారహితంగా వీధినపోయే ఆడవాళ్లను గోలచేసి అల్లరిపెడతారు. దానిని ఎవరూ హర్షించరు. కాని అర్థరహితమైన అనుమానాలతో స్త్రీలు తమకు అతి సన్నిహితులనూ ప్రేమాస్పదులనూ, తమకెంతో సాయపడినవారినీ నిజంగా ఏడిపిస్తారు. ఈ విషయాన్ని గుర్తించక పోవడమే కాదు, అహింసాకాండకు విత్తనం వేసేది కూడా లోకమే నంటారు లోకం కథలో.

గ్రామ ప్రజలు హింసిస్తే సహిస్తుంది. మగని రాకకు భయపడినా, అతడు నిర్లక్ష్యం చేసినా లెక్క చేయదు— స్త్రీ తన మనసు నిలిచినచోటును ప్రాణపదంగా చూసుకొంటుంది. కాని, ఇంత త్యాగంచేసి. కష్టాలు భరించినా, మనసుకాడు తృణీకరిస్తే భరించదు. సహించదు అంటుంది మనసు కథ.

దేశవిభజన (1947) నాడు జరిగిన, నాడు సాగిన దారుణ మారణకాండను, విధ్వంసాన్నీ కూడ మరచి, పక్కకుపెట్టి భారతప్రజ 1971 లో యాహ్యాసేనల దురంత చర్యలకు నిలవలేక, కాందిశీకులుగా పారివచ్చిన బాంగ్లా ప్రజను ఎల్లా ఆదుకొన్నదీ తెలిపే కథ 'గాంధీ పుట్టిన దేశం.'

కథలవస్తువు చాల గంభీరమూ, ఉదాత్తమూగా వుంది. కథ చెప్పిన తీరూ, నడిపిన తీరూ చక్కగావుంది. కాని ఇంచుమించు ప్రతి కథలోనూ అనవసరమైన మలుపు తేవడం కనిపిస్తుంది. ప్రతిచోటా ఆ మలుపు కథావస్తువులోని ఉదాత్తతకు నష్టకరమే అవడం కనిపిస్తుంది కూడా.

'మనసు' కథలో ప్రేమికులైన లక్ష్మినీ, వర్సయ్యనూ గ్రామస్తులు అవమానిస్తున్న ఘట్టంలో లక్ష్మి మగడు మల్లయ్యను ప్రవేశపెట్టడం అటువంటిదే.

ఆలాగే గాంధీ పుట్టిన దేశంలో—కాందిశీకుడై వచ్చిన కాశింకు భారతదేశం ఆశ్రయం ఇచ్చిందనేటప్పుడు కొంచెం వెనుకటి రోజులలో హత్యచేసిన ఒక హిందువుని కొడుకే అతనికాశ్రయం, రక్షణ కల్పించినట్లు చెప్పడం కథకు ఉదాత్తత కలిగించడానికి బదులు మన సంకుచితత్వాన్ని తెలుపుతుంది. మన దేశానికి కాందిశీకులయి వచ్చిన కోటిమంది బాంగ్లాప్రజలూ 1947 లో హత్యాకాండలు జరిపిన వారేకాదు. అంతేకాదు. ఆనాడు భారత భూభాగంలో జరిగిన దుర్ణయాలు తక్కువదేంకాదు. కాని కాందిశీకులు వానిని గుర్తుపెట్టుకోలేదు. వారికాశ్రయం ఇచ్చిన భారతదేశమూ ఆనాటి కథలు తలపొయ్యలేదు. మానవత్వం ఒక్కటే అక్కడ నిలబడింది. స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న ప్రజలకు సాయం ఇవ్వాలనే దొక్కటే భారతదేశ లక్ష్యం. దానివలన ఆనుషంగికంగా కొన్ని రాజకీయ లాభాలుండవచ్చు. వానినే నొక్కుతూ ప్రధానమైన మానవత్వదృక్పథాన్ని విస్మరించి వ్యవహరించిన అమెరికా, చైనా మొదలైన దేశాలు తమ దుష్ట ప్రయత్నాలలో వైఫల్యమే పొందేయి. వాని ఆలోచనలనే మనం మరొక రూపంలో చెప్పబోవడం కథా వస్తువునే మలినపరచినట్లయింది.

కేసు వాయిదా పడిందిలో—కులాహంకారంతో రంగారావు కోడలుకోసం పంపిన విషాహారాన్ని కొడుకు తిని మరణించేడని చెప్పడం ఒకరికి అపకారం తలపెడితే నువ్వే నష్ట పడతావని నీతి చెప్పడానికి వుపయోగిస్తుందేమోగాని కథకు దీప్తి నివ్వదు. కులాహంకారం, ధనాశవంటి మనోవైక్లబ్యాలు అపకారాచరణలో తన పరభేదం చూడవు.

స్వార్థదృష్టితో కరణం వూళ్లోకి హాస్పిటలు డాక్టరు రాకుండా అడ్డు తగిలాడు. గ్రామస్తుల మూరత్వాన్ని వుపయోగించుకొని, మారయ్యని హతమార్చాలనే దృష్టితో జననాశనం చేస్తున్న కలరా వ్యాధికి వైద్యసహాయం లేకుండా చేసేడు. ఆ వ్యాధి ప్రబలడానికి కారకుడని మారయ్యమీద ప్రజలను రెచ్చగొట్టి అతనిని చంపించేడు.

చాలు. ప్రజల మూర్ఖత్వం, స్వార్థపరుల దుర్ణయాలు కళ్లకు కట్టినట్లు చిత్రింపబడతాయి.

ఈ ఘట్టంలో కరణానికే కలరావచ్చి, వైద్య సహాయం అందేలోపున మరణించినట్లు మలుపుతేవడం

కథ కేవిధంగానూ తోడ్పడదు. చెరపకురా చెడెదవు—అనే నీతిపాఠం చెప్పడం అవుతుంది. అది కథ బిగువును చెడగొడుతుంది.

జీవితంలోంచి కథకు వస్తువును వేరుచేసి చక్కగా చిత్రించగల నేర్పువున్న కథా రచయిత శ్రీ బోయి జంగయ్య. కథ ఎక్కడ ఎత్తుకోవాలి? ఎంత వరకూ చెప్పాలి ? ఎక్కడ నిలపాలనేది శిల్పాలకి సంబంధించినది. అది కృషితో సాధించ తగినది. త్వరలోనే శ్రీ జంగయ్య దానినీ సాధించగలరనే ఆశాభావం కలిగిస్తూంది 'లోకం' కథ.

—'అవంతి'

## ఎ స్తే రు

(దృశ్యకావ్యము. రచన: శ్రీ బి. పురుషోత్తం, డెమ్మీసైజు 50+114 పుటలు. వెల: 4 రూ. ప్రతులకు—శ్రీనివాస బుక్ డిపో, తిరుపతి.(ఆం. ప్ర.) అని గాని, 'కవిరత్న బి. పురుషోత్తం, రేణిగుంట' అని గాని వ్రాయనగును.)

క్రైస్తవ మతానికి సంబంధించిన ఈ నాటకల ఏడంకాల పరిమితి గలది. బైబిలులోని 'ఎస్తేరు' కథ ఆధారంగా రచించబడింది.

పారశీక చక్రవర్తిపయి హామాను మహామంత్రి కుట్రపన్నడం మొర్దెకై కనిపెట్టి ఎస్తేరు రాణికి తెలియజేశాడు. ఆమె చక్రవర్తినీ, హామానునూ విందుకు పిలిపించి, ఆ సమయంలో హామాను పన్నిన కుట్రను వివరించింది. రాజు వెంటనే హామాను మంత్రికి మరణదండనను విధించి, యూదులను నిర్మూలించడానికి ఇదివరలో జారీ చేయబడిన ఆజ్ఞను ఉపసంహరించాడు. ఈ విధంగా ఎస్తేరురాణి రాజును కాపాడడమే కాకుండా తన జాతికి రానున్న విపత్తును తప్పించి తన ఉత్తమ స్వభావాన్ని వెల్లడించింది. ఈ నాటకంలోని ప్రధాన కథాంశం ఇది. రసపోషణకు అనుగుణంగా ఇందు కొత్తపాత్రల ప్రవేశం, కథా సన్నివేశంలో కొన్ని మార్పులు కల్పించబడినవి.

'ఎస్తేరు' నకు 'సిగబంతి' ని అలంకరించిన విద్యారత్న కళాప్రపూర్ణ శ్రీ నిడుదవోలు వెంకటరావు గారు 31 పేజీలలో ఈ రచయిత, బైబిలలోని కథాంశం, క్రైస్తవ వాఙ్మయం, తెలుగు నాటకాలు, ఎస్తేరు వైశిష్ట్యం, అంక విభాగానుసారంగా కథా వివరణం, చేర్పులు మార్పులు, ఆంధ్రనాటక శత జయంతి మున్నగు విషయాలనుగూర్చి వివరిస్తూ, చివర తమ 'ప్రశంసాకృతి'ని కూడా చేర్చారు.

క్రైస్తవ వాఙ్మయాన్ని గురించి, పురుషోత్తము కవిని గురించీ వెంకటరావుగారిలా తెలుపుతున్నారు —

"స్వాతంత్ర్యావతరణమై వెనుక మన మింత వరకును క్రైస్తవ మత సంస్కృతులనుగూర్చి మన వాఙ్మయమున నేమున్నదో పరిశీలింపనే లేదు. అందువలన మన వాఙ్మయచరిత్ర మసమగ్ర మగుచున్నది. ఈ నాడాంధ్రవాఙ్మయ చరిత్ర సంపూర్ణముగా వెలువడవలెనన్న ఆధునిక యుగమున క్రైస్తవ వాఙ్మయమును గూర్చి పరిశోధన జరుపుట అత్యావశ్యకము. (పు XXX)

విశ్వజనీనమై విశిష్టమైన క్రైస్తవమతమున కాధారమైన బైబిలునకు తెలుగుదేశమున పట్టిన విపరీత పరిస్థితిని గమనించి, దానిని తమ రచనల చేత నుజ్జీవింపఁజేయుటకు నేకైకదీక్ష పూనినవారు శ్రీ బి. పురుషోత్తము గారు. పండువంటి ప్రభుత్వోద్యోగమును వదలి తమ జీవితసర్వస్వము క్రైస్తవ మతమునకు, క్రైస్తవ సేవకు నంకితము గావించినారు.'

(పుట. iii.)

క్రైస్తవ వాఙ్మయాన్ని గురించి ఎన్నో విషయాలున్న ఈ 'సిగబంతి'లో కొన్ని దశాబ్దాల క్రిందట కాకినాడ మెక్లారిన్ హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులు, సుప్రసిద్ధ కవులు, బహుగ్రంథకర్తలు శ్రీ వి. వి. ఎల్. నరసింహారావుగారు రచించి, ప్రకటించిన 'శ్లీవాంకము' (Sign of the Cross) అనే నాటకాన్ని గురించి ప్రస్తావింపబడనే లేదు. అది గణనీయమైన గ్రంథం.

రచయిత దీనికి కూర్చిన 'ఎస్తేరు చరిత్ర పెందలము' చరిత్రకారులకు ఎంతో ఉపయోగకరం. ఈ నాటకం చరిత్రాత్మకమైనదే అని ఇది నిరూపిస్తుంది.

రంగవిభాగంతో కూడా ఏడంకాల పరిమితిగల ఈ నాటకం శ్రీ చిలకమర్తివారు మున్నగు నాటక కర్తల నాటకాల మార్గాన్నే అనుసరిస్తుంది. వాటిలో వలెనే పద్యాలెక్కువగా కానవస్తున్నవి. ఇందులో పాత్రోచితభాష వాడబడుట ఒక విశేషం.

ఇందులో రచన యింపుగా సాగింది. పద్యాలు అందరికీ సులభంగా అర్థమయే రీతిని సరళంగా నడిచినవి.

'ప్రైడికాను కంటఁ బడినంతనే చాలు
ఓపలేను చేతి నొడ్డలేను,
కల్లుకుండ నాకుఁ గనిపించుటే చాలు
సైపలేను కోర్కి నాపలేను.' (పుట. 32)

'దినమణి కీడుగాఁగల సు
ధీమణి భూధవుఁ; డైననేమి? సూ
ర్యునిగతి యెల్లకాలముల
లోక్యతెఱంగున నుండకే గదా
జనములు దీపికావళుల
సాయముఁ బొందుట, దివ్వెలైన మీ
మనముల మేలుకొల్పుఁ డను
మానము మానుచు ధీరచిత్తులై.'

(పుట. 54)

రచయిత రచనా పాటవాన్ని తెలుసుకోడానికి ఈ రెండు పద్యాలూ చాలును.

రచయిత కొన్ని స్వతంత్ర ప్రయోగాలను చేశారు, రూపకల్పన చేసి. పెందలము — పెను + తలము (Back Ground) పరసీక = (పారశీకము) ప్రమాత = (తెలిసినవాఁడు), సమున్నద్ధుఁడు= (చదువని తన్ను చదువరిగా నెంచుకొనువాఁడు). వితథము = (వ్యర్థము) ఖలతాలువు = (కొండ). గైరికము = (బంగారము) — మున్నగునవి కొంత వింతగా కనబడుతున్నవి.

ఆంధ్రనాటక శతజయంతి సందర్భంలో ఇది ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సెలర్ శ్రీ ఎల్. బుల్లయ్యగారికీ, వారి సతీమణి సంయుక్తాదేవిగారికీ అంకితమియ్యబడింది. డాక్టర్ జి. ఎన్. రెడ్డిగారు, మహాకవి చేబ్రోలు సుబ్రహ్మణ్యశర్మగారు దీనిపయి సదభిప్రాయాలను ఇచ్చియున్నారు.

మైసూరు విశ్వవిద్యాలయంలోను, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలోనూ పఠనీయంగా ఉండడమే దీని విశిష్టతను తెలుపుతున్నది.

## సమర్థుని మరణయాత్ర

(కవితా సంకలనం. రచయిత, శ్రీ నిష్ఠల— వెంకటరావు, డెమ్మీ 63 పేజీలు. వెల 2 రూ. ప్రచురణ–ట్వెంటీఫస్ట్ సెంచరీ రైటర్స్, 26–3–22 దాసన్నపేట, విజయనగరం—531202.)

ఇదివరలో గోపీచంద్‌గారి 'అసమర్థుని జీవయాత్ర' సుప్రసిద్ధంగా ఉంది. కృష్ణపక్షాన్ని సవాల్ చేస్తూ వెలువడిన శుక్లపక్షం వంటిది కాకపోయినా— గోపీచంద్‌గారి గ్రంథనామం నచ్చిన కారణానో, యేమో దాన్ని ఇమిటేట్ చేస్తూ ఈ పేరు పెట్టబడింది. ఆ పేరు గల కవితకూడా ఇందులో ఒకటి ఉన్నది.

గ్రంథ స్వరూపమే కొత్తదనాన్ని చాటుతున్నది. కవితా శీర్షికలు కవితకు ఆరంభంలో కాకుండా కవిత మధ్యను ఇయ్యబడినవి. కవిత ముగిసిన పేజీలో స్థలం ఉంటే ప్రకటనలకు ఉపయోగించడం మరొక విశేషం. ఇరవయ్యొకటో శతాబ్ది గ్రంథ పద్ధతికి ఇది సూచకమేమో !

'అందరూ ముందు చూపే చూస్తారు. అందులోనూ యువతరం ఎల్లప్పుడూ తరంగాలుగానే ఉండాలని చూస్తుంది. అలా ఉంగలగడానికి ఈ కవి చేసే ప్రయత్నం మనం సంతోషించడానికి మంచి కారణం' అని నవ్యకవులలో ప్రముఖులైన రాచకొండ విశ్వనాథశాస్త్రిగా రంటున్నారు.

'సమర్థుని మరణయాత్ర' ఒక ఫక్కీకి చెందింది కాదు. యిది నూరుపాళ్లా కొత్త ఊపిరితో పుట్టింది. థియరీ, యిమాజినేషన్ — యింకా చాలా చాలా మనల్ని గేలం వేస్తాయి యిందులో — మళ్లీ కొత్తగా బళ్లో వేసినట్లు' అని కొండపల్లి శ్రీనివాస మూర్తిగా రంటున్నారు.

ఇందులో పదకొండు కవితలున్నవి. ముద్రణలో వైవిధ్యం చూపాలనో, పుటలు తగ్గించాలనో చివరి రెండు కవితలు డబుల్ కాలంలో అచ్చువెయ్యబడినవి. ఇవన్నీ ట్వం. సిం. రైసంఘం ప్రారంభానికి రెండేళ్లకు ముందే రచించబడిననీ, కొంత ప్రచారంకోసం సంస్థ పేరుమీద ప్రచురించడం జరుగుతున్నదనీ రచయిత (N. V. R) చెప్తున్నారు.

ఇప్పుడు వస్తున్న చాలా నవ్యకవితలవలెనే ఇందలి కవితలను చదివిన తర్వాత 'దీన్ని భావమేమి తిరుమలేశ' అని అనుకోవలసి వస్తున్నది.

రచనా పద్ధతి కొక ఉదాహరణము—

'అలి వుంది చూలి వుంది
కొడుకుపేరు ముందు వుంది
అత్తవారు వచ్చి వెళ్లిరి
చెంత అమ్మని తీసుకెళ్లిరి.
కొడుకు వచ్చను సంబరంతో
చెప్పబోయెను అంబరంతో
చెప్ప చూసిన తాటియాకులు
ఎక్కిరించెను తిరిగి వెలికలు
గుడిసెలోని గంగరాజుకు
లేదు నీలం ఒక్కరోజుకు,
ఊరు తిరుపతి కాదు కడియం
బిచ్చమెత్తుకు వచ్చు బిడియం.'

కవిత లన్నిట్లోనూ అంత్యానుప్రాస కాన వస్తున్నది— ఎక్కడో కొద్దిచోట్ల తప్ప. నవకవులు కొందరు ఈ నియమం అక్కర్లేదంటున్నారు. కాని ట్వంటీ ఫస్ట్ సెంచరీలో కూడా ఈ నియమానికి గౌరవం ఉందన్నమాట, కవితావస్తు వెలా ఉన్నా?

ఇందులో వినోదకవిత్వమే విరివిగా కాన వస్తున్నది.

—'అంగీరస'

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-600001 Editor : S. Radhakrishna.